అవమానకరం. ప్రతీకారం చేయాలి. రజనిజీవితాన్ని తను యిష్టం వచ్చినట్టు శాసించలేడని తెలిసివచ్చేట్టు చేయాలి. గుండె దిటవు చేసుకుని రజని తల్లితో చెప్పేసింది స్పష్టంగా. అందరూ ఆశ్చర్యపోయారు. జగన్ చెప్పాపెట్టకుండా ఊరు విడిచి వెళ్లినప్పుడే ఇద్దరికీ పొరపొచ్చాలేవో వొచ్చాయని అనుకున్నారు. రజనికి ఉత్తరంకూడా రాకపోయేటప్పటికి అది రూఢి అయింది. ఇప్పుడు రజని తను జగన్‌ని చేసుకోనని చెప్పటంతో ఆ సంగతి పూర్తిగా స్పష్టమైపోయింది. ఎన్నో నచ్చచెప్పాను. జగన్ వచ్చిందాకా ఆగి సంగతేమిటో తేల్చుకుందా మనుకున్నారు. కాని రజని కచ్చితంగా తన నిర్ణయానికి తిరుగు లేదని చెప్పటంతోనూ, జగన్ వెళ్ళి ఏడెనిమిది నెలలయినా ఉత్తరం కూడా లేకపోవటంతోనూ, వేరే సంబంధం చూసే ప్రయత్నంలో పడ్డారు.

ఈ మధ్యలోనే దాసుకి డిస్ట్రిక్ట్ మున్సిఫ్ సెలెక్షన్ వచ్చింది. హుషారుగా డాక్టర్‌తో చెప్పాడు. డాక్టర్ కంగ్రాట్యులేషన్స చెప్పాడు. దాసు ముఖ్యులకి విందొకటి ఏర్పాటుచేశాడు. జగన్ ఊరు విడిచి వెళ్లినప్పటినుంచీ డాక్టర్ మనసు మనసులో లేదు. అతనిలో ఉత్సాహం తగ్గిపోయింది. ఏ కారణంవల్ల అతను ఊరు విడిచి వెళ్లిపోయి ఎవరికీ తెలియకుండా దాక్కున్నాడో తెలియక బాధపడ్డాడు. రజనికి కూడా ఉత్తరం లేదని తెలిసేసరికి వాళ్లిద్దరి మధ్యా ఏవో భేదాభిప్రాయాలు వచ్చిఉంటాయనీ, అందుకే తిరిగి ముఖం చూపించటం ఇష్టంలేక రాలేదనీ, చివరికి తనకు రాయకపోవటానికి కూడా అడ్రసు తెలుస్తుందనే కారణంవల్ల నేననీ

తీర్మానించాడు. దాసు పిలిచిన విందుకి వెళ్ళటం ఇష్టంలేక పోయినా వెళ్ళకపోతే బాగుండదని హాజరయ్యాడు.

దాసుకి కూడా జగన్ వెళ్ళిపోయిన కారణం మొదట తెలీలేదు. తర్వాత రజనితో మాట్లాడితే అతనికి విషయం కొంత స్పష్టమైంది. రజని అతన్ని తిరస్కరించిందనీ, దాంతో అతనికి విరక్తి కలిగి వెళ్ళిపోయాడనీ అనుకున్నాడు. ఆ తర్వాత ఇద్దరూ ఒకరంటే ఒకరికి అయిష్టత కలిగి పెళ్ళికిష్టపడలేదనీ అభిప్రాయపడ్డాడు. విందులో జగన్ లేకపోవటం అందరికీ పెద్ద లోపంగా ఉంది. రజని ఇంటికి వచ్చి రాత్రంతా ఏడ్చింది. తెల్లారి తన బలహీనతకి తిట్టుకుంది. లేనిపోని వ్యామోహంతో తనెందుకు బాధపడాలి. ప్రతీకారం చేసి తీరాలనుకుంది. తను లేకపోతే తన జీవితం వట్టి ఎడారి అని భ్రమించి ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించినవాడికి నీతిపాఠం చెప్పటం తన కర్తవ్యం.

జగన్ సంబంధం కాదని తేలిపోయేటప్పటికి రజని తండ్రి దృష్టిలోనికి దాసు వచ్చాడు. గెజిటెడ్ ఆఫీసరయ్యాడు. ఆస్తి ఎక్కువ లేకపోయినా ఇబ్బంది లేదనుకున్నాడు. ఈ మాట రజనితో అనేసరికి ఆమెగుండెలు గతుక్కుమన్నాయి. ఆ భావాన్ని ఆమె సరిపెట్టుకోలేకపోయింది. కాని దాసుదగ్గర ఈ ప్రసక్తి వచ్చినప్పుడు అతను ఇష్టపడట్లే మాట్లాడాడని తెలిసి తండ్రి రజనిని కొంత బలవంతం చేశాడు. మంచి పదవిలో ఉన్నవాడు, తెలిసినవాడు. ఒకసారి రజనితో దాసే ఈ విషయం కదిపాడు. ఆమె ఆలోచించి చెబుతానంది. నిర్ణయంచేసే సమయంలో ఆమె

గుండెలు దడదడ లాడాయి. హృదయంలో ఏమూలో 'రజనీ' అని జగన్ పిలిచినట్టయింది. ఆరోజల్లా ఏడ్చింది. కాని మళ్ళీ గుండె దిటవు చేసుకుని తన అంగీకారాన్ని తెలిపింది. దాసు సంతోషించాడు.

శుభలేఖలు అచ్చయేదాకా డాక్టరుకి ఈ విషయం తెలియలేదు. రజని వివాహం నిరాడంబరంగా జరగాలని అంది. శుభలేఖలు కూడా కొద్దిమంది మిత్రులకీ, బంధువులకీ మాత్రం పంపటం జరిగింది. వివాహం నిశ్చయమైందని తెలిసినరోజే డాక్టర్ రజనిని కలుసుకున్నాడు. నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు.

"తొందరపడుతున్నావమ్మా", అన్నాడు.

రజనికి డాక్టరుమీద గొంతుదాకా ఉంది. ఈ అనర్థాలిన్నిటికీ అతనే మూలం అని ఆమె గాఢనమ్మకం.

"నా సంగతి నేను చూసుకోగలను. పసిదానను కాదు గదండీ డాక్టరుగారూ". అంది. డాక్టర్ చేసేదిలేక నిట్టూర్పు విడిచి వచ్చివేశాడు.

మర్నాడే ముహూర్తం.

"జగన్ ఇలా చేస్తాడని ఎప్పుడూ అనుకోలేదు, శారదా", అన్నాడు ఆసుపత్రిలో డాక్టరు రావు గుండె బరువుతో.

"ఏదో గట్టి కారణమే ఉండాలి", అందామె బాధగా.

"ఏవేవో కల్పించుకుని ఉంటాడు. అనుమానిస్తూనే ఉన్నా గాని మరీ ఇంత తొందరపడతాడని అనుకోలేదు.

రజనీ జగన్‌ల ప్రవర్తన మొదటినుంచీ నాకు తెలిసినంత వరకూ ఆలాగే ఉంది. ఒక్కొక్కసారి ఇద్దరూ వెన్నలా కరిగి పోతారు. మరోసారి బిర్రబిగిసి పోతారు."

"ఎవరు డాక్టర్ బిర్ర బిగిసేది?"

అదిరిపడి డాక్టర్, శారదా ఇద్దరూ తలుపువైపు చూశారు.

"హల్లో జగన్", ఆనందంతో కౌగిలించుకున్నాడు డాక్టర్.

చేతిలోని పేపరు బల్లమీద కొట్టి "ఏమిటి డాక్టర్ ఈ దురన్యాయం?" అన్నాడు జగన్.

ఫొటోలతో సహా రజనీ, దాసుల వివాహం జరగ బోతోందని ప్రకటన!

"అవును", అన్నాడు డాక్టర్. "కాని నువ్వు వచ్చావుగా. నాకు ధైర్యంగా ఉంది. శారదా, రజనిని అర్జంటుగా ఇక్కడికి రమ్మని కబురుచెయ్యి." శారద బయటికి వెళ్లింది.

"ఏమిటి ధైర్యం?" అన్నాడు జగన్.

"నీ విషయం నువ్వు చూసుకోగలవని—"

"డాక్టర్—స్నేహితుడివై వుండి, ఈ విషయం నాకు తెలియపరచలేదు కదూ?"

"జగన్, తెలియపరచకుండా ఉండగలనా. ఈ ప్రకటన వేసిం దెవరు? నేను కాదూ? సమయానికి వచ్చావు, జగన్ నువ్వు చూస్తావనే ఆశ ఏ మూలో కిరణంలా వెలిగింది."

జగన్ డాక్టర్ వైపు తదేకంగా చూసి "డాక్టర్", అని కౌగిలించుకొన్నాడు.

"జగన్, చెప్పకుండా వెళ్లాలిసిన అవసరం ఏం వచ్చింది?"

జరిగింది చెప్పా డతను డాక్టర్‌కి. తన పొరపాట్ల వల్లే అంతా అలా జరిగిందని పశ్చాత్తాప పడ్డాడు డాక్టరు.

"నీ చందా విషయం మొదట పొరపాటువల్ల మర్చి పోయాను. తర్వాత నీ రియాక్షన్ చూడాలనుకున్నాను. డబ్బుసంగతి నువ్వు అడుగుతావని ఆశించాను. ఎప్పుడూ అడగలేదు. చివరికి అవకాశం యిచ్చినా నువ్వు ఉపయోగించు కోలేదు. కాని లోలోపల బాధపడ్డావు. ఇహ నేనే చెప్పేద్దా మనుకుంటుండగానే ఈ ఉపద్రవం జరిగింది. జగన్, ఏవేవో ఊహించుకుని బాధపడటం కంటే స్పష్టంగా అడిగి తేల్చేసుకో కూడదా? నీకు ఈ విషయం బాగా తెలిసిరావాలనే అలా చేశాను. అది ఇలా పరిణమించింది", అన్నాడు డాక్టర్ బాధగా.

"వివాహ ప్రసక్తిని గురించి సమయం వచ్చినప్పుడు చెబుతా నన్నావు. ఇప్పటికైనా సమయం వచ్చిం దను కుంటాను."

"చెబుతాను జగన్. నీకూ రజనికీ తత్వాలపట్ల అసం తృప్తి ఉందని నాకు తెలుసు. అనేకసార్లు మాటల సంద ర్భంలో బయటపడ్డారు. కాని మీ రిద్దరూ ప్రేమించు కున్నారని కూడా తెలుసు. అయితే ఏ కారణంవల్లనైనా మీ యిద్దరికీ వివాహం జరక్కపోతే నీ మనసు దెబ్బతింటుం

దని గ్రహించాను. జీవితం ప్రారంభం అయ్యే తరుణంలోనే ఒక వ్యక్తి నిరాశావాది ఐపోతే మానవుడి ప్రగతికి ఓ కళ్లెం తగిలించినట్టు అవుతుంది. జగన్, మనసుని మంచీ, చెడూ చెరోకవైపుకీ లాగుతాయి. తొలి అనుభవాలే ఎదురుదెబ్బలైతే ఎటుచూసినా నైరాశ్యమే కలుగుతుంది. తరువాత ప్రతి విషయం ఆ దృక్పథంతోనే పరిశీలించే అవకాశం ఉంది. మనసు గట్టిది కాకపోతే ఈ ప్రమాదం మరీ ఎక్కువ. దీనికి క్రమంగా లోబడే అవకాశం ఉందని నాకు తెలుసు. చిత్రమేమంటే నీతో స్వల్పకాల పరిచయమే ఉన్నా శారద ఆ విషయాన్ని గ్రహించింది. రజనికి తెలియదు. వారిద్దరికీ ఇదే తేడా. ఆ పరిస్థితిలో, నీ మనసుకి దెబ్బ తగిలితే కాపాడగల ధైర్య స్థైర్యాలు శారదకి ఉన్నాయని అనుకున్నాను. అయితే స్వార్థత్యాగం కూడా కావాలి. అందుకనే శారదని కదిలించాను. కాని పొరబడ్డాను... మనసు ఒక్కటే కాదు జగన్. హృదయం కూడా కావాలి. హృదయంలో ప్రేమలేనిదే ఏమీ చెయ్యలేము. శారద...శారద...సరే ఆ విషయం అలా వదిలేయి. ఇప్పటి కార్యక్రమం ఏమిటో తేల్చు."

ఇద్దరూ ఆలోచిస్తుండగా బయట అడుగులచప్పుడయింది.

ఎవరో చూసి వస్తానని డాక్టర్ బయటికి వెళ్లాడు.

రజని!

"రజనీ!" అని కేక వేసి చేతులు చాపాడు జగన్. కాని ఆమె దూరంగానే నిలబడి గాద్గదిక స్వరంతో 'బావా', అంది.

"రజనీ, కోపంలో ఏదో అంటే ఇలా తొందర పడతావా ?"

"తొందరపడ్డాను. నిజమే. క్షమించు బావా" అంది రజని గిర్రున తిరిగే కన్నీటిని తుడుచుకుంటూ.

"నేను ఐ. ఏ. ఎస్., పరీక్షకి కూచున్నాను. సెలెక్ట్ కూడా కావచ్చు, రజనీ", అన్నాడు ప్రేమగా.

రజని దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. బల్లమీద తల పెట్టుకుని "బావా, నాకోసం నువ్వు ఏదైనా చేయగలవు. తెలుసుకోలేకపోయాను. నీ మనసుకి తృప్తిగా నేనేమీ చేయలేక పోయాను", అని కన్నీటిధారలతో అభిషేకిస్తుండగా అత నామె కన్నీటిని రుమాలుతో తుడవసాగాడు.

"కొంచెం దూరంగా ఉండు బావా, నేను తుడుచుకుంటాలే", అంది రజని బాధగా.

"రజనీ", అన్నాడు హృదయంమీద చెయ్యి వేసుకొని జగన్. కాని కదలలేకపోయాడు.

"హల్లో డాక్టర్. హృదయపూర్వకమైన ఆహ్వానం—అరె జగన్! రజని!—ఓ, సారీ. డాక్టర్ ఉన్నాడనుకున్నాను. బావా మరదళ్ల సరసం బాగుండలేదు. జగన్ క్షమించాలి." దాసు గబగబ లోపలికి ప్రవేశించి వాళ్లని చూసి అన్నాడు.

"దాసూ, ఏమిటా మాటలు?" అన్నాడు జగన్.

"జగన్, నువ్వు నా స్నేహితుడివే. కాని అనుమానాస్పదమైన విషయాలు జరగటం నేను సహించను. క్షమించాలి. నా సంగతి నీకు తెలుసుకదూ?" అన్నాడు దాసు.

"తెలుసు దాసూ, చక్కటి మొగలిపువ్వు యిస్తే ముందు రేకులముళ్లే చూస్తావు. సరే, డాక్టరు దయవల్ల నువ్వేమీ సహించాలిసిన అవసరంలేదు. తరువాత తీరిగ్గా మిగతా విషయాలు మాట్లాడుకోకూడదూ?" అన్నాడు జగన్. చప్పున ముఖ కవళికలు మార్చి ఇద్దరివంకా ఓసారి చూసి "అలాగే, నేను మాత్రం నీ స్నేహితుణ్ణి కాదా, జగన్", అనేసి దాసు బయటికి వెళ్లిపోయాడు.

అతని స్వరంలోని సహజత్వానికి జగన్ ఆశ్చర్యపడ సాగాడు. అతని కళ్ళలోకి సాలోచనగా చూస్తూ "జగన్‌కి మొగలిపువ్వంటే అంత ఇష్టమా!" అనుకుంది రజని.





# మలుపు

రోడ్డుమీంది జనం పలచబడుతున్నారు.

పడమటి దిక్కుగా జర్రున జారిపోతూ ఎదురైన పెద్ద మేడకి ఢీకొని తారురోడ్డు ఉత్తర దక్షిణాలుగా రెండు పాయలైన చోట పోలీసు జవాను తీరిగ్గా నిలబడి మనసులో హెడ్ కానిస్టేబుల్ అయినట్టుగా వూహించుకొంటున్నాడు.

రోడ్డుకి ఎదురుగా ఉన్న మేడ క్రిందిభాగము దక్షిణపు వైపు అద్దెకి తీసుకొని ఉంటున్నలాయరు విశ్వనాథం వసారా లోకి వచ్చి తాపీగా సిగరెట్టు కాల్చిపారేస్తూ వచ్చేపోయే జనాన్ని పరిశీలిస్తున్నాడు.

సమీపంలోని మునిసిపల్ రేడియో లౌడ్ స్పీకర్ ద్వారా ఒకటే రొదచేస్తోంది.

పనిలేని పోలీసు జవాను అవకతవగ్గా నిలబడుతూ విసుగుపుట్టి దగ్గర్లో ఉన్న కాఫీహోటల్లోకి జొరబడ్డాడు.

ఆఖరి సిగరెట్టు తీసి, ప్యాకెట్ రోడ్డుమీదికి విసిరేసి, సవిలాసంగా వెలిగించి గుప్పున పొగవదుల్తూ కిల్లీకొట్టువైపు నడిచాడు విశ్వనాథం.

టౌన్ పోలీసుస్టేషన్‌లో ఏడు గంటలు కొట్టారు.

పోలీసుజవాను త్వరత్వరగా కాఫీ సేవిస్తున్నాడు.

విశ్వనాథం కొత్త సిగరెట్ ప్యాకెట్ కొని తిరిగి వస్తూ ట్రాఫిక్ కాన్‌స్టేబిల్ ఉండవలసిన స్థానంలో నిలబడి ఒకసారి చూపు మేరవరకూ మూడుదిక్కులూ కలయచూశాడు.

మలుపు దగ్గర విద్యుద్దీపం కాంతి కిరణాలు చీకటిపడిన కొద్ది వన్నెకెక్కుతున్నాయి.

ఏమీ తోచక, కదలిపోయే మనుష్యుల్ని, సాగిపోయే వాహనాల్ని చూస్తూ, అర్థంకాని ధ్వనులేవో మేళవించే శృతికి లయ కల్పించుకుంటూ, అన్నింటిలో ఒక క్రమ గతిని వూహించుకుంటున్నాడు విశ్వనాథం. అది అతని అలవాటు. ఒక సరదా. చరాచర ప్రకృతి సమస్తమూ క్రమబద్ధమని అతని నమ్మకం. మనుషులు తమకి తెలియకుండానే ఒక అజ్ఞాతశక్తివల్ల ఒక క్రమపద్ధతి ననుసరించి ప్రవర్తిస్తుంటారనీ, సంగీతం మనిషికి పారలౌకికానందం ఇవ్వటానికి అదే కారణమనీ అతని సిద్ధాంతం.

ఏమీ తోచకపోతే నడుస్తున్న మనిషి అంగలు లెక్కపెడుతుంటాడు. ఆకాశంలో మబ్బులు క్రమప్రయాణం

చూస్తూ ఆనందిస్తాడు. గులకరాళ్ళు నేలమీద పారబోసి వాటి వరసక్రమాన్ని పరిశీలిస్తాడు.

తూర్పువైపురోడ్డు ఒక్కసారిగా కాంతివంతమైంది. విశ్వనాథం తలెత్తి చూశాడు. అతని కళ్లు జిగేలుమన్నాయి. హెడ్‌లైట్లు పరచిన వెలుగుబాటలో వేగంగా ఒక కారు దూసుకు వస్తోంది. "టూ సీటర్" అనుకున్నాడు అతను. దక్షిణంనుంచి వేగంగా ఒక సైకిలు వస్తోంది.

కారు మలుపు తిరుగుతుందా?

సైకిల్ సరాసరి వెడుతుందా? లేక మలుపు తిరుగు తుందా?

కారు దక్షిణపువైపు తిరిగితే—

సైకిలూ అదేసమయంలో అటు తిరిగితే—

పొరపాటున ఇద్దరూ పొరపాటు చేస్తే!

విశ్వనాథం గుండె గతుక్కుమంది. మలుపు తొంభయి డిగ్రీలకోణంలో ఉంది. ఆ పెద్ద మేడ ఇటునుంచి వచ్చే వాళ్ళకీ అటునుంచి వచ్చేవాళ్ళకీ చూపు అందనివ్వదు. అక్కడ చాలా ప్రమాదాలు జరిగాయి. అందుకే, అంతరద్దీ లేకపోయినా అక్కడ పోలీసు జవాన్ని డ్యూటీలో వేశారు.

విశ్వనాథం వద్దనుకుంటూనే ఆలోచించ సాగాడు. ప్రమాదం జరుగుతుందేమోననే వూహ తన కెందుకు రావాలి. కాని ఇదివరకు ప్రమాదాలు జరిగాయి. ఎందుకు జరిగాయి? ఎవరికి వారే బాధ్యులు. ట్రాఫిక్ రూల్సు తెలిసో,

తెలియకో, పరధ్యానంగానో, బుద్ధిపూర్వకంగానో, నిర్లక్ష్యం వల్లనో ఎవరో ఏదో తప్పు చేస్తూనే ఉంటారు.

విశ్వనాథం పొడిగా నవ్వుకున్నాడు. ఒక పెద్ద సమస్యని పరిష్కరించటం తేలికేమోగాని, ఒక మలుపుని జాగ్రత్తగా దాటటం—ఊహు...... ఈ మనుష్యులకి చేత గాదు.

కారు సమీపిస్తోంది.

సైకిలు కూడా చేరువ ఔతోంది.

అన్నట్టు, పోలీసుజవానేడీ ? విశ్వనాథం చుట్టూ చూశాడు. కల్లీకొట్టుదగ్గర నిలబడి బీడీ వెలిగిస్తున్నాడు.

విశ్వనాథం ఒక అడుగు ముందుకి వేశాడు. మరో అడుగు వేయబోయి అలాగే ఆగిపోయాడు.

మునిసిపల్ లౌడ్‌స్పీకర్ దిక్కులు పిక్కటిల్లేటట్టు ప్రకటించింది.

"ఈ నెల పదమూడవ తేదీన సోవియట్ శాస్త్రజ్ఞులు ప్రయోగించిన రెండవ లూనిక్ గత అర్ధరాత్రి చంద్ర మండలం చేరింది..."

చంద్రమండలం !

లూనిక్.

విశ్వనాథం ఒక్క క్షణం అప్రతిభుడయ్యాడు.

ఒక్కసారిగా నిశ్శబ్దం ఆవహించినట్లయింది.

అత్యద్భుత వైజ్ఞానిక విజయం !

విశ్వనాథం తలెత్తి ఆకాశంలోకి చూశాడు. చుక్కలు కనిపించాయి. చంద్రుడు లేడు. మనిషి తనని జయించాడని సిగ్గుపడి ఎక్కడో దాక్కున్నాడేమో! శ్రీరాముడు అద్దంలో చంద్రుణ్ణి చూశాడు. మనం చంద్రుడి దగ్గరికే వెడుతున్నాం. విశ్వనాథం హృదయం ఉన్నట్టుండి కలుక్కుమంది— ముల్లు విరిగినట్టు రాకెట్ చంద్రబింబానికి తగిలి చంద్రుడికి నొప్పి పుట్టిందేమోననే హాస్యాస్పదమైన వూహకలిగి నవ్వుకున్నాడు విశ్వనాథం. కాని ఏదో అసంతృప్తిగా ఉంది అతనికి. హిమాలయశిఖరాన్ని మనిషి జయించాడని విన్నప్పుడు ఆశ్చర్యమూ, ఉత్సాహమూ, సంతోషమూ కలిగాయి. కాని మనసులో ఏదో వెలితి అనుభూతి పొందాడు.

పవిత్రమైన ఎవరెస్టుశిఖరంమీద మనిషి నుంచున్నాడు! మనిషి ఎవరెస్టు శిఖరమంత ఎత్తుగా పెరిగిపోయినాడు! విజ్ఞానఖని. సాహసికుడు. అయినా ఏదో అసంతృప్తి కలిగింది తనకి.

విశ్వనాథంకి వెంటనే మరోభయం పట్టుకుంది. ఇకనించీ చంద్రమండలం సైనికస్థావరం కాదుకదా!

మనసులోని అలజడిని కప్పిపుచ్చుకుంటూ విశ్వనాథం కాళిదాసుని తలుచుకున్నాడు.

"శరచ్చంద్ర చంద్రికా ధవళం..." అన్నాడు మహాకవి. శరచ్చంద్రుడు! దగ్గరికి వెడితే...! దూరపుచంద్రుడు చల్లన! అంతే.

అక్కడ మనుషులు నుంచోటానికి వీలుంటుందా? ఉంటే అప్పుడుకూడా కవులు వర్ణిస్తారా ఇలాగే?

విశ్వనాథం మనసు ఆలోచనలతో నిండిపోటంతో అతని నేత్రాలు గాజుకళ్ళయి పోయాయి. ప్రమాదపు మలుపు దగ్గర ప్రమాదం జరుగనే జరిగిపోయింది. కారు, సైకిలు ఢీకొన్న శబ్దానికి అతను మామూలు ప్రపంచంలో పడి జరిగిన సంఘటన అర్థంచేసుకునేసరికి కొన్ని క్షణాలు గడిచిపోయాయి. చప్పున అక్కడకు వెళ్ళాడు. ఏ దుర్ముహూర్తంలోనో తను శంకించిన కీడు అక్షరాలా నిజమయింది. సైకిలు తునాతునకలై పోయింది. మనిషి కారు వెనక్కు విసరివేయబడ్డాడు. త్వరత్వరగా వెళ్ళి లేవదీశాడు. పడినపాటు అదురుకి రక్తం చిమ్మింది. చుట్టూ చూశాడు. కారులోంచి ఒక యువతి ఒక యువకుడు దిగి, ఆదుర్దాగా తనవైపు, దెబ్బతిన్న వ్యక్తివైపు చూస్తున్నారు.

ప్రమాదం జరిగిందని తెలియటంతోనే జనం గుమికూడసాగారు. ట్రాఫిక్ పోలీసు కానిస్టేబిలు జనాన్ని తోసుకుంటూ వచ్చి జరిగిందిచూచి ఉగ్రుడైపోయాడు. కారు లైసెన్సుచూశాడు. నెంబరు నోటుచేసుకున్నాడు. మీదిమీదికి వచ్చే జనాన్ని అదిలించేసరికి అతని తలప్రాణం తోకకు వస్తోంది. జనం ఎవరికితోచినట్లు వాళ్లు మాట్లాడుతున్నారు.

"బగమంతుడు రచ్చించాడుకానీ, పిలగాణ్ని అన్యాయంగా పొట్టన పెట్టుకునేవారే గందా!"

"మారాజులు! కారున్నమారాజులు!"

"అసలేం జరిగింది?"

"కనిపించటంలే? యాక్సిడెంటు."

"అరెరె ... ఎవరా అబ్బాయి ?"

"పాపం ! కొత్తసైకిలల్లేవుంది. ఫ్చ ... తుక్కు-తుక్కైయి పోయింది."

"ర్యాలీ"

"ర్యాలీనా ? ఫారినా ? ఇండియనా ?"

"ఇండియనే. ఆ మనిషిచూస్తే తెలీటంలే ?"

"త్రీ హండ్రడ్ !"

"చెవులుపిండి వసూలుచేస్తేసరి."

"అసలు తప్పెవరిది ?"

"డ్రైవరుదే."

"సైకిలుకూడా రాష్‌గానే తొక్కుతున్నాడులే."

"అబ్బ ... ఈ కుర్రాళ్ళకి ఇంత మిడిసిపాటు దేనికి ? ఏదో మునిగిపోయినట్లు !"

"కుర్రాళ్ళు కుర్రాళ్ళా ఈ కాలం !"

"లైటు లేదుట !"

"మరి కానిస్టేబులు వూరుకున్నాడూ !"

"లైటు ఉందండీ !"

"కానిస్టేబుల్ పరాకు చిత్తగిస్తున్నారు కాబోలు."

"అసలు డ్రైవరు సిగ్నలివ్వలేదుట !"

"కారెవరిదీ ?"

"ఏమో !"

"హారన్‌కూడా కొట్టలేదుటండీ."

"సైకిలు రాంగుసైడు నుండి వచ్చిందిట."

"సైకిలుకి బెల్లుందా ?"

"ఔనౌను. బెల్ కొట్టలేదంటున్నారు."

"బెల్ కొట్టాల్సిన అవసరం లేదండీ !"

"ఐసీ !"

"నాకు రూల్సు తెలుసు. అయాం ఇన్ ది బార్."

"ఐ విట్‌నెస్ ఎవరో ?"

"డ్రైవరుదగ్గర స్టేటుమెంటు తీసుకోరే."

"డ్రైవరు తప్పేంలేదండీ."

"ఓహో, ఇంకెవరిదిట ?"

"నేనూ ఓకారు ఓనర్నే, నాకూ తెలుసునండోయ్."

దెబ్బతగిలిన యువకుడికికా స్త వూపిరాడేటట్లు దూరంగా సర్దుకోమని విశ్వనాథం జనాన్ని ఎంత వేడుకొన్నా, వాళ్ళింకా సానుభూతి చూపించడానికి చుట్టుముట్టి అతని మాటల్ని పెడ చెవిని పెట్టటంతో కానిస్టేబుల్ కొంత బలప్రయోగంచేయక తప్పలేదు. తనులేని సమయంలో యాక్సిడెంట్ జరిగి, తన ఉద్యోగానికి ప్రమాదంకలిగే పరిస్థితి ఏర్పడటంవల్ల అసలే అతనికి కోపంగావుంది. చికాకుతో అడిగాడు.

"ఎవరిదండీ ఈ కారు ?"

"మాదే !" అన్నాడు యువకుడు.

"అంటే ?"

"నా పేరు మూర్తి. ఎడ్రసు కావాలంటే ఇదిగో."

ఓకార్డు జేబులోనుంచి తీసి యిచ్చాడు అతను. మాట్లాడకుండా ఆ కార్డు తీసుకుని ఓసారి చూసి నోట్ బుక్ లో పెట్టుకున్నాడు పోలీసు జవాను.

"మీరేనా కారు డ్రైవ్ చేసింది ?"

మూర్తి తటపటాయించాడు. సమయానికి డ్రైవరును వెంట తెచ్చుకోనందుకు విచారించాడు. శశిరేఖమీద అతనికి చిరుకోపం కలిగింది. వద్దన్నకొద్దీ డ్రైవ్ చేస్తానని పట్టుపట్టింది. ఈ అనర్థం కలిగింది. అతనేమీ మాట్లాడకపోయేసరికి కాన్ స్టేబుల్ రెట్టించి అడిగాడు.

శశిరేఖముఖం ఎర్రబడింది.

"నేనే" అందామని ప్రయత్నించింది కానీ, ఈ ప్రమాదం జరుగటంవల్ల ఆమె శక్తులన్నీ ఉడిగిపోయినట్లయింది. పెదవిదాటి మాట బయటకు రాలేదు.

"మీ డ్రైవింగు లైసెన్సు చూపించండి."

మూర్తిముఖం కళ తప్పింది. ఎన్నాళ్ళనుంచో డ్రయివింగు నేర్చుకోవాలని ప్రయత్నించి వదిలెయ్యటమే కానీ, అది సాధించిలేకపోయాడు. తన బద్ధకానికి తగిన ప్రతిఫలం యిప్పుడు అనుభవిస్తున్నాడు.

"డ్రైవ్ చేసింది మా శశిరేఖ, నేను కాదు." అని స్పష్టంగా అన్నాడు. పోలీసు కానిస్టేబులు ముఖంలో కొంచెం ఆశ్చర్యం ద్యోతకమయింది.

"అంటే వీరేనా ?"

తలూపాడు మూర్తి. షాక్ నించి ఇంకా తేరుకోక పోవటంవల్లా, ఈ పోలీసు ఉపద్రవంవల్లా ఆమె తేజోవిహీన మైనముఖంతో మూర్తివైపూ, కానిస్టేబిల్ వైపూ చూసి వణికే చేతుల్తో తన డ్రైవింగు లైసెన్సు తీసి చూపించింది.

నేరం ఒక స్త్రీమీద మోపవలసి రావటంతో కానిస్టేబిల్ కోపం లోలోపలే చాలవరకు అణచుకున్నాడు. అయినా ఇంతగొడవ జరగటానికి ఆమె కారణం కావటంవల్ల విసుగ్గా అన్నాడు.

"అంత అజాగ్రత్తగా కారు నడిపితే ఎలాగండి? మనుషులు బతకాలా అక్కర్లేదా?"

అవమానంతో శశిరేఖ ముఖం దించుకుంది. మూర్తి బయటికి ఏమీ అనలేక కానిస్టేబిల్ మీద మనసులో ధాంధూం చేయసాగాడు.

"వారిదేం తప్పులేదండి, తప్పంతా నాదే."

హీనస్వరంతో ఈమాట వినిపించేసరికి ఆ దిక్కుకి అందరూ తిరిగారు.

దుస్తులన్నీ దుమ్ముపట్టి, ముఖమంతా మలినమై, ఎర్రచారలతో, నీటిబిందువులతో జుగుప్సాకరంగా ఉన్నా, అతని కనుముక్కుతీరులోని ఆకర్షణ అందరి దృష్టుల్నీ ఆకట్టింది.

అతని సౌమ్యతని లోలోపల మెచ్చుకుంది శశిరేఖ.

"వారు హారన్ కొడుతూ ఉన్నా, నేనే కళవళపడి రాంగుసైడ్ నించి వచ్చి వారికి ఇబ్బంది కలిగించాను."

మూర్తి విస్ఫారిత నేత్రాలతో అతనివైపుచూశాడు.

శశిరేఖ తలెత్తి అతని వదనం విస్మయంతో సునిశితంగా చూసింది. ఎవరీవ్యక్తి? ఎందుకలా అబద్ధాలు చెబుతాడు? తను హారన్ కొట్టలేదు. అతడు రాంగుసైడ్‌నించి రానూ లేదు. తనే మలుపు సరిగాతిప్పలేక పోయింది. చేతకాక కాదు. పరధ్యానంలో ఉండి పొరపాటు చేసింది. ఆవ్యక్తి లేచి నుంచున్నాడు. గట్టిగా ఊపిరిపీల్చి ఒదుల్తూ ఓసారి గుండెమీద చెయ్యివేసి అదుముకున్నాడు. ముక్కునుంచి కొంచెం రక్తం చిమ్మింది.

విశ్వనాథం గుడ్డకోసం వెతికాడు.

మూర్తి కారులోకి చూశాడు.

శశిరేఖ వెంటనే నిస్సంకోచంగా తన చీరకొంగు పర్రున చింపి విశ్వనాథంకి ఇచ్చింది.

అదిచూసిన జనమంతా నోరు తెరిచిచూశారు. మూర్తి అర్థంకాని చూపులు ఆమెమీద ప్రసరించాడు. ఆవ్యక్తి మనసులో కృతజ్ఞత చెప్పుకున్నాడు.

విశ్వనాథం ప్రథమ చికిత్స చేశాడు. "చూడండి అదే మా ఇల్లు. కాసేపు విశ్రాంతి తీసుకుని కొంచెం స్వస్థత కలగగానే వెడుదురుగాని, రండి. మీరూ రండి మూర్తిగారూ, శశిరేఖగారూ! కాన్‌స్టేబిల్, ఏమైనా అడగాలిసిన ప్రశ్నలుంటే అక్కడే అడగవచ్చు, నువ్వుకూడారా." అందర్నీ ఆహ్వానించాడు విశ్వనాథం.

ఆ ఆహ్వానం అందరికంటె, శశిరేఖకి ఆనందదాయకమైంది. జనంమధ్య నేరస్థురాలిగా నిలబడి దెబ్బతిన్న

అభిమానంతో ఆమె కుంగిపోయింది. మరికొంచెంసేపు ఆపరిస్థితిలో ఉంటే మూర్ఛవచ్చే పర్యంత మవుతుందని ఆమెకి తెలుసు. ఆమె వెంటనే అంగీకార సూచకంగా అడుగు ముందుకి వేసేసరికి మూర్తికి ఆమెను అనుసరించక తప్పలేదు. కానిస్టేబిల్‌కి మాత్రం ఆ కారు అక్కడినించి ఎంతత్వరగా వెళ్లితే అంత మంచిదని ఉంది. ఇన్‌స్పెక్టర్‌కి ఈ కబురు తెలిస్తే వచ్చి విరుచుకుపడతాడు. అదృష్టవశాత్తూ పెద్ద ప్రమాదం ఏమీ జరగలేదు. లేకపోతే తను పెద్ద దెబ్బతినేవాడు.

"కారు ఇక్కడనించి త్వరగా తీస్తే మంచిది సార్." అన్నాడు.

"పక్కగానే ఉందిగా, ఇప్పుడే వస్తాములే." అన్నాడు విశ్వనాథం. చేసేదిలేక కానిస్టేబిల్ మాట్లాడకుండా జారుకున్నాడు.

అందర్నీ ఇంట్లోకి ప్రవేశపెట్టి, దెబ్బతగిలిన వ్యక్తిని మంచంమీద పడుకోబెట్టి, కిటికీ తలుపులన్నీ తీశాడు విశ్వనాథం. ఉక్కగా ఉంది అంటూ విశ్వనాథం విసనకర్ర తీసుకొని కుర్చీ మంచందగ్గరకి లాక్కుని విసరటం ప్రారంభించాడు. ఆవ్యక్తి వద్దంటూనే ఉన్నాడు. ఇంతలో శశిరేఖ విసనకర్ర లాక్కుంది. అతను మొహమాటపడ్డాడు.

"మీరు అతిథులు" అన్నాడు విశ్వనాథం.

"పరవాలేదు. చేసిన తప్పుకి ఈమాత్రం సేవైనా చేస్తే నామనసుకి ఊరటగా ఉంటుంది" అంది.

మూర్తి ముఖం ముడుచుకున్నాడు. అతని ముఖం మీద స్వేదబిందువులు చేరాయి. జేబురుమాలతో తుడుచుకోటం మర్చిపోయాడు. పరాగ్గా లేచి నుంచున్నాడు.

"ఎక్కడికి ?" అన్నాడు విశ్వనాథం.

మూర్తి అతనివైపు తేరిపార చూసి వెంటనే తెలివి తెచ్చుకుని మళ్లీ కుర్చున్నాడు.

"ఉక్కగా ఉందా ?"

"ఆ...అవునండీ" అన్నాడు సమాధానం అందుకుని మూర్తి.

"పోనీ వసారాలో కూర్చుందామా ?"

"అలాగే" అని లేవబోయి మళ్లీ ఓక్షణం ఆలోచించి శశిరేఖవైపు చిరాగ్గా చూసి, "ఎందుకులెండి, ఇక్కడే కూర్చుందాం" అన్నాడు మూర్తి.

విశ్వనాథం కుర్చీలో జేరగిలబడుతూ సిగరెట్ తీసుకుని మూర్తికి అందించాడు. అతను అలవాటు లేదన్నాడు. విశ్వనాథం తాపీగా సిగరెట్ వెలిగించి మూర్తివైపు చూసి "అసలీ ప్రమాదం ఎలా జరిగిందండీ ?" అన్నాడు.

"చేతకాని డ్రైవింగు" అన్నాడు కటువుగా మూర్తి.

కంఠస్వరంలోని ఆ కాఠిన్యానికి ఉలిక్కిపడి తలెత్తి మూర్తివైపుచూసి ముఖం చిట్లించుకుంది శశిరేఖ. విశ్వనాథం కూడా కొంచెం ఆశ్చర్యపడ్డాడు.

శశిరేఖ తన వైపు చూసిన చూపులోని భావాన్ని గ్రహించి మూర్తి కొంచెం పశ్చాత్తాప పడ్డాడు. అయితే ఆమె ముఖం చిట్లించుకోటంతో అతనికి కోపం వచ్చింది.

"అనుభవం లేదా ?"

"అనుభవం ఉంటే అలా ఎందుకు జరుగుతుంది ?"

శశిరేఖ ముఖం చిన్నబుచ్చుకుంది.

"డ్రైవింగు రానివాళ్ళకి వచ్చినవాళ్ళని చూస్తే అలాగే ఉంటుంది."

"డ్రైవింగు రానివాళ్ళకి అరెస్టయే భయం లేదుగా."

శశిరేఖ ముఖంలో అసహ్యం తాండవించింది. అయితే అరెస్టవుతాడనే భయంతోనన్నమాట మూర్తి తనని ఆదుకోటానికి ప్రయత్నించలేదు. తామిద్దరూ కారునించి దిగినప్పుడు ఎవరూ చూసిన జ్ఞాపకంలేదుతనకి. మూర్తి నేరం తమబుజాల మీద వేసుకుంటాడని ఒకక్షణం తను ఆశించింది. కోరుకుంది. మూర్తిని కష్టాలపాలు చేయాలనికాదు. కానిఅతనికాదర్పమూ, అధికారమూ ఉన్నాయని, అతని హృదయవైశాల్యం తాను ప్రత్యక్షంగా అనుభూతిపొందాలనీ, ఆ ఔన్నత్యాన్నీ, అనురాగాన్నీ ప్రేమగా స్మరించుకుంటూ జీవితసాఫల్యం అనుభవించాలనీ తన మనసులో కోరికలు స్పష్టాస్పష్టంగా కలిగాయి. అయితే మూర్తి తను ఆశించిన విధంగా జవాబు చెప్పనప్పుడు అతని కా ఊహ ఒకవేళ తట్టలేదేమోనని సరిపెట్టుకుంది. కాని ఇప్పుడు హృదయంలో నిప్పురగులుకుంది. మూర్తి ఇంత స్వార్థంతో ప్రవర్తిస్తాడని తను అనుకోలేదు. జనంమధ్య నేరస్థురాలిగా తను నిలబడ్డ సమయంలో

మూర్తి ఏమీ చేయలేకపోయాడు. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కాని స్థలంకానిస్థలం కావటంవల్ల లోపలే అణచుకుంది.

మూర్తికూడా మాట జారింతరవాత నాలికకొరుక్కున్నాడు. కాని ఏం చేస్తాడు? కోపంలో శశిరేఖ మరోవిధంగా అర్థచేసుకుందేమో! ఆమెని బాధపెట్టాలని తనకేమీలేదు. కాని ఆమె బాధపడుతూనే ఉంది.

"అరెస్టవుతానని భయపడే పిరికిదాన్నికాను." ముభావంగాఅంది శశిరేఖ. తనసంభాషణ కలిగించిన ఫలితం విశ్వనాథం కనిపెట్టకపోలేదు. మాట తప్పించటం మంచిదని, సమర్థిస్తున్నట్టు అన్నాడు.

"అన్నప్పుడల్లా మన క్రైం అవుతుందా ఏమిటి లెండి. అయినా హారన్ సౌండ్ చేస్తే బాగుండిపోయేది."

"ఆ తప్పు నాదేలెండి విశ్వనాథంగారూ." శశిరేఖని అనునయించేప్రయత్నంలో అన్నాడు మూర్తి.

"ఏం?"

"సమయానికి ఓ రేడియోవార్త చెవినిపడ్డది. సోవియట్ రాకెట్ చంద్రమండలం చేరిందట."

"అవునవును" అన్నాడు విశ్వనాథం, ఆవార్త విన్న వెంటనే తన భావపరంపర ఏవిధంగా మొదలై ఎలా అకస్మాత్తుగా అంతమైందీ జ్ఞాపకం చేసుకుంటూ.

"నేను సైంటిస్టుని విశ్వనాథంగారూ. సైంటిస్టు ఆవార్తకి ఎలా ఉప్పొంగిపోతాడో వూహించుకోండి.

శశిరేఖతో ఆ విషయం ముచ్చటిస్తూ ఆమెకి పరాకు కలగచేసి పరోక్షంగా ఈ ప్రమాదానికి నేను కారణమయాను.''

ఇంకానయం! అంతమాత్రమైనా అన్నాడు! తనని అనునయించాలని ప్రయత్నంకాబోలు. హృదయానికి తగిలిన గాయం అంత సులభంగా మానదని తెలీదు కాబోలు. తను పరాకుగా ఉండటానికి కారణం మూర్తి మాట్లాడటంకాదు. అతని మాటలు తన చెవిని దూరనేలేదు. తనేమీ జవాబివ్వక పోవడంవల్ల ఆవిషయం అతనికే స్పష్టమై ఉండాలి. పాపం, ప్రమాదంలేకపోతే ఇతర్ల తప్పుల్ని తన నెత్తిన వేసుకోటానికి మూర్తికూడా సిద్ధమే!

"లేనిపోని బాధ్యతల్ని నెత్తిన వేసుకోటం ఎందుకు?" అందామె వ్యంగ్యం స్పష్టంగా అందరికి అర్థమయేలా.

"ఉన్న సంగతి చెప్పాను.'' అన్నాడు మూర్తి, దెబ్బ తిన్న అహంతో. లేనిపోని బాధ్యతలట!

"మీరు మాట్లాడిం దేమిటో నేనసలు వినలేదు."

"మరి?" ఆశ్చర్యంగా అడిగాడు మూర్తి.

శశిరేఖ మాట్లాడలేదు. అదే సమయంలో కొత్త మనుషులమధ్య తను క్లిష్ట పరిస్థితిలో ఉన్నదనే విషయం గుర్తుకు వచ్చింది. తను అలా మాట్లాడుతుంటే వాళ్ళేమను కుంటున్నారో అనే భావనకలిగి ఆమె ముఖం ఎర్రబారింది. మూర్తిఅనే ప్రతిమాటా ఆమెని ఎందుకో రెచ్చగొడుతోంది. వాళ్ళిద్దరిమధ్యా ఏవో పొరపొచ్చాలు అకస్మాత్తుగా ఏర్పడ్డాయని విశ్వనాథం గమనించాడు. మూర్తి తమాషాగా

అన్నమాటలకే ఆమె అలా ఉడుక్కోవటం విశ్వనాథంకి ఆశ్చర్యంగా ఉంది.

ఎవరూ మాట్లాడకపోవటంతో నిశ్శబ్దం అందరి మనసుల్లో ఏవేవో ఆలోచనల్ని సృష్టిస్తోంది.

వాతావరణం అసహజంగా మారి దుర్భరం కాసాగింది. మూర్తికి క్షణాలు గంటలుగా మారిపోతున్నట్టని పించినై. ఆ నిశ్శబ్దాన్ని భరించలేక అన్నాడు.

"మనిషి త్వరలో చంద్రమండలం చేరతాడని నాకు నమ్మకం ఉంది." విశ్వనాథం ఏకీభవిస్తున్నట్లుగా తల వూపాడు.

శశిరేఖ పెదవులమీద సంతోషంలేని చిరునవ్వొకటి విరిసింది. ఆమె పెదవులు బిగబట్టుకుంది. ఒట్టి సైంటిస్టు. విశ్వ విద్యాలయం వాళ్ళు పరీక్షచేసి ఎం. ఎస్. సి. డిగ్రీ ఇచ్చారు. ఫస్టుక్లాసు. అవును. ఇంకేం క్లాసువస్తుంది మరి! అతని నర నరాల్లో సైన్సు ఉంది. ఇప్పుడిప్పుడే తను అతని ఎనలైజు చేస్తోంది. కొంపతీసి తనూ సైంటిస్టే కాబోటం లేదుగదా! అసాధ్యం! తనెప్పటికి అతనిలా మానసిక యంత్రంలా తయారుకాలేదు. కాని, కాని... తనెప్పుడూ ఇలా ఆలో చించి ఎరగదు. ఏవేవో ఆలోచనలు ముసుకుకుంటున్నాయి. శరత్పూర్ణిమనాడు పూర్ణచంద్రబింబం హృదయాన్ని ఆనంద తరంగితం చేస్తున్న సమయంలో "శశిరేఖా" అని మృదు వుగా పిలిచిన మూర్తిని తన్మయత్వంలో క్రీగంట చూస్తే, "చంద్రుడిలో ఆ మచ్చ లేమిటో తెలుసా, కొండలు_" అన్నాడు. కొండ శిఖరంమీదినుంచి ఒకసారిగా అగాధం

లోకి పడినట్టయింది. కాని మనసుని సరిపెట్టుకుంది. ఇవాళ...! కారు డ్రైవ్ చేస్తున్నప్పుడు రేడియోవార్త వినగానే మనసు ఎందుకో వికలమైంది. ఏదో అందని ఆదర్శంలా చంద్రబింబం మబ్బులతో దోబూచులాడుతుంటే, ఆ తెలి మబ్బులో మబ్బుగా తేలిపోతూ చంద్రబింబాన్ని అందుకోవాలని కలలుకనేది. కాని అదేసాధ్యమైతే—? కటిక నిజమేదో స్ఫటికంలా మెరుస్తూ బాకుల ఝుళిపించింది. సమస్తమూ శూన్యంగా కనిపించింది.

అంతే, ప్రమాదం జరిగిపోయింది.

జరిగిన ప్రమాదం తలుచుకుని శశిరేఖ మళ్ళీ ఒకసారి ఒణికింది. అదృష్టవశాత్తూ ఘోరమేమీ జరగలేదు. జాలిగా అతని క్షతగాత్రం చూసింది. వద్దనుకుంటూనే అతని కళ్ళలోకి చూసింది. అతనూ అదే సమయంలో ఆమెవైపు చూశాడు. కళ్ళలోని చెమ్మ అతన్ని కలవరపెట్టింది. శశిరేఖ కళ్ళని తిప్పుకుంది. మూర్తి ఇదంతా గమనిస్తూనే ఉన్నాడు. అసహనంతో కుర్చీలో అటూ ఇటూ కదిలాడు. గుండెల్లో ఏదో బాధ కలిగింది. పట్టలేని ఉక్రోషంతో తనవైపు చూస్తూ అన్నాడు.

"అన్నట్టు మీ పేరేమిటి మిస్టర్?"

అతని గొంతులోని కర్కశత్వానికి అతనికే ఆశ్చర్యం వేసింది.

"భాస్కరరావు."

పేరులోని భాస్కర శబ్దం మూర్తికి బొత్తిగా నచ్చలేదు. కసిగా అన్నాడు.

"కనీసం మీరయినా బెల్ మోగించి వుంటే ఈ అవస్థ తప్పేది."

అంత నిర్మొగమాటంగా, కటువుగా అనాలని తన ఉద్దేశ్యం కాకపోయినప్పటికీ ఆమాటలు అలా ధ్వనించాయి.

భాస్కరరావు శాంతంగా మూర్తివైపూ, శశిరేఖ వైపూ చూసి, అన్నాడు.

"నా కేమయినా ఫరవాలేదు. ఏకాకిని. అందులోనూ వేదాంతిని. మీకు కష్టం కలిగించాననే బాధ."

శశిరేఖ అతనివైపు ప్రశాంతంగా చూచి, మూర్తిని మందలిస్తున్నట్లుగా అతనివైపు ముఖం తిప్పింది. ఆచూపులో "ఆమాత్రం సంస్కారం నీకు లేకపోయింది" అనే ఎత్తిపొడుపు స్పష్టంగా గమనించాడు మూర్తి.

విశ్వనాథం ప్రేక్షకుడిగా చూస్తూ సంభాషణలో కలగ చేసుకోలేదు. నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ భాస్కరరావు మళ్ళీ అన్నాడు.

"ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉండటం అలవాటయి పోయింది. అందులో చంద్రగ్రహం మీద మానవుడు అధికారం చేయబోతున్నాడనే సరికి ఏవేవో ఆలోచనలు ఉక్కిరి బిక్కిరి చేశాయి. లేకపోతే తగుజాగ్రత్తలో ఉండేవాణ్ణే. అన్నట్లు చూశారూ, మనిషిదేముంది అంతా గ్రహబలం అంటారుకదా మనవాళ్లు. చివరకు మనిషే గ్రహాలను అదుపులో పెడుతున్నాడు. నాకు తెలుసు, ఇలాంటి రోజు వస్తుందని. ఇంకా దేవుడూ, దయ్యం ఏమిటండీ!"

విశ్వనాథం తల పంకించాడు.

శశిరేఖ మనసులో ఏదో తర్కిస్తోంది.

ఏ విషయం గురించీ ఆలోచించటం అలవాటులేని శశిరేఖ ఆలోచనామగ్న కావటం చూసి, అణచుకోలేని అసహనంతో మూర్తి కుర్చీలోనుండి లేచి, నిలబడి విసుగ్గా అన్నాడు.

"ఈ శుష్కవేదాంతాన్ని తర్కిస్తూంటే కాలం గడిచిపోతూంది. క్షమించండి విశ్వనాథంగారూ! మాకు సెలవిప్పించండి."

మూర్తి వైఖరి శశిరేఖ కేమీ నచ్చలేదు.

"ఇంట్లో ఎవరూ లేరు. లేకపోతే భోజనం చెయ్యకుండా మిమ్మల్ని పోనిచ్చేవాడిని కాదు. కనీసం కాస్త కాఫీ అయినా, తీసుకుపోదురుగాని. కాసేపు కూర్చోండి. ఇప్పుడే ఆర్డరిచ్చి వస్తాను. దగ్గరలోనే హోటలుంది." అని వాళ్ళ అనుమతికోసం నిరీక్షించకుండానే విశ్వనాథం త్వరత్వరగా గది బయటకు అడుగువేశాడు. ఒక్క క్షణం తటపటాయించి, మూర్తి అతన్ని అనుసరిస్తూ, "నేనూ వస్తా పదండీ" అన్నాడు.

హోటలుకు వెళ్ళే దారిలో విశ్వనాథం అడిగాడు.

"సొంత విషయాలలో జోక్యం కలిగించుకుంటున్నానని అనుకోకండి. ఆమె మీ కేమవుతుంది?"

"దగ్గర సంబంధమే ఏర్పడబోతుంది. ఆమె నాకు కాబోయే భార్య."

"ఓ అలాగా! శుభం!"

"బి. ఏ., చదువుతోంది. లిటరేచర్. సెలవులకివచ్చింది. మేనరికం లెండి."

"అలాగా! సంతోషం!"

"కాని ప్రమాదం జరిగినప్పటినుండి ఆమె మనసు మనసులో లేదు. విశ్వనాథంగారూ! మీతో ఎక్కువ పరిచయం లేకపోయినప్పటికీ, మీరు నాకు ఆప్తమిత్రులుగా భావించుకుంటున్నాను. ఒక విషయం చెబుతున్నాను. ఆమెకు నామీద ఎందుకో కోపంగా ఉందని గ్రహించాను. ఈ ప్రమాదం జరిగినప్పటినుండీ నా ప్రవర్తనలో ఏమైనా లోపం కనుపిస్తోందా మీకు?"

విశ్వనాథంకు ఏం జవాబివ్వాలో తెలియలేదు. ఆలోచిస్తూ ఫూరుకున్నాడు.

"ఏమైనప్పటికీ దయచేసి మీరో చిన్న సహాయం చెయ్యాలి విశ్వనాథం గారూ."

"నేనా! ఏం సహాయం?"

"అజాగ్రత్తగా కారు నడిపినందుకు పోలీసువారు కేసు పెడితే, కారు నడిపింది నేనని బుకాయిస్తాను. లైసెన్సు లేకుండా డ్రైవ్ చేసినందుకు కూడా శిక్షపడితే పడనివ్వండి. సంతోషంగా స్వీకరిస్తాను. ఆమెకు కోర్టుబాధ లేకుండా చూడటం నా కర్తవ్యం. కాని మీరు నాకు అనుకూలంగా సాక్ష్యం చెప్పాలి. అంటే నేనే డ్రయివ్ చేశానని."

విశ్వనాథం చిరునవ్వుతో అతని ముఖం తేరిపార చూచాడు. కానీ ఏమీ మాట్లాడలేదు. మూర్తి కూడా

మరేమీ అనలేదు. విశ్వనాథం కాఫీ ఆర్డరిచ్చాడు. ఇద్దరూ కలిసి విశ్వనాథం ఇంటికి తిరిగి వస్తూండగా, పోలీసు కానిస్టేబులు కనుపించి, విశ్వనాథానికి ప్రప్రథమంగా నమస్కారం చేశాడు. ఎప్పుడూలేని ఈ ఆచారానికి అతడు మొదట తెల్లపోయినా, వెనువెంటనే సంగతి గ్రహించి చిరునవ్వు నవ్వాడు.

మూర్తి, విశ్వనాథం, ఇంటి వసారాలోకి ప్రవేశిస్తూండగా, వాళ్ళేమాత్రమూ వూహించలేని సంఘటన జరిగింది. రోషకషాయిత నేత్రాలతో చలించే పెదవులతో వడిగా గదిలోనుండి బయటకు వచ్చి శశిరేఖ చరచరా కారువైపు నడిచిపోయింది.

మూర్తి, విశ్వనాథం స్తంభీభూతులైనారు.

ఒక్కక్షణం వరకు మూర్తి జరిగింది అర్థం చేసుకోలేక పోయాడు. శశిరేఖ డ్రైవింగు సీటులో కూర్చుని రపీమని తలుపు వేసిన ధ్వనికి అతను మేల్కొని చప్పున కారుదగ్గరకు పరుగెత్తాడు.

కాని మూర్తి వెళ్ళేలోగానే కారు ముందుకు దూసుకుపోయింది.

విశ్వనాథంకి ఇదేమీ అర్థంకాక, భాస్కరరావును అడగాలని లోపలకు అడుగుపెట్టి "ఏం జరిగింది?" అంటూ భాస్కరరావు వైపు చూసి, అదిరిపడ్డాడు.

భాస్కరరావు మంచంమీదలేడు. నుంచుని ఉన్నాడు. ముక్కుపుటాలనుండి రక్తం ప్రవహిస్తూంది. మనిషి ఊగిపోతూ ఆసరాగా కుర్చీ పట్టుకుని నిలబడ్డాడు.

"మీవంటి పెద్దమనుష్యులు అబద్ధపు సాక్ష్యం ఎప్పుడూ చెప్పరు. నాకు తెలుసు," అన్నా డతను ఆయాసంగా.

"ఏం జంగింది?" అన్నాడు మళ్ళీ మూర్తి, జరిగిం దేమిటో అర్థం చేసుకోలేక.

భాస్కరరావేమీ జవాబివ్వలేదు. గది బయటకు నడువసాగాడు.

"ఎక్కడికండీ ?" అన్నాడు విశ్వనాథం.

"పోలీసుస్టేషనుకి." అని ముక్తసరిగా అనేసి గబగబా బయటకు వెళ్ళిపోయాడు భాస్కరరావు.

అప్రతిభుడయిన విశ్వనాథం తెప్పరిల్లి వసారాలోకి వచ్చి తాపీగా సిగరెట్ తీసి వెలిగించి, గుప్పున పొగ వదలి దూరమవుతున్న భాస్కరరావువైపు విస్మయంతో చూడ సాగాడు.





# స్వరూపాలు

పదిపదిహేనేళ్ళ క్రిందటి సంగతి. తెలుగు దేశంలో అప్పటి కింకా జమీందారీలు రద్దుకాలేదు. ఆ రోజుల్లో ఓ జమీందారుగారుండేవారు. ఉన్నట్లుండి ఓ శుభముహూర్తాన ఆయన కో మంచి ఆలోచన తట్టింది. సమాజ వికాస పథకం లాంటి దేదో ఆయన మనసులో మెదిలింది. దారిద్ర్యాన్నీ అజ్ఞానాన్నీ తన జమీలో పూర్తిగా కాకపోయినా, కొంతవరకైనా ఎందుకు నిర్మూలించకూడదూ? వెంటనే దివాను గారిని సంప్రదించారు. దేవుడి వరానికి అడ్డొచ్చే పూజారి లాంటి వారు కారు దివానుగారు. భేష్ అంటే భేష్ అనుకున్నారు. వెంటనే ఒక సమాజాభ్యుదయోద్యోగిని నియమించాలని తీర్మానించుకున్నారు. సహజంగా ఆ భారం దివానుగారి భుజస్కంధాలమీద పడ్డది.

ఉత్సాహంలో వెంటనే తలూపినా, తీరిగ్గా ఆలోచించిన తరవాత దివానుగారికి ఈ పథకంలోని వ్యయప్రయాసలు తెలిసివచ్చాయి. అదీకాక అసలు సరైన ఉద్యోగిని నియమించేభారం తనపైన ఉంది. ఎవర్నో నియమించినా, ఇందులోని హెచ్చుతగ్గు లన్నిటికీ తనే బాధ్యత వహించాలి. పథకం విఫలమైతే జమీందారుగారు తనని అసమర్థుడికింద జమకట్టేస్తారు. అభిరుచి, ఉత్సాహమూ, దీక్షా, సామర్థ్యమూ పుణికిపుచ్చుకున్న యువకుడు లభ్యం కావాలి, ఎలా ?

ఇదీ సమస్యా ప్రారంభం.

ఇదే కథా ప్రారంభమూ.

దివానుగారికి ఉన్న సమస్య ఈ ఒకే ఒక్కటికాదు. మరొకటి, ఇరవై సంవత్సరాల కిందటే ఉద్భవించి అపరిష్కృతంగా నిలిచి ఉంది. ఈసమస్యకి రూపం విశాల, దివానుగారి అమ్మాయి, గ్రాడ్యుయేటు. ఆమె అభిమానవిషయం సమాజశాస్త్రం. ఏవేవో పెద్దపెద్ద ఊహలు, గొప్పగొప్ప ఆశయాలు. అంత ఔన్నత్యం గల వరుడికోసం గాలించే ప్రయత్నంలో ఇంచుమించుగా నిరాశావాదానికి దివానుగారు చేరువగా వచ్చారు. దివానుగారు ఆలోచనా నిమగ్నులైనారు.

ఆలోచిస్తుంటే విశాల సమస్యలోకి విషయం మళ్ళింది. ఆ సమస్య తలపుకి రాగానే దివానుగారికి నవ్వు రానేవచ్చింది. అసలు విశాలనే ఈ ఉద్యోగానికి నియమిస్తే భేషుగ్గా ఉంటుంది! కాని...

అరెరె... ఈ క్షణంలో విశాల పరాయిపిల్లయి పోతే ఎంత బాగుండి పోయేది...పరాయిపిల్ల...!

వెంటనే దివానుగారికి మెరుపులాంటి ఆలోచన కలిగింది. రెండు సమస్యలకీ ఒకటే పరిష్కారం. అమ్మయ్య! ఒక్కటే సమస్య. దివానుగారి పెదవులమీద చిరునవ్వు చిగురించింది. కాని వెంటనే అది మాయం కావటంకూడా జరిగింది. ఇప్పుడు సమస్యా పరిష్కారం మరింత కష్టం.

ఉద్యోగం గురించి పత్రికల్లో ప్రకటించి, హేమాహేమీ లనతగ్గ అభ్యర్థుల్ని కొందర్ని ఎంచి వారికి తాఖీదులు పంపారు దివానుగారు. ఆరోజే ఇంటర్వ్యూ. ఆ విషయం గురించి విశాలతో యదాలాపంగా అనేసరికి ఆమె ఎగిరి గంతువేసినంత పనిచేసింది. ఏమైనాసరే ప్రణాళిక విజయవంతంగా నిర్వహించాలని సరదాపడ్డది. అదంత సులభంకాదని ఆయన అనేసరికి ఎదురు ప్రశ్నలు వేసింది. "సరైన ఉద్యోగిని ఎంచుకోటం కష్టం; మన అదృష్టం బాగుంటే మంచివాడు దొరుకుతాడు, లేకపోతే లేదు", అన్నారు దివానుగారు. అదేమంత కష్టం కాదంది విశాల. "అయితే నువ్వే ఇంటర్వ్యూ చెయ్యి", అన్నారు దివానుగారు కొంచెం విసుగ్గా.

విశాల చిన్నబుచ్చుకొంది. కోపమూ, అలుకా ఆమె వదనంలో వ్యాపించటం చూసి దివానుగారు అనునయపూర్వకంగా అన్నారు.

"కాదమ్మా, అరడజను మందిని ఇంటర్వ్యూకి రమ్మని పిలిచాము. అందరూ ఫస్ట్‌క్లాస్‌లో ప్యాసయినవాళ్ళే

అన్నిట్లో అందరూ సమానులే. కాని ప్రత్యేకించి ఈ ఉద్యోగానికి ఎవరు సరిపోతారో ఎలా చెప్పగలం? అంతా మన అదృష్టం."

విశాల ఆలోచించింది.

ఇంటర్వ్యూ సమయం సమీపించ సాగింది. దివానుగారింట్లోనే ఇంటర్వ్యూ. ఆయన నౌకర్ని పిలిచి, వెయిటింగ్ రూంలోని సోఫాలూ, టేబిలూ, నిలువుటద్దమూ శుభ్రం చేసి ఇంటర్వ్యూకి అన్నీ సిద్ధం చెయ్యమనీ, అభ్యర్థులు రాగానే వారిని వెయిటింగ్ రూంలో కూర్చోపెట్టమనీ ఆర్డరు వేశారు.

విశాల పెదవులమీద చిరునవ్వు చిందులాడింది. ఆమె ఆలోచనా తరంగం ఒడ్డుకు వచ్చింది. నౌకర్ని పిలిచి ఏదో నెమ్మదిగా చెప్పింది. అతడు బెదురుగా దివానుగారివైపు చూశాడు. ఆయన విశాలవైపు చూశాడు. 'ఫరవాలేదులే', అంది విశాల నౌకరుతో. అతడు మళ్ళీ దివానుగారివైపు చూశాడు.

దివానుగారు ఏమీ అనలేదు. విశాల ఏమీ మాట్లాడలేదు. నౌకరు వెళ్ళిపోయాడు.

దివానుగారు కూడా ఏదో ఆలోచిస్తూనే అడుగులో అడుగేశాడు.

ఇంటర్వ్యూకి పిలిచిన ఆరుగురిలో అయిదుగురే వచ్చారు. ఒక్కొక్కరినే ఏవో కొన్ని ప్రశ్నలడిగి ఇంటర్వ్యూ అయిందనిపించారు దివానుగారు. అందరూ వెయిటింగ్ రూములో రెస్టు తీసుకుంటున్నారు! ఎవరి ముఖాల్లోను

సంతృప్తిలేదు. ఆశాభంగం, కోపం, చులకన, హేళన వారి ముఖాల్లో ద్యోతకమవుతున్నాయి.

"భలే ఇంటర్వ్యూ", అన్నాడు ఉండబట్టలేక ఒక అభ్యర్థి. అందరూ ఒక్కసారిగా నవ్వారు.

"ఏం దివానుగారండీ!" అన్నాడు మరొకడు.

"గట్టివాడే నంటూరు మరి", అన్నాడు ఇంకొకడు అర్థం కానట్టు.

"ఏంగట్టి బాబూ? ఏం చదివాడో, ఏమో గాని అడగటానికి ప్రశ్నలే లేనట్టు ఒకటే సొంత డబ్బా. ఈ సోఫాలు ఇంగ్లండ్‌నించి తెప్పించాట్ట. ఆ టేబిల్స్ జర్మనీ నించి తెప్పించాట్ట. ఆ అద్దం బెల్జియంనించి సరాసరి ఇక్కడికి వొచ్చిందట. మరి ఈయన ఏ వండర్‌లాండ్‌నించి దిగి వచ్చాడో!"

అందరూ నవ్వారు.

అదేసమయంలో ఓ వ్యక్తి ఆదరా బాదరాగా పెద్ద పెద్ద అంగలేసుకుంటు గదిలో ప్రవేశించి, ఓసారి గ్లైంచూసుకుని, ఓసారి అందరి ముఖాలు చూసి, వెంటనే జేబురుమాలు తీసుకుని ముఖం తుడుచుకోసాగాడు. "ఇంటర్వ్యూకి వచ్చారా సార్?" అన్నాడు ఒకడు ఎగతాళిగా.

"అవునండి; ఆలస్యమై పోయింది. ఇంచుమించు పరుగెత్తాను. స్టేషన్లో ఒక్క బండీలేదు. ఏం ఊరండీ?" అన్నాడు.

"మరేం ఫరవాలేదులెండి. ఇంత గొప్ప ఇంటర్వ్యూకి అంతమాత్రం ఆలస్యమైతే ఏం నష్టంలేదు. మీరు మాత్రం

కొంస్త ఈ సామాన్లు పరకాయించి చూడండి. ఆ బెల్జియం అద్దం సైజూ, మందం, మెరుగూ; ఈ సోఫాల నునుపూ, ఇవి తయారైన విదేశాల పేర్లూ ... ఇవేనండోయ్ చాలా ముఖ్యం."

ఆ వ్యక్తి ఈ మాటలు సరిగా వినలేదు. అద్దం అనగానే అటువైపు అతని దృష్టి మళ్ళింది. సరాసరి అద్దం దగ్గరికి వెళ్ళి సూటూ, హాటూ, సరిచూసుకోబోయాడు. అద్దం సరిగా కనిపించలేదు. దుమ్మూ ధూళితో నిండి ఉంది. పక్కన చూశాడు. అద్దం అమర్చిన బల్లమీద పక్కగా డస్టర్ కనిపించింది. అది తీసి అద్దం శుభ్రంగా తుడిచేసి, చెదిరిపోయిన జుట్టూ, కొంచెం నలిగిన కోటూ, పక్కకి జరిగిన నెక్ టై సరిచేసుకున్నాడు.

ఇదంతా చూసి రెస్టు తీసుకుంటున్న అభ్యర్థులు నవ్వుకున్నారు.

"అంత నీటు పనికిరాదండీ", నెమ్మదిగా అన్నాడు ఒక అభ్యర్థి పక్కన వున్న తాత్కాలిక స్నేహితుడితో.

"నీటుగా లేకపోతే ఉద్యోగం రాదని భయం కాబోలు పాపం."

"మరేం ఫరవాలేదులెండి రాకపోతే. ఏ ఉద్యోగమైనా చేసేరకమే."

"ఓహో అలాగా? మీకు తెలుసు కాబోలు ఇతను."

"ముఖం చూస్తే తెలియదుటండీ."

"అవునవును. మద్రాస్‌సైడ్‌నించి వచ్చినట్టున్నాడు. అన్నట్టు మనందరం వాల్తేరుసైడ్‌నించే వచ్చాం."

"ఎందుకరండీ దండగ? ఈ దివానుగారి దగ్గర ఉద్యోగం వెలగబెట్టటం కంటే నిరుద్యోగం నయం."

కొత్తవ్యక్తి అద్దంలో చూసుకోటం ముగించి గది నాలుగు మూలలూ చూసి ఖాళీ సోఫాలో కూర్చుని అన్నాడు.

"మీ ఇంటర్వ్యూ ఐపోయిందాండి ?"

అయిందని అందరూ తలలూపారు.

"దివానుగారు కదా! ఇలా ఉంచారేమండి వెయిటింగ్ రూం? ఆ అద్దం నిండా దుమ్మే. మీరు చూడలేదా?"

"ఎందుకు చూడలేదు? అందరం చూశాం. ఆ మాత్రం పరిశీలనాశక్తి లేకపోలేదు లెండి ఇక్కడెవరికీ !" అన్నాడో అభ్యర్థి.

"అబ్బెబ్బె అదికాదండి," అన్నాడా వ్యక్తి.

"ఆ అద్దంమీద దుమ్మే పట్టింది మనకి! అందమైన అద్దాన్ని వొదిలేసి దుమ్ముకోసం చూస్తారేమండి?"

"అదెట్లా ఏడిస్తే ఎవడికెక్కువాలి? మనం ఉద్యోగం కోసం వచ్చాం గాని అద్దంలో అందం చూసుకోవడానికి కాదుగా."

"మీరందరూ నవ్వుతారేమోగాని, నేనసలా విషయమే పట్టించుకోలేదండీ. అంతసేపు అద్దం ముందున్నాను గాని దాని దుమ్ముసంగతే నాకు స్పష్టంగా బుర్రకెక్కలేదండీ."

"నేను రాగానే చూశానండి. నౌకర్ని పిల్చి చెబుదామనుకున్నాను. కాని మనం అనవసరంగా కలగచేసుకోటం దేనికిలెమ్మని ఊరుకున్నాను."

"ఏమిటండి ఈ ఊకదంపుడు ? ప్రపంచంలో ఇంతకంటె మంచి విషయాలేమీ లేవా? పాలిటిక్స్ మాట్లాడండి. విందాం. లేకపోతె సినిమాల్ని గురించి మాట్లాడండి. ఏమండీ, మీకే సినిమా లిష్టం? హిందీ, ఇంగ్లీషు, తెలుగు..."

అందరూ నవ్వారు.

ఆ సమయంలో నౌకరువచ్చి 'ప్రకాశరావుగారు వచ్చారా?' అని అడిగాడు.

"నేనే," అన్నాడు కొత్తవ్యక్తి.

"దివానుగారు రమ్మంటున్నారు సార్."

ప్రకాశరావు నౌకరువెంట లోపలికి వెళ్ళాడు. మిగతా అభ్యర్థులు ముసిముసిగా నవ్వుకున్నారు.

దివానుగారిని చూడగానే నమస్కారం చేశాడు ప్రకాశరావు.

"కూర్చోండి, మీరేనా ప్రకాశరావుగారు?"

"అవునండి," కూర్చుంటూ అన్నాడు ప్రకాశరావు.

దివానుగారు కాగితాలు తిరగవేస్తూ "ఈ ఉద్యోగం చాలా కష్టమైందండి", అన్నారు. ఆమాట ఆయన ఉద్యోగాన్ని గురించో, లేక ఇంటర్వ్యూకి సంబంధించిన ఉద్యోగాన్ని గురించో తెలియక ఒకక్షణం ఆలోచించి అన్నాడు ప్రకాశరావు.

"ఉద్యోగం అన్న తరవాత కష్టపడక తప్పదు కదండి."

"నిజమే. ఈ ఉద్యోగం మీకిస్తే చెయ్యటం ఇష్ట మేనా ?"

"ఇష్టమే. లేకపోతే ఇంతదూరం వచ్చేవాడిని కాదు."

"అందుకు మీ అభిప్రాయంలో మీ ప్రత్యేకార్హత లేమిటి?"

"ఇతరుల అర్హతలు తెలియవు. కనుక నా ప్రత్యే కార్హత లేమిటో చెప్పలేను. కాని ఇందులో నాకభిరుచి ఉంది."

"ఎందులో ? సమాజంలోనా? అభ్యుదయంలోనా? ఉద్యోగంలోనా ?"

"సమాజాభ్యుదయానికి తోడ్పడే ఉద్యోగంలో."

"ఉద్యోగం ముఖ్యమన్న మాట."

"కాదు. అవసరం."

"ఈ ఉద్యోగం మీకు వస్తుందని ఆశిస్తున్నారా?"

"ఆశించటం, అవకాశం దొరికితే ఉపయోగించుకో టానికి ప్రయత్నించటం సహజం. అద్దం కనిపిస్తే ముఖం చూసుకోకుండా ఉంటారా ఎవరైనా?"

ఒక్కసారి నఖశిఖపర్యంతం ప్రకాశరావు మీద దృష్టి ప్రసరింపచేశారు దివానుగారు. తరవాత చిరునవ్వు నవ్వుతూ అన్నారు. "అద్దం విషయం వచ్చింది కనుక చెబుతున్నాను. వెయిటింగ్ రూంలో అద్దం ఉంది చూశారూ? ఎటువంటి అద్దమండీ! ఏమంటారు?"

తల ఊపాడు ప్రకాశరావు చిరు నవ్వుతో.

"ఆ తళతళ, ఆ నాణ్యత, ఆ నగిషీ! ఎంతముచ్చట వేస్తుందండీ! ఇక్కడి సరుకు కాదండోయ్. సరాసరి బెల్జియం నించి తెప్పించాను. ఆఁ. బెల్జియంనించి! నాకొకటీ, జమీందారుగారికి ఒకటీ. ఎంత చక్కగా ప్రతిబింబం కనిపిస్తుంది! దుమ్ము పడ్డా స్ఫటికంలా మెరుస్తూనే ఉంటుందంటే నమ్మండి."

ప్రకాశరావు పెదవులమీద హాసరేఖ ఉదయించింది. అది చూసి దివానుగారు కొంచెం తగ్గారు.

"దుమ్ము పడ్డా స్ఫటికంలా మెరుస్తుందంటే మెరుస్తుందని కాదు. అంత నాణ్యమైనదని నా ఉద్దేశం."

"నాకు తెలుసండి. అందుకేకదూ? అద్దం తుడిచి మరీ ప్రతిబింబం చూసుకున్నాను."

దివానుగారు తృళ్ళిపడ్డారు. గుచ్చిగుచ్చి ప్రకాశరావు ముఖంలోకి చూశారు.

"తుడిచారా?"

"అవునండి."

"అయితే ఈ ఉద్యోగం మీకు రాదు."

"ఉద్యోగానికీ, దీనికీ, ఏమిటి సంబంధం."

"సమాజాభ్యుదయాధికారి పదవికోసం వచ్చి, నౌకరు పని చేశారు."

తెల్లబోయాడు ప్రకాశరావు. కాని మరుక్షణంలోనే తేరుకుని అన్నాడు.

"కాదండి. నౌకరుపదవికోసంవచ్చి సమాజాభ్యుదయాధికారి పనిచేశాను."

అంతే! దివానుగారి సమస్య మంచుతెరలా తొలగిపోయింది. వారి ప్రసన్నత చూసి ప్రకాశరావు మందస్మితవదను డయాడు. తెరవెనక ఉన్న విశాల గాజులు గలగలమన్నాయి. ఆమె ఆర్డర్ శ్రైపు చేస్తోంది. దివానుగారి మనసులో మెదిలే శుభలేఖ గురించి కూడా తెలిస్తే వాళ్ళ ఆనందం ద్విగుణీకృత మయేది. కాని దేనికైనా సమయం రావాలికదా!

---





# పాతమనుషులు

పోస్టుమన్ ఇచ్చివెళ్లిన కవరు చింపి ఉత్తరం చదువుకునేసరికి రంగారావు ముఖంలో వింతమార్పు కలిగింది. మొదట ఆ ఉత్తరం ఎవరు రాసిందీ అతడు పోల్చుకోలేక పోయాడు. కాని మరుక్షణంలోనే మరపు తెర విడిపోయింది. జ్ఞాపకాల అట్టడుగున పడి నలిగిపోయిన వృత్తాంతం గుర్తుకు వచ్చింది. ఆ ఉత్తరం తన జాబుకి జవాబే. కాని ఆ జవాబు రావటానికి రెండుసంవత్సరాల కాలం పట్టింది. ఒకప్పుడు ఆజవాబుకోసం కన్నులు కాయలు కాచేట్టు ఎదురు చూశాడు. కాని తీరని ఆశాభంగం కలిగింది. అంతేకాదు. భరించలేని అవమానం కలిగింది. కాని... కాని...... ఇప్పుడు ఆ జవాబు తనలో ఏ ఉత్సాహాన్నీ కలిగించటం లేదు. మీదుమిక్కిలి మరిచిపోయిన బాధల్ని రేపింది.

విశాలని తను ప్రేమించాడు. కనీసం, ఒకప్పుడు ఆమెని ఆరాధించాడు. తన అంతస్తుకీ ఆమె అంతస్తుకీ తేడా ఉండొచ్చు, కాని హృదయగతమైన బాంధవ్యం బాహ్యపరిస్థితులకి అతీతమని తను వూహించాడు. అందుకే ధైర్యంగా పరిస్థితిని ఆమెకు తెలియబరుస్తూ ఉత్తరం రాశాడు. తనని సహృదయతతో అర్థం చేసుకోవలసిందని ప్రార్థించాడు. ఆమె జవాబుమీదే తన భవిష్యత్తంతా ఆధారపడి ఉందని సూచించాడు. ఒకవేళ ఆమె అన్యథా భావిస్తే తనని క్షమించి ఆ విషయం మర్చిపోవలసిందని ప్రాధేయపడ్డాడు. వీటన్నిటికీ జవాబుగా ఆమె మౌనం ధరించింది. మౌనంలోని అనిశ్చిత పరిస్థితిని భరించలేక ముఖాముఖి మాట్లాడటానికి ఇంటికి వెడితే తనని ద్వారం దగ్గర చూసి ఆమె గబాలున తలుపు వేసుకుని లోపలికి వెళ్ళిపోయింది. తన ముఖంలో నెత్తురుచుక్క లేకుండా పోయింది ఆక్షణం. తను నిశ్చేష్టుడై పోయాడు. బరువుగా అడుగువేసుకుంటూ వచ్చినదారినే వెళ్లిపోయాడు. ఇంత కర్కశంగా అవమానకరంగా, ఆమె తనపట్ల ప్రవర్తిస్తుందని ఎంతమాత్రం ఊహించలేక పోయాడు. ఆమెతో తనకి కాలేజీలో చదివే రోజుల్నుంచీ పరిచయం ఉంది. తనతో ఎన్నోసార్లు ఆమె స్వేచ్ఛగా మాట్లాడింది. బూచిని చూచినట్లుగా అలా భయపడి పారిపోవలసిన అవసరం ఆమెకేమీ లేదు. పోనీ అంతతో ఆగితే పరిస్థితి మరోవిధంగా ఉండేది. తను ఎన్నడూ ఊహించని విధంగా ఆమె ప్రవర్తించింది. ఆ సంఘటన ఇంకా తన కళ్ళకి కట్టినట్టుగా ఉంది...

భగ్నహృదయంతో ఆ ఉదయం తను ఆఫీసుకి వెళ్ళాడు. తను అదోవిధంగా ఉండటం చూసి మిత్రులంతా పరిహాసం చేయసాగారు. ప్రేమ వ్యవహారంలో పడి ప్రపంచం మర్చిపోయాడన్నారు. తను విశాలకి రాసిన ఉత్తరం విషయం వాళ్ళందరికీ ఎలాగో తెలిసిపోయింది. తన సాహసానికి వాళ్ళందరూ అబ్బురపడి తనని అభినందించారు. కాని తన మనసులోని తుఫాను సంగతి గ్రహించగల మిత్రుడు ఒక్కడూ లేడు.

తను పరధ్యానంగా ఏదో పని చేసుకొంటుంటే బంట్రోతు వచ్చి ఆఫీసరుగారు రమ్మంటున్నారని చెప్పాడు. తన గుండెల్లో రాయిపడ్డది. భయం భయంగా వెళ్లాడు. తనని చూసీచూడగానే ఉగ్రరూపం దాల్చి ఆఫీసరు "నేరం ఒప్పుకుంటున్నావా?" అని అరిచాడు. తనకి ఒక్కక్షణం మతి తప్పినట్లయింది. ధైర్యంచేసి హీనస్వరంతో అడిగాడు: "నేరమేమిటి సార్?"

"సిగ్గులేక నేరమేమిటో అడుగుతున్నావా? ఈ ఉత్తరం రాసిం దెవరు? నువ్వేనా ?"

డ్రాయర్‌లోంచి ఓ ఉత్తరం తీసి తన కళ్ళమీదికి విసిరికొట్టాడు ఆఫీసరు. ఆ ఉత్తరం చూడగానే తన ప్రాణం పైనే పోయింది. ఎంతపని చేసింది విశాల! తనంటే ఆమెకిష్టం లేకపోవచ్చు. కాని అంత మూర్ఖంగా ప్రవర్తించాలా? తనతో ఒక్కమాట చెబితే సరిపోయేదిగదా! "ఏం మాట్లాడవేం ?"

తను ఏమీ అనలేక తలూపాడు.

"నిన్ను డిస్మిస్ చేశాను, ఫో", అరిచాడు ఆఫీసర్.

తనకు కాళ్లు వణికాయి. ఉద్యోగం ఉంటేనే తనకి రోజు గడవదు. ఇక లేకపోతే దిక్కేమిటి?

"పైకి వస్తావు, బాగుపడతావు అనుకున్నాను. ఛీ–నీ ముఖం చూడటం పాపం. వెళ్ళిపో", అన్నాడు ఆఫీసరు. తనేదో చెప్పాలని నోరువిప్పాడు. నెమ్మదిగా అన్నాడు. "క్షమించండి, కాని నేను మనస్ఫూర్తిగా విశాలని ప్రేమించాను."

"షటప్. తాహ తెలిసి మాట్లాడు", అన్నాడు ఆఫీసరు.

నెమ్మదిగా బయటికి వచ్చాడు. తన తాహతు! పొరపాటే! ఆఫీసులో చేరింతర్వాత తన తాహతు మారిపోయింది! తను చెప్పేది వినటానికికూడ ఆయనకు ఓపిక లేదు. నేరం మోపాడు. తన జవాబు వినే అవసరంకూడా లేదనుకున్నాడు. మాట అనగానే మండిపడ్డాడు. తన అంతస్తు తక్కువైతేమాత్రం తను మనిషికాడా? తనేం అపసవ్యంగా ప్రవర్తించలేదే! ఎంత అనాలోచితంగా అహంకారంగా మాట్లాడుతారు మనుషులు!

ఆఫీసులోకి వచ్చాడు తను. అందరూ తనని చూచి లేని పోని సానుభూతి వెలిబుచ్చారు. అసలు తను అంత అనాలోచితంగా ఉత్తరం రాయకుండ ఉండాల్సిందని అన్నారు. ఆ రోజున అందరూ తనని అభినందించారు. ఈరోజున తన వల్ల తప్పు పడుతున్నారు. ఫలితాన్నిబట్టి చేసినపనుల్ని సమర్థించటమో దుయ్యబట్టటమో, వాళ్ళకలవాటు. కాని తన పద్ధతి అదికాదు. తను సరియైన మార్గం అనుకుంటే ఫలితం

ఏమైనా తప్పక అనుసరిస్తాడు. కనుక గతించినదానికి తను విచారించాల్సిన అవసరం లేదు. ఎటొచ్చీ మనుషుల మన స్తత్వాన్ని కొంత తెలుసుకో గలిగాడు. తను ఆఫీసు విడిచి బయటికి నడిచాడు. మనసంతా చికాకుగా వుంది. ఉద్యోగం పోయింది. అవమానానికి గురైనాడు. మనసు విరిగింది. కావాలనుకున్నది లభించలేదు. కాని అందుకోసం తను బాధ పడటం లేదు. ఆప్తులనుకున్న వాళ్లు విసిరి కసిరి కొట్టారు. అదీ మానని గాయం.

తను అలా కుంగిపోయిన మనసుతో నడుస్తుంటే, తనని ఎక్కడ చూశాడోకాని కొట్టులోంచి గబగబ పరుగెత్తుకొచ్చి నడిబజార్లో నిలేశాడు సుబ్బారావు. అతనికి తను వంద రూపాయలు బాకీ వున్నాడు. తను యిస్తానన్న గడువుకి ఇవ్వనిమాట నిజమే. అయినా అంత అసభ్యంగా అతడు ప్రవర్తిస్తాడనుకోలేదు. తప్పకవచ్చే నెల తీరుస్తాననిమాటిచ్చినా అతడు వినలేదు. పైగా ఆమాట అనగానే అతడు వెకిలిగా నవ్వి ఎగతాళిగా అన్నాడు. "ఉద్యోగం ఉన్నప్పుడు లేదు గానీ, ఉద్యోగం పోయింతర్వాత తీరుస్తావులేవయ్యా మహా!"

ఆ మాటల్లోని చులకనతో కూడిన అవమానంకంటె ఎక్కువగా ఆశ్చర్యం వేసింది. తనకి తన ఉద్యోగం పోయిందన్న విషయం అప్పుడే సుబ్బారావు కెలా తెలిసింది ?

"ఆ విషయం మీ కెలా తెలిసింది ?" అని, అడిగాడు తను.

"ఏ విషయం ?"

"అదే. ఉద్యోగం పోయిందన్న విషయం."

"మీ తోటి ఆఫీసు గుమస్తాలు పొద్దున్నే అనుకున్నారు. హెడ్ గుమస్తాగారు చెప్పారట. ఆఫీసరుగా రమ్మాయితో మీ రేదో వ్యవహారం జరపబోతే ఆయన తెలుసుకుని డిస్మిస్ చేసేస్తానని పొద్దున ధాం ధూం చేశారట. పనిమీద హెడ్ గుమాస్తాగారు ఆఫీసరుగారింటికి వెడితే ఆయనతో యీ విషయం అంతా చెప్పారట. నేను పనిమీద మీ ఆఫీసుకు ఇంతకిముందే వెడితే, సంగతి తెలిసింది. అవునుగానీ అదేంపనయ్యా. ఏదో పెద్దమనిషివని అనుకున్నాను గాని ఆఫీసరుగారి కోటలోనే పాగా వేసే ఘనుడివని అనుకోలేదే!"

గుక్కతిప్పకుండ సుబ్బారావు అలా చెబుతుంటే తను దిగ్భ్రాంతుడయాడు. అయితే, తన మిత్రులందరికీ యీ విషయం తనకంటే ముందే తెలిసిందన్నమాట. అయితే వాళ్ళన్నమాటలన్నీ తనని అపహాస్యం చేయటానికే నన్న మాట. తను తెలుసుకోలేకపోయాడు. స్నేహితులను కున్నాడుగానీ ఇంతదౌర్భాగ్యులనుకోలేదు. తను కష్టంలో వుంటే వాళ్ళకి చెరలాటంగాఉంది! తనేదో ఘనకార్యం చేశాడని తన భుజం తట్టారు. ఆఫీసరుమీద వాళ్ళందరికి అంతో ఇంతో కోపంవుంది. బహుశా తనని ప్రశంసించటం తనేదో ఆయన్ని అపఖ్యాతిపాలు చేశాడనే తృప్తితో కాబోలు. వాళ్ళలో కొందరికైనా తనమీద కూడా కోపం వుంది. తనమీద ఆఫీసరుకి ఏదో కొంత అభిమానం ఉందని ఈర్ష్య! ఇప్పుడు తనూ, ఆయనా ఇద్దరూ అవమానించ బడ్డారనే తృప్తితో అక్కసు తీరేట్టు వ్యంగ్యంగా తనతో ప్రసంగించారు! ఎటువంటి కపట మనస్తత్వం.

అంతా ఆలోచిస్తుంటే తనకి విరక్తి కలిగింది. తనేదో ఆలోచిస్తుంటే సుబ్బారావు భుజం తట్టాడు.

"బాకీ సంగతి ఏం చెప్పావయ్యా?"

బాకీ! ఎలా తీర్చగలడు తను! అతడు నడిబజార్లో అలా అడుగుతుంటే తనకి చిన్నతనం వేసింది. తన ఉద్యోగం పోయిందని తెలిసినా, నిర్దయగా, ఎలా తీరుస్తావని అడుగుతున్నాడు. కాని కొన్నాళ్ళు గడువిస్తానులెమ్మని మాటైనా అనలేదు. అసహ్యం వేసింది. చేతికివున్న రిస్టువాచి తీసి సుబ్బారావు చేతిలో పడేసి అడుగు ముందుకి వేశాడు తను. లోపల సంతోషించినా ఏదో మొహమాటపడుట్లు "అబ్బెబ్బె.. రిస్టువాచి ఎందుకూ?" అని గొణుగుతూనే జేబులో వేసుకున్నాడు సుబ్బారావు. ఎందుకో పై పై మర్యాదలు!

కష్టాలు ప్రారంభమయ్యాయి. పొద్దుటినుంచి తిండి తినలేదు. జేబులో డబ్బులేదు. అయినా ధైర్యం విడువక ఊరంతా ఉద్యోగంకోసం తిరిగాడు. కాళ్ళు బలపాలు కట్టాయి... ఆకలి దహించసాగింది. పచ్చిమంచినీళ్ళతో కడుపునింపుకున్నాడు. ప్రపంచంలోని కుళ్ళునీ, స్వార్థాన్నీ, దయారాహిత్యాన్నీ, పశుత్వాన్నీ, ఆ ఒక్కరోజులో పూర్తిగా చూశాడు తను. ప్రపంచంలో మానవత్వం ఏమూల దాగిందోనని ఆశ్చర్యపోయాడు. అంతకుముందున్న ఆశావాదం అంతా అణగారి పోయింది. తన మనుషులు, తన ఊరు, తన దేశం, తన ప్రపంచం అనేభావాలన్నీ తారుమారై పోయాయి. తీరని ద్వేషం ప్రబలింది. అందరూ కలకలలాడుతూ ఊరంతా సందడిగాఉంటే తను ఒక మారుమూల

దౌర్భాగ్యస్థితిలో ఆకలితో మాడుతూ మంచినీళ్ళతో కడుపు నింపుకుంటూ దుర్భరజీవితం గడపవలసి వచ్చింది. తోటి మనుషులవలె ఎవరికీ తనసంగతి పట్టలేదు. చిన్న మొత్తం సహాయం చేసినవాడులేడు. చిరునవ్వు చిందులాడే వయస్సులో ఎటుచూసినా ఏదో ఉద్రేకం కలిగేది తనకి. తనజీవితాన్ని అందరూ కలిసి దోచుకుంటున్నారు.

అయితే, బళ్ళు ఓడలూ, ఓడలు బళ్ళూ కాకపోవు. ఆ రోజు ఉదయం తన జీవితానికి శుభోదయం. ఆనాటి శుభ ఘడియలో పోస్టుమేన్ అందించిన ఉత్తరం తన దుర్భర జీవితానికి స్వస్తిచెప్పింది. స్వగ్రామంలోని భూముల్లో మైకా గనులున్నాయని భూగర్భశాస్త్రజ్ఞులు కనుగొన్నారట. ఎందుకూ పనికిరాదని వదలివేసిన తన నాలుగ్గైదెకరాల బీడుకి మంచి గిరాకీ తగిలింది. ఆ స్థలం అమ్మాలని తను విశ్వ ప్రయత్నం చేశాడు. సాధ్యం కాలేదు. ఎందుకూ పనికిరాని చవిటిపఱ్ఱ అని ఎవరూ కొనటానికిరాలేదు. అదృష్టవంతుడే తను. దమ్మిడీ ఆదాయంలేని భూమి వేల ఖరీదు చేసింది! అప్పటినుంచీ తనదశ మారిపోయింది. అందరూ తనని అభినందించినవారే. తన ఉనికి అప్పుడుగానీ ఎవరికీ గుర్తులేదు.

అంతేకాదు, ఓడలు బళ్లుకూడా అయాయి. ఈవార్త తెలిసి తన గ్రామంలోని భూముల్ని చాలామంది పెద్ద ధరయిచ్చి కొన్నారు. అందులో తన పూర్వపు ఆఫీసరుగారు ఒకరు. పాపం, దురదృష్టవంతుడు. ఆయన కొన్న భూముల్లో గనులు లేకపోలేదుగానీ అవి లాభసాటికావట. త్రవ్వకం ఖర్చులు గిట్టవట. మనిషి కుంగిపోయాడు పాపం. ఉన్న

రంగనాథరావు కుర్చీకి జేరగిలబడి గట్టిగా పొగపీల్చి వెయిటింగ్‌రూమ్‌చుట్టూ ఒకసారిచూసి వొదిలేశాడు. సరిగా అదేసమయంలో తలుపుదగ్గర ఇద్దరుముగ్గురు యువకులు తార ట్లాడుతూ లోపలికి రావటానికి సందేహిస్తుండటం గమనించి 'ఏం కావా', లన్నట్టుగా వాళ్ళవైపు చూసి తల ఎగరవేశాడు. ఆ సంజ్ఞతో వాళ్ళకి ధైర్యం వొచ్చి సరాసరి లోపలికివచ్చి ఏదో లిస్టుతీసి రంగనాథరావుకి చూపిస్తూ 'తుపానుబాధితుల సహాయార్థం', అని నసిగారు. కోపమూ నవ్వూకూడా కలిసి వొచ్చేసరికి రంగనాథరావు తప్పనిసరిగా చిరునవ్వునవ్వి 'ఈ చందాలకి వేళా పాళా లేదా?' అన్నాడు. 'సంఘసేవ అవన్నీ గుర్తించదండీ', అని, తన సమాధానం హుందాగానే ఉన్న దని గర్వంగా చూశాడు ఆ బృందనాయకుడు. చందాలలిస్టు ఓసారి పైనించి కిందికిచూసి వాపసు ఇచ్చేశాడు ఆఫీసర్. పదులూ, పదిహేన్లూ వేశారు చాలామంది.

"తమరు......" అసంపూర్తిగా ఆగాడు చందాల వసూలుదారు. పెదవి విరిచాడు రంగనాథరావు.

"ఏదో తమకు తోచినది__"

ఆ మాటలకు మధ్యలోనే అడ్డొచ్చి అన్నాడు రంగ నాథరావు.

"చాలామంది వేశారుగా చాల్లెండి".

"తమలాంటివారే అలా అనుకుంటే__" ఆశకొద్దీ నమ్రతగా అడుగుతున్నా డతను. కాని చూస్తూచూస్తూ పదో పదిహేనో వొదులుకోబుద్ధి పుట్టలేదు రంగనాథరావుకి.

వెళ్ళిపొమ్మని ఖచ్చితంగా చెప్పేశాడు. ఆఖరి విజ్ఞప్తి చేయ సాగా డతను.

"మీరిచ్చే ప్రతి రాగిదమ్మిడీ ఒక బీదవాడి అతి ప్రాథమిక అవసరాలకు కొంతకుకొంతైనా సహాయపడుతుంది. ప్రతి అణా ఒక బీదవాడి ముఖ్యావసరాలకు..."

"ఎవ రా బీదవాడు ?"

"లక్షోపలక్షలు. ఎందరెందరో దరిద్రనారాయణులు."

"అయితే సరే. అందరికీ మనం ఎక్కడ సహాయం చేస్తాం? అది సంభవమేనా?" అని గడుసుగా నవ్వి, ఇహ వెళ్ళమన్నట్టుగా గడియారంవైపు చూసుకుని, ఒకసారి దగ్గి ముఖం కొంచెం గంభీరంగా పెట్టాడు రంగనాథరావు. అదే క్షణాన అతడు ఊహించని సంఘటన జరిగిపోయి అతనిని ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. తను అనుమానించిన యువకుడు చప్పున పర్సు తీసి నోట్లన్నీ బయటికి లాగి చందా ఇచ్చే శాడు. ఈ ఆకస్మికసంఘటనకి స్తంభీభూతులై ఆ చందాల బృందంవారు ఏమనటానికీ నోరురాక ఏదో కృతజ్ఞతాపూర్వ కంగా నసిగి వెళ్ళబోతూ ఏదో జ్ఞాపకం వొచ్చినట్టు ఆగి, ఆ యువకుడి పేరు అడిగారు. నిర్లిప్తంగా అతను, "శేఖరం", అన్నాడు. ఆపేరు రాసుకుని మళ్ళీ ఇంకోసారి కృతజ్ఞత చెప్పేసి రంగనాథరావువైపు కొంచెం చులకనగా చూసి, వెళ్ళిపోయారు చందాలవారు. ముఖం కొట్టేసినట్టయి ఆ ఉద్యోగి శేఖరంవైపు చూడలేక తల దించుకొని, ఇంతలో ఏదో తళుక్కున మనసులో మెరసినట్టయి హేళనగా అన్నాడు.

"సొంత డబ్బేనా ?"

శేఖరం జవాబివ్వదలచుకోక మాట్లాడకుండా ఊరు కున్నాడు. ఆఫీసర్‌కి కొంచెం ఉక్రోషం వొచ్చింది. పౌరుషంగా అన్నాడు.

"ఆ ఉత్తరం నేను చూడాలి."

"చూశారుగా", ఈసడింపుగా అన్నాడు శేఖరం.

"లేదు. చూడాలి".

"కారణం ?"

"మీ ప్రవర్తన అనుమానాస్పదంగా ఉంది. చదువుకున్నట్టుగా కనిపిస్తున్నారు. నాకిబ్బంది కలిగించకండి."

ఆ మాటలభావం గ్రహించి ఉత్తరం అతనిమీద పడేశాడు శేఖరం నిర్లక్ష్యంగా. రంగనాథరావు చదవసాగాడు.

"ప్రియమైన రోజా,

ఈ రాత్రి మద్రాస్ మెయిల్ మనిద్దరికోసమే హుటాహుటిగా వొస్తోందనుకున్నాను. నన్ను అపహాసించి అది వెళ్ళిపోతుంటే కుంగిపోయాను. గుండె పగిలిపోతే బాగుండు ననిపించింది. నువ్వు రాలేదు. కారణం తెలుసు. పరిస్థితులన్నీ మనకు వ్యతిరేకమే. బతికి బావుకునేదేమిటి ? నిన్ను క్షోభ పెట్టడమేగా ! సెలవియ్యి.

సి

శేఖరం"

చేసేది పోలీస్ ఉద్యోగమే అయినా రంగనాథరావుది జాలిగుండె. ఉత్తరం చదివిన తరవాత అతనికి శేఖరం మీది కోపం పోయి ఆ స్థానంలో జాలి కలిగింది.

"పాపం, ప్రేమోపహతుడు", అనుకున్నాడు. శేఖరం వైపు దయతో నిండిన కళ్ళతో చూశాడు. కాని అతడు తలవంచుకునే వున్నాడు.

"ఏమిటోయ్ ఈపని?" కొంచెం చనువుగా అడిగాడు రంగనాథరావు. శేఖరం జవాబివ్వలేదు.

"ఎవరా అమ్మాయి?" ప్రత్యుత్తరం లేదు శేఖరం దగ్గర్నించి.

"ఇందుకా అంత ఆదుర్దాగా ప్లాట్‌ఫారం మీద కాలు కాలిన పిల్లిలా తిరిగావు! ఎందుకో అనుకున్నాను", తేలిగ్గా నవ్వాడు రంగనాథరావు.

ఆ నవ్వుకి శేఖరం ఓసారి తలెత్తి అతనివైపు చూసి మళ్లీ పక్కకి తిప్పి ఏదో ఆలోచించసాగాడు. వ్యవహారం తను ఊహించిన విధంగా పరిణమించటంలేదు. "ఆ అమ్మాయి నిన్ను నిజంగా ప్రేమించిందా?" కొంచెం కుతూహలంగా అడిగాడు రంగనాథరావు. ప్రేమవ్యవహారాల్లో సంబంధం కలిగించుకోటం ఆ పోలీస్ ఆఫీసర్‌కి అదే మొదటిసారి. ఈసారి శేఖరం నోరువిప్పాడు.

"మనస్సాక్షిగా."

"సాక్ష్యం?"

"ఆమెకి నేనూ, నా కామె."

"అయితే మరి పెళ్లెందుకు చేసుకోలేదు?"

"అనేక ఆటంకాలున్నాయి", అన్నాడు శేఖరం నిస్పృహగా.

"ఏమిటవి ?"

"నాకు వేలకివేలు లేవు. పెద్దపెద్ద చదువులు లేవు. గొప్పగొప్ప సంబంధీకులు లేరు. కామధేనువులాంటి ఉద్యోగం లేదు."

"అయితే ఏమున్నాయి?" అప్రయత్నంగా కొంచెం హాస్యధోరణిలో అడిగాడు రంగనాథరావు.

"తినటానికి తిండి ఉంది. బి. ఏ., డిగ్రీ ఉంది. సాహిత్య సంగీతంలో ప్రవేశం ఉంది. అన్నిటినీమించి హృదయం ఉంది", అన్నాడు శేఖరం ఆత్మగౌరవం ఉట్టిపడేలా.

"మంచిదే. మరి అభ్యంతరం ఏమిటి?" అడిగాడు రంగనాథరావు నిజంగానే అర్థంగాక. శేఖరం కళ్ళెత్తి ఆయన వైపుచూస్తూ విషాదంగా నవ్వాడు.

కాని ఆ అమ్మాయి తండ్రికి కావలసినవి అవికావు. కాబోయే అల్లుడు విదేశాల్లో డిగ్రీలు పొందిరావాలనీ, మంచి సంప్రదాయం అయి ఉండాలనీ, వర్ణాంతరం పనికి రాదనీ ఏవేవో ఊహలున్నాయి ఆయనకి", అంటూ నిట్టూర్చాడు శేఖరం.

"ఓహో, అలాగా!" అని మళ్లీ సందేహంగా "ఆయన్ని అడిగిచూశావా?" అన్నాడు రంగనాథరావు.

"ఎందుకూ ? లాభంలేదు."

"ఆ అమ్మాయి అడిగింది కాబోలు."

లేదన్నాడు శేఖరం.

రంగనాథరావు బిగ్గరగా నవ్వాడు. భావంగ్రహించి శేఖరం అందుకున్నాడు.

"అవసరం లేదు. ఆయన స్వభావం ఆమెకి పూర్తిగా తెలుసు. ప్రతి చిన్న విషయంలో ఆయన పేచీకోరనట. సహానం అంటే ఆయనకి అర్థం తెలియదుట. తనమాటే తనదిట. ఏమాత్రం అభ్యుదయ భావాలు లేవని, తను కాలేజీలో చేరేటప్పుడే ఈ విషయాలన్నీ హెచ్చరించాడని ఆమె నా కెన్నోసార్లు చెప్పింది. అందుకే ఆయనకి తెలియకుండా మద్రాసులో వివాహం చేసుకుందామని నిశ్చయించుకున్నాము. కాని నేను దురదృష్టవంతుణ్ణని తేలిపోయింది."

"అందువల్ల ఆత్మహత్య చేసుకుందామనుకున్నావా?" అన్నాడు రంగనాథరావు కొంచెం మందలింపుగా.

"ఏం చెయ్యను?" అన్నాడు శేఖరం నిస్సహాయంగా.

"అందుకేనా అంత ఉదారంగా కరెన్సీ నోట్లన్నీ పంచిపెట్టేశావు?" రంగనాథరావుస్వరంలో ఒక విధమైన ధ్వని గమనించిన శేఖరం ఏమీ బదులు చెప్పలేక ఊరుకున్నాడు.

"ఆత్మహత్య నేరమని తెలుసా?"

"కావచ్చు."

"ఇప్పుడు నిన్ను ఆత్మహత్యాప్రయత్న నేరంకింద అరెస్టుచేస్తే ఏంచేస్తావు?"

"మీ ఇష్టం", అన్నాడు శేఖరం నిర్లక్ష్యంగా.

"ఈ ప్రయత్నం విరమించుకుంటానని హామీ ఇస్తే నీ దారిని నువ్వూ, నా దారిన నేనూ పోవటానికి నాకు అభ్యంతరం లేదు. కాని నీ హామీపట్ల నువ్వు నిజాయితీగా ఉండాలి." అని అతనివైపు ఆశగా చూశాడు పోలీసు ఆఫీసర్.

"క్షమించండి. నాకు జీవితంమీద ఆశ లేదు."

"కాని ఆత్మహత్య నేరం, అన్యాయం, పిరికితనం, ఆలోచించు." శేఖరం జవాబివ్వలేదు.

"ఏం?" అన్నాడు రంగనాథరావు ఒప్పుకోమన్నట్లు.

"క్షమించండి", అన్నాడు శేఖరం.

"అయితే నిన్ను అరెస్టు చేయకతప్పదు."

"మీ ఇష్టం".

"ఆల్ రైట్, పద", విసుగ్గా అన్నాడు పోలీస్ ఆఫీసరు.

తీవ్రమైన ఆ కంఠం విని కొంచెం చలించాడు శేఖరం. అంతకోపంలో ఆయన్ని చూడటం అతని కదే ప్రథమం. బరువుగా అడుగులు వేసుకుంటూ నడవసాగాడు. ఇద్దరూ స్టేషన్ ఆవరణ దాటి బయటికి వచ్చారు. వెన్నెల మసక మసగ్గా మబ్బుల్లోంచి జారి పడుతోంది. వెన్నెల్లో రంగనాథరావు 'టూసీటర్' నల్లగా మెరుస్తోంది. డ్రైవరు కనిపించక చుట్టుప్రక్కల చూశాడు రంగనాథరావు. దూరంలో బీడీ కాల్చుకుంటూ అతడు ఎవరితోనో మాట్లాడుతున్నాడు. యజమాని కేక విని అతడు అదరిపడి

ఒక్క పరుగులో అక్కడికి చేరుకున్నాడు. రెండు తప్పులు చేశాడు తను. కారుదగ్గర హాజరు కాలేకపోవటం, బీడీ కాల్చుకుంటూ ఆఫీసరుగారి కంట పడటం. కోపంగా అరిచాడు రంగనాథరావు.

"ఎన్నిసార్లు చెప్పాను నీకు ఆ వెధవ పని చెయ్యొద్దని. కారుదగ్గర రెడీగా ఉండవు. నా ఎదుట బీడీకాల్చటం మానవు."

"సార్", అన్నాడు డ్రైవర్ బతిమాలుకుంటున్నట్టు.

"ఇప్పటికి వందసార్లు ఉద్యోగంపీకేశాను. ఏంలాభం?" గొణుక్కున్నాడు ఆఫీసర్.

అంటే మళ్లీ వందసార్లు ఉద్యోగం ఇచ్చాడన్నమాట అని నవ్వుకున్నాడు శేఖరం.

"సార్", అన్నాడు డ్రైవరు క్షమించమన్నట్టు.

ఇద్దరూ కార్లో కూర్చున్నారు. కారు కదలబోయే సమయానికి ఓ యువకుడువచ్చి 'నమస్కారమండీ', అన్నాడు.

"ఓ నువ్వటోయ్, మూర్తీ, ఏం ఇలావచ్చావు? రా, కూర్చో, ఇంటికేనా?" అని రంగనాథరావు అతన్ని నవ్వుతూ పలకరించాడు. అతను కార్లో కూర్చోగానే కారు బయల్దేరింది.

"ఏమిటోయ్, విశేషాలు మూర్తీ?"

"ఆఫీసర్ గారు రేపు మధ్యాహ్నం వస్తామన్నారండీ", అన్నాడు మూర్తి.

"ఆఫీసర్‌గా రెవరు?" అని కనుబొమ్మలు చిట్లించి అడిగాడు రంగనాథరావు.

"డి. ఎస్. పి. గారండీ."

"ఓహో నీ కెలా తెలిసింది ?"

"నేను వారి కాంప్ క్లర్కుని గదండి !"

"కాంప్‌క్లర్కు ! ఎప్పట్నించీ ?"

"సుమారు ఓ నెల రోజుల్నుంచీ."

"బి. ఏ. ఆనర్సు., ఇంకా సంవత్సరం చదవాలికదూ నువ్వు ?"

"అవునుకాని మానేశానండీ."

"మానేశావా ? ఎందుకూ ?"

మూర్తి ఓ నిట్టూర్పు విడిచాడు.

"మా కుటుంబ వ్యవహారాలు మీకు తెలియనివిగావు గదండీ. అసలే బీద సంసారం. అందులో పెద్ద సంసారం. అందరికీ నేనే దిక్కు. అదొకటి తక్కువైనట్టు ఈస్థితిలోనే నేను మా మేనమామ కూతుర్ని పెళ్ళి చేసుకోవలసి రావడం—ఇన్ని బాధ్యతలు నెత్తిమీద పెట్టుకొని సంసారాన్ని ఈదుకురావాలంటే చదువుకికూడ యింక డబ్బెక్కడనించి వొస్తుంది ?"

"అదేమిటి, ఎక్కడా ప్రయత్నం చెయ్యలేదా ?" అన్నాడు రంగనాథరావు.

"చెయ్యకేం. అన్ని ప్రయత్నాలూ అయాయి. అవి విఫలమయ్యాయి."

"మరి ఇంతవరకు ఖర్చు పెట్టిందంతా వ్యర్థంకదూ ?"

"అదంతా జ్ఞాపకంచెయ్యకండి. తలుచుకున్నప్పుడల్లా గుండెల్లో బాధగా వుంటుంది."

"ఈ సంవత్సరం పూర్తిచెయ్యకపోతే, ఇహ తర్వాత వీల్లేదు కదూ ? శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరే!"

"అది నా దురదృష్టం. గుమాస్తాగిరీ రాసిపెట్టి ఉంటే పై చదువు లెలా అబ్బుతాయి."

"అడగవలసిన వాళ్ళందర్నీ అడిగావా ?"

"ఒక్కసారికాదు."

"నన్ను అడిగినట్టు జ్ఞాపకంలేదే."

మూర్తి చకితుడై రంగనాథరావువైపు చూశాడు. "మిమ్మల్నా ? మిమ్మల్ని...అడుగుదామనే అనుకన్నాను కాని...సాహసించలేదు."

"ఎందుకూ ?" యథాలాపంగా అడిగినట్టు అడిగాడు రంగనాథరావు.

మూర్తి జవాబివ్వలేదు.

"ఇవ్వననుకొని ఉంటావు—ఏం ?"

ఏం సమాధానం చెప్పాలో మూర్తికి తెలియలేదు. "పోనీ, ఇస్తే తీసుకుంటావా ?"

"ఎంతమాట !" అన్నాడు మూర్తి ఉక్కిరి బిక్కిరై. "ఓ వెయ్యి రూపాయలు సరిపోతుందనుకొంటాను. నీ యిష్టంవచ్చినప్పుడు తీర్చుకోవచ్చులే." ఈ ఔదార్యం మూర్తిని సంతోషాశ్చర్యసాగరాలలో ముంచివేసింది.

కలలోకూడ అలా జరుగుతుందని తను అనుకోలేదు. రంగనాథరావుగారు తనకి వెయ్యిరూపాయలు అప్పివ్వటం సంభవమౌతోంది. తను మొదటే ఆయన దగ్గరికి ఎందుకు వెళ్ళలేకపోయాడు! కృతజ్ఞతాపూర్వకంగా అన్నాడు :

"మీ మేలు జన్మలో మర్చిపోలేను. పోయిందనుకున్న ఆనర్సడిగ్రీ మీరు ప్రదానం చేస్తున్నారు. రెండేళ్లు భుక్తికోసం మీ పిల్లలకి చదువు చెప్పినంతమాత్రాన మీరు చూపించే ప్రేమవాత్సల్యాలు నాజీవితంలో ఎప్పుడూ మర్చిపోలేను..."

అతని వాక్ప్రవాహానికి మధ్యలోనే అడ్డొచ్చి "పరవాలేదులేవోయ్, దీనికింత బ్రహ్మాండంగా బ్రహ్మరథం పడతావేమిటి, ఇహచాల్లే", అంటూ సీటుకి జేరగిలబడ్డాడు రంగనాథరావు. శేఖరానికిమాత్రం ఇదంతా కలలా కనిపించింది. ఒక్క పదిరూపాయలు చందాఇవ్వటానికి వెనకాడి వెయ్యిరూపాయలు సునాయాసంగా ఇంచుమించు ఊరికే ఎవరికో ఇచ్చివెయ్యటం అతనికి అర్థంకాలేదు.

అత నా ఆలోచనలో ఉండగానే మూర్తి దిగిపోయి సెలవుపుచ్చుకోటం జరిగింది.

"ఏమోయ్, మనసు మార్చుకున్నావా ?" అన్నాడు రంగనాథరావు.

"క్షమించండి", అన్నాడు శేఖరం.

"డ్రైవర్, పోలీసుస్టేషన్‌కి పోనియ్యి", అని ఆజ్ఞాపించి ఆవులించాడు పోలీస్‌ఆఫీసర్. కొద్దిక్షణాలాగి, "రాయన

భాస్కరుడి తరువాత మీ రేలా ఉండే", అని వ్యంగ్యంగా అన్నాడు శేఖరం.

రంగనాథరావు ఇంకోసారి ఆవులించి, జేబులోంచి సిగరెట్ కేస్ తీసి తెరిచి అందులో సిగరెట్లు కనిపించక పోయే సరికి కోపంగా తపీమని మూసేసి "ఎన్ని చెప్పినా ఇంతే," అని గొణుక్కుని శేఖరంవైపు తిరిగి "సిగరెట్ ఉందోయ్?" అని అడిగాడు. వెంటనే శేఖరం సిగరెట్ పాకెట్ తీసి ఇచ్చాడు. "థాంక్స్", అని సిగరెట్ తీసుకుని ముట్టించి పొగ గుప్పున వొదిలి శేఖరంతో "నువ్వుకూడా కానీ", అన్నాడు రంగనాథరావు. శేఖరం కొంచెం సిగ్గుగా "తమలాంటి పెద్దల దగ్గర ఆపని చెయ్యనులెండి", అనటంతో రంగనాథరావు కొంచెం విస్మయంగా అతనివైపు చూశాడు.

"మా డ్రైవర్‌కి ఎన్నిసార్లు చెప్పినా బుద్ధిలేదు. తార తమ్యాలు పాటించక్కర్లేదూ, ఏమంటావ్?" అని చనువుగా అంటూ శేఖరం భుజంమీద చెయ్యేశాడు.

"అవునవును", అన్నాడు శేఖరం.

"ఉద్యోగం ఎన్నిసార్లు పీకేశానో! మళ్ళీ ఉద్యోగం దొరక్క బాధపడతాడని జాలిపుట్టి వేసుకుంటూనే ఉన్నా ననుకో. నాకు చప్పున కోపంవస్తుంది. కాని త్వరలోనే తగ్గు తుంది. ఆలోపం నాదేనంటావా? లేక నాకు కోపంతెప్పించే వాళ్ళదంటావా?"

"ఊఁ", అన్నాడు శేఖరం జవాబు అనవసరం అన్నట్టు.

"నేను బయటికి వెళ్ళేటప్పుడు నాసిగరెట్ కేస్ నిండా సిగరెట్లు పెట్టమని మా ఆవిడకి ఎన్నిసార్లు చెప్పానో! ఎప్పుడూ ఖాళీ. ఇప్పుడు నువ్వే చూశావుగా. ఇదీ వరస. నాకు చర్రున మండుకొస్తుంది. వెంటనే ఏదో అనేస్తాను. నాకు ఓర్పు లేదంటావు. నేనంటే లక్ష్యం ఉండి, గౌరవం ఉంటే అటువంటి పొరపాట్లు ఆమె చెయ్యకుండానే ఉంటుంది. నేను కోప్పడకుండానే వుంటాను. నేననేవాడిని వున్నానని నేను జ్ఞాపకం చేసుకోటం తప్పంటావా ?"

స్నేహితుడితో చెప్పుకుంటున్నట్టుగా ఆయన అలా అంటుంటే శేఖరం విస్మితుడౌతూ వింటున్నాడు.

"నేనుమాత్రం కిరాతకుణ్ణా? ఓసారేమైందో తెలుసా? ముఖ్యమైన ఆఫీసుకాగితం మా ఆవిడ పర్రున చింపేసి నెయ్యి కరగపెట్టింది. కాలిన ముక్కలు చూసిన తరువాత తెలుసుకున్నాను. ఆవిడ తెలియక చేసిందనుకో. కాని నేను ఆ సంవత్సరం రివర్టయాను. ఐనా మా ఆవిడని పల్లెత్తుమాట అనలేదనుకో. అసలా సంగతే ఆవిడకి తెలియదు. నాకు ఓర్పు లేదంటావా నువ్వుకూడా? చడామడా తిట్టేసి ఉందును. కాని ఆమె ఎవరు—నా భార్యకదూ!" అంటూ రంగనాథరావు ఆకస్మికంగా ఏవో ఆలోచనల్లో పడిపోయాడు. కారు రంయి మని పరుగెడుతోంది.

"పోలీస్ స్టేషన్ సార్", అని కేకేశాడు డ్రైవరు.

రంగనాథరావు ఉలిక్కిపడి శేఖరంవైపు జాలిగా చూచి "ఏమోయ్", అని కొంచెం ప్రాథేయపూర్వకంగా అన్నాడు.

"నేను మనసు మార్చుకున్నానండీ" అన్నాడు శేఖరం చిరునవ్వుతో.

"గుడ్, వెరీగుడ్", అంటూ ఉత్సాహంగా రంగనాథరావు అతని భుజంతట్టి జేబులోంచి ఉత్తరంతీసి ప్రశ్నించేశాడు. "చెపితే నీకు సహాయంచేస్తాను. ఆ అమ్మాయి తండ్రి ఎవరు?" "పోలీస్ఆఫీసర్ రంగనాథరావుగారు", ఆయన కళ్ళలోకి సూటిగా చూస్తూ చెప్పాడు శేఖరం.

ఉలిక్కిపడి శేఖరంవైపు అయోమయంగా చూశాడు రంగనాథరావు. కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి.

"ఇందుకా, నేను రైల్వేస్టేషన్‌కి వెడుతున్నానంటే సరోజ అలా తెల్లబోయింది."

రంగనాథరావు ముఖం కందగడ్డలా ఎరుపెక్కింది. కాని ఆయనతో ఆమాత్రం పరిచయం కలిగిన తరవాత పరిస్థితి ఎలా అదుపులోకి తెచ్చుకోవాలో తెలియనంత తెలివితక్కువవాడు కాదు శేఖరం.



# ఆలోచన - అనుభూతి

హాలంతా జనంతో క్రిక్కిరిసింది. కొత్త తెలుగు చిత్రం మొదటి రాత్రి మొదటి ఆట ఆడుతోంది. కథ చకచక సాగిపోతోంది. సన్ని వేశాల్లో ప్రతిబింబించే వాస్తవికత కథా సంవిధానంలో ఆసక్తిని కలిగిస్తూండటంవల్ల ప్రేక్షకులు కథాగమనంలో లీనమౌతున్నారు.

యువతీ యువకులు _ నాయికా నాయకులు _ అన్యోన్యం ప్రేమించి పెళ్ళిచేసుకున్నారు. గృహప్రవేశం జరిగింది. రాత్రి. నాట్యరాణి నాట్యప్రదర్శనం. కలవాళ్లు మరి. అందులో, నాయకుడు స్థానిక ప్రముఖుడు. ఔచిత్య భంగం లేదు. నాట్యరాణిని దంపతులకి పరిచయం చేస్తున్నారు.

"ప్రసిద్ధ నర్తకి......" వగైరా, వగైరా.

"పెళ్ళికుమారుడు_పురప్రముఖుడు", వగైరా, వగైరా.

నాయకుడు చిన్నగా నవ్వాడు సవినయంగా.

రాణి—నాట్యరాణి—ఓరగా చూసింది. నవ్వింది. అందులో కొంటెతనం ఉంది.

ఆ నవ్వు !

స్త్రీలకై ప్రత్యేకించిన స్థానంలో ఫస్టుక్లాస్ సోఫాలో కూచున్న మనోరమ గుండె గతుక్కుమంది. ఆ నవ్వు ఆమెకి నచ్చలేదు. కొత్తగా పెళ్ళయిన యువతీ యువకులు. వాళ్ళ ముందర రాణి అలా నవ్వటం—అన్యాయం.

మనోరమ ముఖం చిట్లించుకుంది.

పరిచయం అయింతరవాత నేపథ్యంలోకి వెళ్ళబోతూ రాణి మరోసారి వాలుగా నాయకుడివైపు చూసింది. అతనూ అదే సమయంలో చూశాడు. ఆమె చిన్నగా నవ్వింది. అత నామెవైపు అలాగే చూస్తున్నాడు.

నాయకు డలా చూడటం ఫస్టుక్లాసులో పురుషుల ప్రత్యేక స్థానంలో కూచున్న రంగారావుకి నచ్చలేదు.

పెళ్ళయి రెండు రోజులు కాలేదు.

అతనలా ఆమెవైపు చూస్తాడేం !

నాయిక నాయకుడిని నెమ్మదిగా తట్టింది. అతడు ఉలిక్కిపడి ఆమెవైపు చూసి చిన్నగా నవ్వి ఆమెచేతిని తన చేతిలో తీసుకున్నాడు.

రంగారావుకి తృప్తిగా ఉంది.

రంగారావుకి కూడా కొత్తగా పెళ్ళయింది. భార్య అందం చూసి మురిసిపోతాడు.

వెంటనే రంగారావుకి భార్య జ్ఞాపకం వొచ్చింది. ఆమె మరెక్కడో లేదు. అదే హాల్లో స్త్రీల మొదటి తరగతిలో సుఖాసీనురాలై ఉంది. ఓసారి అటువైపు చూశాడు, ఆమె కనిపించటానికి వీల్లేదని తెలిసినా.

నాట్యం అద్భుతంగా ఉంది. అంటే రంగారావుకని గానీ, ప్రేక్షకులకనిగానీ అర్థం కాదు. నాయకుడు ఊరికే తల తిప్పుతున్నాడు. రాణీ అతని వైపు మందహాసంతో చూస్తూ అభినయిస్తోంది.

అలా నాయకుడు తలతిప్పటం రంగారావు కేమాత్రం నచ్చలేదు. తన కంతగా నాట్యం విషయం తెలియకపోవటం వల్లగాని, ఎక్కువగా తెలియటం వల్లగాని రంగారావు కలా అనిపించిం దనుకోటం సరికాదు. నాయకు డలా తలతిప్పక పోతే ఆ వేషధారిస్థానే మరో వేషధారి బుక్ కాక తప్పదని తెలియనంత అమాయకుడుకాడు రంగారావు. అయినా నాయకు డలా తిప్పడం అతని కిష్టంలేదు.

రాణి అలా నాయకుడివైపు చిలిపిగా చూడటం మనోరమకి గుర్రుగా ఉంది.

నాట్యం ఐపోయింది. నాయకుడు తెగచప్పట్లు కొట్టే శాడు—అందరితోపాటు. నాయిక మర్యాదకోసం అర చేతులు రెండూ రెండుమూడుసార్లు కలిపింది.

గ్రీన్‌రూమ్‌లో నాయకుడు రాణిని అభినందిస్తు న్నాడు—కాదు—పొగిడేస్తున్నాడు.

అది రంగారావు కిష్టంలేదని వేరే చెప్పక్కర్లేదు. రాణి వయ్యారంగా, విలాసంగా అజంతా భంగిమలతో ఆకర్షిస్తోంది.

ఆ అంగవిన్యాసం మనోరమకి కంటకంగా ఉంది.

నాయకుడిచూపులు రంగారావుకి అసహ్యంగా ఉన్నాయి.

రాణి నాట్యం ఏమంత గొప్పతరగతికి చెదిందికాదు. ఆ విషయం నాయకుడికి తెలుసు. అయినా ఆమెని పొగిడేస్తున్నాడు. కాని పొరపాటున ఓ చిన్నమాట తూలాడు. రాణి వెంటనే చిర్రు బుస్సుమంది. ముఖం ముకుళించుకుంది.

మనోరమ ముఖం విప్పారింది.

రంగారావు సంతోషించాడు.

నాయకుడు పొరపాటుకి పశ్చాత్తాపపడ్డట్టుగా ముఖం పెట్టాడు.

"మీరు సహృదయతతో స్వీకరిస్తారనుకున్నాను", అన్నాడు.

రాణి వేషం విప్పుకుంటూ—

ఆమె నిర్లక్ష్యధోరణికి మనోరమకు ఏహ్యభావం కలిగింది.

"అదేమిటి? అత డలాగే నుంచుంటాడేం?" అని ముఖం చిట్లించుకున్నాడు రంగారావు.

రాణి వేషం విప్పుకుంటూ నిర్లక్ష్యంగా నాయకుడి దగ్గరగా వచ్చి విచారకరంగా ముఖం పెట్టి, "మీది రసహృదయం అనుకున్నాను. కాని..." అని ఆగింది.

"క్షమించాలి", అన్నాడు నాయకుడు.

"మగవాళ్ళంతా ఇంతే", అంది రాణి.

విస్తుపోయాడు రంగారావు.

మనోరమ ఆశ్చర్యపోలేదు. ఆమెకి కొంచెం జాలి కలిగింది.

"సున్నితహృదయాలని గాయపరచటానికి ఏమీ సంకోచించరు."

"హుఁ", అనుకున్నాడు రంగారావు.

"క్షమించాలి", అన్నాడు నాయకుడు మళ్ళీ.

"మీరు తప్పుచేశారని ఒప్పుకుంటున్నారా?"

"నిస్సంకోచంగా," అన్నాడు నాయకుడు, తనేమీ తప్పు చెయ్యలేదని లోపల అనుకున్నా.

"తప్పుచేసినవాళ్లు శిక్షకి లోబడటం సభ్యత," నాయకుడు నవ్వాడు. "ఏమిటా శిక్ష?"

"రేపు మా ఇంటికి టీకి రావాలి", నవ్వింది. నాయకుడూ నవ్వాడు.

ఆ నవ్వులు మనోరమ కేమీ నచ్చలేదు.

రంగారావు కంతకంటే బావుండలేదు.

నాయిక కాఫీట్రే తెస్తోంది.

నాయకుడు పేపరు చూస్తున్నాడు.

కాఫీ రెడీ.

నాయకుడు కప్పు అందుకోలేదు. తల నెమ్మదిగా తిప్పి నాయికవైపు చూసి ఏదో సంజ్ఞ చేశాడు.

నాయిక చిరునవ్వు నవ్వింది. కాఫీ కప్పు నాయకుడి నోటి కందిస్తుంటే చెయ్యి పట్టుకున్నాడు.

"ఇష్ !"

కాఫీ కొంచెం రుచిచూసి—

నాయికవైపు కొంటెగాచూసి—

కాఫీ కప్పు ఆమె నోటిదాకా...

రంగారావుకి ఆనందంగా ఉంది.

దగ్గు—చిన్నది.

ద్వారంవైపుకి కళ్లు పరిగెత్తాయి.

"డాన్‌డాన్", అన్నట్టుగా ప్రేక్షకులు ఈలవేశారు.

ప్రవేశం రాణి!

మనోరమ హృదయం గతుక్కుమంది.

నాయిక కాఫీ రుచి చూడలేదు.

నాయకుడి చెయ్యి ఆగిపోయింది.

రంగారావుకి విచారం వేసింది.

టీ కప్పులో తుఫాను. "రావొచ్చునా?" అంది రాణి, కొత్తగా పెళ్ళయిన యువతీ యువకుల్నీ, కప్పుల్నీ చూస్తూ.

"రండి", అన్నాడు నాయకుడు.

"మీ ఆనందానికి అడ్డొచ్చినట్టున్నాను."

"పరవాలేదు లెండి." అన్నాడు నాయకుడు కంగారుగా. దేనికి పరవా ? ఒళ్లు మండింది రంగారావుకి. అదేం మాట !

రాణి వొచ్చినకారణం నాయకుడిని మళ్ళీ ఇంకోసారి టీకి ఆహ్వానించటానికి—జ్ఞాపకం చెయ్యటానికి. ఆమె శ్రమకి నాయకుడు నొచ్చుకున్నాడు.

"ఒకసారి పిలిస్తే మీలాంటివాళ్లు మాఇళ్ళకొస్తారా?" అంది రాణి.

మనోరమ నిట్టూర్పు విడిచింది.

"అహాఁహాఁ...ఎంతమాట ! ఎందుకు రాను?" నాయకుడు సవినయంగా అన్నాడు.

"క్షమించాలి. తీరికలేదు," అని నాయకుడు ఎందుకనడు అని రంగారావుకి కోపం వొచ్చింది.

నాయకుడికీ, రాణికీ జోస్తీ ఎక్కువౌతోంది.

రంగారావు దాన్ని ఏమాత్రమూ ఆమోదించలేదు. ఈ విషయంలో రంగారావు ఏకాకి కాడు. తన చుట్టూఉన్న జనం చిన్నగా చేస్తూన్న వ్యాఖ్యానాలు—రాణీ ప్రవేశించినపుడల్లా చిత్ర విచిత్రమైన ధ్వనులూ రంగారావు వింటూనే ఉన్నాడు.

నాయకుడిమీద చాలామందికి కోపం వొస్తోంది.

మంచివాడల్లేనే కనిపిస్తాడే—

నువ్వు నా దగ్గిరికి రావొద్దని గట్టిగా చెప్పెయ్యడేం!

చెప్పేస్తే బాగుండును.

అలా చెప్పేస్తే కథ జరగటం కష్టమని రంగారావుకి తెలియకపోలేదు. కాని ఆ విషయం గురించి అత నేమీ ఆలోచించటంలేదు. ఆలోచించాలని తోచలేదు అతనికి.

టీ కోసం రాణి ఇంటికి నాయిక వెళ్ళదు. అది ఆమె కిష్టంలేదు. నాయకుడు వెడతాడు. అదీ ఆమె కిష్టంలేదు. కాని ఆమెకి భర్తమీద ఇష్టం. అందుకని అయిష్టం కనబడ నీయదు.

రాణీతో కబుర్లు—నాయకుడు రాణి ఇంటిదగ్గర. అతడు గడియారం చూసుకుంటున్నాడు మాటిమాటికీ. అది రాణీకి కోపకారణం.

రంగారావుకి సంతోష కారణం.

"ఆగిపోయిందా?" విసుగ్గా అడిగింది రాణీ.

"ఎబ్బే, లేదు."

"మరి అన్నిసార్లు చూస్తారేం ?"

"టైమెంతయిందో నని..."

ఏవో కబుర్లు.

మళ్ళీ గడియారం మీదికి నాయకుడి కళ్ళు.

"గడియారం తప్పితే ఇక్కడ చూసి ఆనందించ తగిన విం కేమీ లేవా ?"

చటుక్కున తల పైకెత్తాడు నాయకుడు. ముఖంలో కొంత వింత కనిపించింది. ఆమె ముఖంలోకి చూశాడు. అదే కావాలిసింది—రాణికి.

"క్షమించాలి."

రాణీ నవ్వింది.

"అన్నిసార్లు క్షమించమని అడక్కూడదు."

నాయకుడి కేమనాలో తెలీలేదు. గడియారంవైపు చూడటం— పరాయింట్లో పరాయివాళ్ళ ఎదట ఎక్కువ సార్లు—మంచిది కాదేమోనని అతని కనిపించి ఉండవచ్చు; గడియారంవైపు మాత్రం చూడటంలేదు. బహుశా నిమిషాలు లెక్కపెట్టుకుంటున్నాడేమో. పరాగ్గా ఉన్నాడు. రాణి ఏదో అడిగితే జవాబివ్వలేదు. ఆమె దగ్గరగా వొచ్చింది. ఆ అలికిడికి మేల్కొని గాభరాపడ్డాడు. తన చెయ్యిమీద అకస్మాత్తుగా రాణీ చెయ్యి—

నాయకుడు తికమకపడ్డాడు.

మనోరమ నిరాశపడది...ఈలలూ, కేకలూ !

నాయకుడు "షాక్", తిన్నట్టు లేచి నుంచోడేం? రంగారావు మనసులో అదే ఆలోచన.

నాయకుడి షర్టు చెయ్యి తొలగించి చూసి "ఆరుకి ఆరు సెకండ్లు తక్కువ", అంది. అతని కర్థం కాలేదు. తెల్లబోయి చూశాడు.

"మీరు నిమిషాలు లెక్కపెట్టుకుంటున్నట్టుగా ఉంటే, టైం చెప్పాను."

తన పొరపాటు అర్థమైంది నాయకుడికి. తను పరాగ్గా ఉన్నట్టు కనిపెట్టింది. కనుబొమలు ఎగరేశాడు.

"క్షమించాలి", అన్నాడు తన కర్థమైనట్టు చెప్ప డానికి. రాణీ నవ్వింది. "ఎన్నిసార్లు?"

నాయకుడికీ నవ్వొచ్చింది.

నాయకుడికి అకస్మాత్‌గా ఆమె స్పర్శ జ్ఞాపకం వొచ్చినట్టుంది. చెయ్యివైపు చూసుకున్నాడు.

రాణీ ఓరగా చూసింది.

ఆ చూపు!

ఆ వయ్యారం!

మనోరమకి అసహ్యం కలిగింది.

అలాగే రాణి చూస్తోంది—నాయకుడి కళ్ళూ తనవీ కలిసేదాకా, నాయకుడు తికమకపడ్డాడు. టైం ఐపోతోంది.

ఇంటిదగ్గర నాయిక చూస్తోంది గడియారం. టైం ఐపోతోంది. నాయకుడు గడియారం చూడకూడదు. పట్టు చెయ్యి గడియారం కప్పేసింది. బీచ్‌కి పోయే టైం దాటి పోతోంది. నాయిక మేడమీదనించి చూస్తోంది...

అకస్మాత్‌గా జ్ఞాపకం వొచ్చింది నాయకుడికి — బీచ్ ప్రోగ్రాం. భార్య కళ్ళలో మెదిలింది — ఎదురు చూపులతో —

రంగారావు సంతోషించాడు.

నాయకుడు మొహమాటస్థుడు. వెళ్ళాలి. ఎలా? సందేహిస్తున్నాడు.

ఏమిటలా ఇదవుతాడేం? ఠకీమని లేచి వెళ్ళిపోలేడూ? రంగారావుకి కోపంగా ఉంది.

నాయిక ముఖం ముకుళించింది.

రంగారావుకి కూడా—

కాలెండర్ మీద తారీకులు మారిపోతున్నాయి.

అల్లుడికీ, కూతురుకీ పండగ ఆహ్వానం.

నాయకుడికి పనితొందర. తీరిక లేదు

నాయిక ఒంటరిగానే వెళ్ళింది.

ఆ విషయం రాణీకి తెలిసింది.

ఆహ్వానం...పండక్కి. టీ మాత్రమే కాదు. డిన్నర్.

నాయకుడికి అంత ఇష్టంగా లేదు.

మొహమాటస్థుడు.

ఆ విషయం రాణీకి తెలుసు—మొదటినించీకూడా.

ఆ దౌర్బల్యం—

రంగారావుకి కోపకారణం.

ఆ దౌర్బల్యవినియోగం రాణీకి తెలుసు. ఉపయోగించింది.

అన్యాయం అనుకుంది మనోరమ.

ఆ రాత్రి...

మనోహరమైన వెన్నెల.

మేడమీద ఖాళీ డాబాలో ఈజీఛైర్‌లో నాయకుడు.

రాణీతో కబుర్లు.

డిన్నర్ గురించి పొగిడేస్తున్నాడు.

తాంబూలం ఇచ్చింది రాణి.

సిగరెట్ స్వయంగా వెలిగించటానికి సిద్ధపడ్డది.

మొహమాట పడ్డాడు—తికమకపడ్డాడు—నాయకుడు.

"అతిథులకి ఆమాత్రం సేవచేస్తే తప్పేంలేదు", అంది రాణి.

ఈజీఛైర్‌లో పడుకున్న నాయకుడు ముందుకి వంగాడు మర్యాదగా. రాణీకూడా వంగింది.

"అబ్బా", అంది రాణి.

రెండు తలలూ ఢీకొన్నాయి. ఈలలూ, చప్పట్లూ.

"క్షమించాలి."

నవ్విందామె.

అతనూ నవ్వాడు. "దెబ్బ తగిలిందా ?"

"ఊఁహుఁ."

మనోరమకి వొళ్ళు మండింది.

ఎందుకు తగుల్తుంది.

అన్యాయం.

రాణిమీద మనోరమకి అసహ్యం ఎక్కువైంది. రాణి సిగరెట్ వెలిగిస్తోంది నాయకుడికి.

నాయకుడామెవైపు తేరిపార చూస్తున్నాడు.

నిప్పుపుల్లలు ఆరిపోతున్నాయి.

అవి అలా ఆరిపోతూనే ఉంటాయని మనోరమకి తెలుసు. చాలామందికి తెలియకపోవచ్చు.

నాయకుడు రాణీవైపు చూస్తూనే ఉన్నాడు.

వెన్నెల పడి తెల్లచీర మెరుస్తోంది.

వెన్నెల పడి ముఖపద్మం ఆకర్షణీయంగా ఉంది.

ఆమె అందాలన్నీ చూస్తున్నాడు నాయకుడు.

ఆ నల్లటి శిరోజాలూ, ఆ నున్నటి బుగ్గలూ...

సిగరెట్టు వెలిగింది.

రాణీ తల పైకెత్తింది.

పట్టుబడ్డాడు నాయకుడు.

"ఏమిటలా చూస్తున్నారు?" చిరునవ్వుతో అడిగింది. తొట్రుపడ్డాడు.

"చెప్పండి, పరవాలేదు."

తల తమాషాగా తిప్పుతూ అంది. ఆ తిప్పటంలో తలలో గులాబీ పువ్వు కింద పడ్డది. పువ్వువైపు చూసింది రాణి. తీసుకోలేదు. నాయకుడుకూడా చూశాడు. తీశాడు. చెయ్యి చాపలేదు రాణీ. ఈజీఛైర్‌లోంచి లేచాడు. ఓరగా చూసి వెనక్కి తిరిగింది రాణి. తలలో పెట్టాడు.

ఉన్నట్టుండి గిర్రున తిరుగుతూ నృత్యం ప్రారంభించింది రాణి. తన్మయుడై చూస్తున్నాడు నాయకుడు ఆ భంగిమలు...!

మనోరమ ముఖం చిట్లించుకుంది.

రంగారావు పూర్తిగా ఆశలు వదులుకున్నాడు.

అలిసిపోయి గిర్రున తిరుగుతూ సోఫాలో పడిపోయింది రాణి. నాయకుడు సమీపిస్తున్నాడు.

"ఏదైనా, అకస్మాత్‌గా జరగకూడదూ?" అనుకున్నాడు రంగారావు, జరగదని తెలిసి.

"టెలిగ్రాం రాకూడదూ?" అనుకుంది మనోరమ. నాయకుడు దగ్గరికి వొచ్చేస్తున్నాడు.

అకస్మాత్‌గా ఏ తీవ్రమైన తలనొప్పో—

మరేదో, ఇంకేదో, ఏదో వొస్తే...

ఏదీ ఎవరికీ రాలేదు.

దగ్గరగా వొచ్చి నుంచున్నాడు నాయకుడు.

రాణి అతనివైపు తమాషాగా చూసింది.

సంకోచిస్తున్నాడు నాయకుడు.

తలలో గులాబిపువ్వు తీసింది రాణి.

నాయకుడు తొట్రుపాటు పడ్డాడు.

రంగారావు ఆశపడ్డాడు.

గులాబీపువ్వు మంచంమీదికి విసిరింది రాణి.

రంగారావు విషాదంగా ముఖం పెట్టాడు.

మనోరమ తల పక్కకి తిప్పుకుంది. ఆమెకి బాధగా ఉంది. ఆమెకి మొదటినించీ రాణినిచూస్తే అలాగే ఉంది. కోపం, చిరాకు, అసహ్యం. కోపం వొచ్చినప్పుడల్లా, చిరాకు పడ్డప్పుడల్లా, అసహ్యం వేసినప్పుడల్లా హృదయంలో ఏదో ఆవేదన...ఏదో బాధ. ఏదో జరగాలని కోరిక. కాని మనసులో—నేపథ్యంలో సన్నని స్వరంలా—అప్పుడప్పుడు ఏదో అకస్మాత్‌గా జ్ఞాపకం వొస్తుంది. అయితే ఆ జ్ఞాపకాలు

పైకిరావు. ఆమెకి తీరిక లేదు—రాణిని చూస్తున్నంతసేపూ. హృదయంలో ఏదో లోటు. అందుకే మనసు ఆలోచించదు. అనుకోకుండా గట్టిగా నిట్టూర్పు విడిచింది మనోరమ. అకస్మాత్ గా మళ్ళీ గతించిన దృశ్యాల జ్ఞాపకం. కాని ఆమె అలిసిపోయింది. ఆలోచించేస్థితిలో లేదు.

రాణినిచూస్తే ఆమెకి ఏవగింపు.

ఆమె జయించటం మనోరమ కిష్టంగా లేదు.

ఆమె ఓటమి—నాయకుడామెని తిరస్కరిస్తే...

అదే మనోరమ లోలోపలి కోరిక.

రాణీ ఓ కల్పితపాత్ర. ఆవిషయం మనోరమ, హృదయంలో ఏదో బాధగా కదిలినప్పుడల్లా జ్ఞాపకం చేసుకుంటూనే ఉంది. అయినా—

రాణీ ఒక వేశ్య.

మనోరమకూడా.

మనోరమ ఇంత స్పష్టంగా ఆలోచించలేదు. అయినా ఆ విషయం ఆమెకి మనసులో మారుమూల అడుగడుగునా అడ్డు తగులుతూనే ఉంది.

తెరమీదరాణీ—

మనోరమకళ్లు చూస్తున్నాయి.

మనసుకి పనిలేదు. హృదయంలో అనుభూతులు. మనోరమ వేశ్య. చిన్నప్పుడు నాట్యం నేర్చింది. ఇంతవరకూ నర్తకిగా అంత పేరేమీ లేదు. రంగస్థలంమీదచేసిన కొద్ది నాట్యప్రదర్శనలూ ఎక్స్ట్రా హోదాలోనే—ఎవరిట్రూపు

లోనో. ఓ శ్రీమంతుడి వివాహ సందర్భంలో నాట్య ప్రదర్శన ఏర్పాటయింది. తమదే ట్రూపు. పరిచయంచేశారు ట్రూపులో అందర్నీ. ఫలానా... ఫలానా—"మనోరమ" ఆ శ్రీమంతుడు ఓ చూపు గిరవాటేసి తల పక్కకి తిప్పాడు. ఆమెకి కష్టంవేసింది. ప్రదర్శనలో అందరికంటే ఎక్కువగా ఆకర్షించాలని చూసింది. ఎవరూ తనవైపే చూస్తున్నట్టు లేదు. తనకి సామర్థ్యంలేక కాదు. డబ్బులేక సొంత ట్రూపు ఏర్పాటు చేసుకోలేకపోయింది. ఆమెకి ఉక్రోషం వొచ్చింది. ఎలాగైనా పైకిరావాలి. సాధించాలి. ఈ శ్రీమంతుడికి నాటకాలూ ఇత్యాదులంటే అభిమానం అని వినికిడి. వొంటరిగా కలుసుకుని సహాయం అడిగింది. అంత మొత్తం సహాయంకాని—పెట్టుబడికాని—ఇవ్వటం అతని కిష్టంలేదు. అదే నసిగాడు. తళుకుబెళుకులతో ఆకర్షించటానికి ప్రయత్నించింది. కాని కొత్తగా పెళ్ళయిన మోజులో ఉండటంవల్లనేమో తన వలలో పడలేదు. తనకే పేసుంటే—

ఈ విషయమంతా మనోరమ మర్చిపోయిందనికాదు. రాణిని చూస్తున్నంతసేపూ తను మనోరమకాక మరో స్త్రీ అనీ ఆమె అనుకోలేదు. అసలామె ఆలోచించే దేమిలేదు. ఆలోచించే స్థితిలోలేదు. అన్నీ ఏవేవిటో అనుభూతులు.

మనోరమ రాణిని అసహ్యించుకుంటూ ఉంది.

రంగారావు నాయకుడిమీద ఆశలు వొదులూ కున్నాడు.

కథ సాగిపోతోంది. సంఘటనలు జరిగిపోతున్నాయి. నాయిక అశాంతితో కుంగిపోతోంది. ఘర్షణ జరగక తప్ప

లేదు. నాయకుడు ఏదో అన్నాడు. నాయికకి అభిమానం ముంచుకొచ్చింది. పుట్టింటికి వెళ్ళిపోయింది. నాయకుడు పట్టించుకోలేదు. నెలలు గడిచిపోయాయి. అభిమానం విడిచి నాయిక సొంత ఇంటికి బయల్దేరింది. ఇల్లు తాళం వేసి ఉంది. చుట్టుప్రక్కలవాళ్లు — రాణీతో ఊళ్లు తిరుగుతున్నాడనీ, ప్రస్తుతం వాళ్ళిద్దరూ ఫలానా ఊళ్లో ఉందని—అన్నారు. తను ఎప్పుడూ వెళ్ళి ఎరగని ఊరు. అయినా పట్టుదలతో వెళ్ళింది. స్టేషన్ దాటగానే ఎలా వెళ్ళాలో, వాళ్లు ఎక్కడున్నారో అనే అధైర్యం లోపల పీకుతూనే ఉన్నా సైకిల్ రిక్షా ఎక్కితే అతనే తీసుకువెడతాడనే ధైర్యంతో ఓ సైకిల్‌రిక్షావాలాని కేకేసి అడిగింది. అతను నాయికవంక కొంచెం అనుమానంగా చూశాడు—ఆమె ధోరణినిబట్టీ, అదుర్దానిబట్టీ. "నిమిషంలో తీసుకెడతాను ఎక్కండి", అన్నాడు. నాయిక రిక్షా ఎక్కి కూచుంది. జనసమ్మర్దం ఎక్కువగా ఉన్న రోడ్లన్నీ దాటిపోతోంది రిక్షా. రాను రాను ఇళ్లుకూడా కనిపించటం లేదు. దారి తప్పినట్టు నాయికకి అనుమానం వేసింది. అడిగింది. ఓ వెకిలినవ్వు నవ్వి లేదులెండన్నాడు రిక్షావాలా.

ఆ నవ్వు—ఆ ధోరణి—ఆ వేగం!

నేల తరగతిలో కూర్చున్న ఓ రిక్షావాలాకి గుండెల్లో గుచ్చుకుంది. కొత్త తెలుగుచిత్రం చూడాలని—రిక్షా అద్దె మూడున్నర గంటలు దండగైనా, సాహసించి హాలుదగ్గర ఓ కిల్లీకొట్టు యజమానిని చూస్తూండమని—హాలులో కూర్చుని బీడీ కాల్చుకుంటూ వినోదిస్తున్న ఆ ఒకానొక రిక్షావాలా ఏమేమిటో జరగాలనుకున్నాడు.

రిక్షా ఆగింది.

"ఏం ?" అంది నాయిక.

వెకిలిగా నవ్వి దిగమని డబాయించాడు—ఆమె వెలగల నగలవైపు చూస్తూ.

అన్యాయం.

అసలే కష్టాలు. పైపెచ్చు ఇదోటి—

హాల్లో రిక్షావాలా బాధపడ్డాడు.

ఏదైనా జరిగి—

తెర నాలుగువైపులూ చూశాడు.

రిక్షావాలా దౌర్జన్యం చేసేట్టున్నాడు. ఏంచేస్తాడో ! పాపం నమ్మి వచ్చింది.

బీడీ కాల్చటం మానేశాడు రిక్షావాలా.

నేల తరగతి ప్రేక్షకులు—తన చుట్టూ ఉన్నవాళ్లు—తిడుతున్నారు. తనూ తిడుతున్నాడు.

ఎదురుగా టాక్సీ—

ఈలలు, చప్పట్లు—నేల తరగతి ప్రేక్షకుల్నించి. ఉద్రేకం ఆపుకోలేక చిరునవ్వుల రూపంలో వొదిలేస్తున్నారు పై తరగతి ప్రేక్షకులు. ఆనందబాష్పాలు తుడుచుకుంటున్నారు కొంతమంది జేబురుమాళ్ళతో.

టాక్సీ—రిక్షా.

పారిపోయాడు రిక్షావాలా.

బీడీ జ్ఞాపకం వొచ్చింది హాల్లో రిక్షావాలాకి.

టాక్సీలో—నాయకుడూ, రాణి.

నాయకుడూ, నాయికా పరస్పరం చూసుకున్నారు. పలకరించుకోలేదు. కారు తలుపు తీశాడు నాయకుడు. నాయిక లోపల కూర్చుంది...

కథ జరిగిపోతుంది. నాయికా, నాయకుడూ, రాణీ ఒక్క ఇంట్లోనే ఉంటున్నారు. లేక, నాయకుడూ, రాణీ ఉన్న ఇంట్లోనే నాయికకూడా ఉంటోందనటం సమంజసం. ప్రస్తుతం నాయిక హోదా అటువంటిది. ఇదే ఇంట్లో రాణీ తాలూకు వరస సోదరుడు—ట్రూప్ వ్యవహారాల్లో జోక్యం కల్పించుకుంటూ ఉండే వ్యక్తికూడా ఉంటున్నాడు.

నాయిక కష్టాలు పడుతోంది మానసికంగా. ఆమెకి అనేక అన్యాయాలు జరుగుతున్నాయి.

జనం—హాల్లో ప్రేక్షకులు—సానుభూతి చూపిస్తున్నారు. అన్యాయానికి బాధపడుతున్నారు. అన్యాయాన్ని ఖండిస్తున్నారు.

నాయిక కష్టాలుచూసి రాణీ సోదరుడు, ఓ ఉపన్యాసం ఇచ్చేశాడు నాయికకి. ఆమె స్థితిచూస్తే తనకి మనసూ, హృదయమూ ద్రవించి ఏకమయాయన్నాడు. ఇహ కష్టాలు పడక్కర్లేదన్నాడు. భారతనారి తిరుగుబాటు చెయ్యాలన్నాడు. నాయికలాంటి చదువుకున్న యువతి — నవీన విద్యాప్రవీణురాలు — ప్రవర్తించే విధం అది కాదన్నాడు. దుక్కాటుకి చెప్పుదెబ్బ నన్నాడు.

నాయిక వింటోంది.

రెండోతరగతి ప్రేక్షకుడైన రామ్మూర్తికి ఈ ఉప న్యాసం ప్రమాదకరంగా కనిపించింది. ఆమె దౌర్బల్యాల మీద వొత్తిడి తెస్తున్నాడు—దుర్మార్గుడు, విలన్.

రామ్మూర్తికి వొళ్ళుమండుతోంది.

తనామెని ప్రేమించానన్నాడు విలన్. బాగా ఆలోచించుకునే సమాధానం ఇవ్వమన్నాడు. అక్కర్లే దంది నాయిక.

రామ్మూర్తి సంతోషించాడు.

తనని నాయిక అర్థంచేసుకోవాలని ప్రాధేయపడి, అది ఆమెకే మంచిదని సలహాఇచ్చి వెళ్లాడు విలన్.

బెదిరిస్తున్నాడు రాస్కెల్ — అనుకున్నాడు రామ్మూర్తి. అలా అనుకోటం రామ్మూర్తి కొంచెం భయంభయంగా అనుకున్నాడు.

నాయిక జీవితం పాడైపోతుందేమోనని భయం. అలా అనిపించగానే హృదయంలో బెరుకుతోపాటు మనసులో లీలగా తన గత జీవితంలో ఓ సంఘటన మెదిలింది. కాని రామ్మూర్తి ఆలోచించటానికి సాహసించలేదు.

రామ్మూర్తి ఆ ఊరికి కొత్తగా వొచ్చిన బి. ఇడి. అసిస్టెంట్. అంతకి ముందున్న ఊరినించి ఓ చిన్న ఉపద్రవం తప్పించుకోటానికి ఈ ఊరు వొచ్చేశాడు. మరేంలేదు. ఏదో బుద్ధిచాంచల్యంవల్ల ఎదురింటి ప్లీడర్ గుమాస్తాగారి రెండో భార్యతో వ్యవహారం జరపటానికి ప్రయత్నిస్తే ఆయన తన్నించినంత పనిచేశాడు. ఆ హడావిడికి బతుకుజీవుడా అని ఇలా వొచ్చేశాడు.

విలన్ ప్రయత్నాలు మానలేదు.

ఆ సాయంత్రం నాయకుడితో చెప్పింది — విలన్ ఇలా బాధిస్తున్నాడని. "మహా పతివ్రతలా నన్ను పట్టుకొని వేళ్లాడమని ఎవడేడిశాడు. కాపలా కూచోమంటావా?" అన్నాడు. అభిమానం ఘోరంగా దెబ్బతింది నాయికకి.

నాయకుడూ, రాణీ సినిమాకి వెళ్లారు.

నాయిక ఆలోచిస్తూ కూర్చుంది.

నాయిక తిరుగుబాటు చేయాలని వాదిస్తుంటే—

అంతరాత్మ సహనం కావాలంటోంది.

ఆ సమయంలో విలన్ దగ్గరగా వొచ్చాడు. కాళ్ల మీద పడ్డాడు దాదాపు.

రామ్మూర్తి ఊపిరి బిగబట్టాడు.

నాయిక భవిష్యత్తు?

ఆమె దౌర్బల్యం అన్యాయంగా వినియోగించుకుంటున్నాడు విలన్. ఆమె జీవితం!

విలన్ ఆమెని దగ్గరికి తీసుకోబోయాడు— "డౌన్ డౌన్".

బలంగా తోసేసింది నాయిక.

భేష్—రామ్మూర్తి గట్టిగా ఊపిరివొదిలి తీరిగ్గా కూచున్నాడు.

దౌర్జన్యం చేస్తున్నాడు విలన్—

బుద్ధిచెప్పింది నాయిక.

రామ్మూర్తికి సంతోషంగా ఉంది.

కథ చకచక సాగిపోతోంది.

అన్యాయాలు—అధర్మం—నైచ్యాలు—ఘోరాలు. ఎన్నెన్నో జరుగుతున్నాయి.

ప్రేక్షకులు సానుభూతి చూపిస్తున్నారు. అన్యాయం, అధర్మం జరిగినప్పుడల్లా నిరసిస్తున్నారు. ఏదైనా అడ్డు రావాలని కోరుకుంటున్నారు.

న్యాయం, ధర్మం జయించినప్పుడెల్లా— సంతోషం తెలియచేస్తున్నారు.

చప్పట్లూ ఈలలూ,

జేబు రుమాళ్లూ, చిరునవ్వులు.

కోపగిస్తున్నారు.

కళ్లు తుడుచుకుంటున్నారు.

నాయిక కష్టాలు చిత్రం ఆఖరుకి తుదముట్టాయనీ చెప్పనక్కర్లేదు. నాయకుడు పశ్చాత్తాప పడ్డాడని చెప్పాలిసిన అవసరంలేదు.

చిత్రం పూర్తి కావస్తోంది.

రంగారావు లేచాడు. మళ్లీ జనం మూగితే పోవటం కష్టం—అందులో ఆడవాళ్ళతో. కారుడ్రైవర్ నిద్రపోతూ ఉంటాడేమో. గబగబా హాల్లోంచి బయటికొచ్చాడు రంగారావు. దూరాన కారుంది. డ్రైవర్ కూడా అక్కడే ఉన్నాడు. స్త్రీల గేటుదగ్గర నుంచున్నాడు. ఎంతసేపటికీ రారేం? పూర్తిగా చూడటాని కేముంటుందనో. కామెడీ

యేగా. అన్ని చిత్రాల్లోకిమల్లేనే, వొచ్చెయ్యకూడదూ, త్వరగా. ఆడవాళ్లతో వస్తే ఇదే తంటా.

ఒక్కొక్కరే వొస్తున్నారు.

ఆ వొచ్చే దెవరు, తన భార్యేనా? కాదు—ఎవ రీమె? ఎక్కడో చూసినట్టుందే! ఎక్కడబ్బా? ఎప్పుడు?

ఆమెవైపు జ్ఞాపకం తెచ్చుకోటానికి తదేకంగా చూస్తున్నాడు రంగారావు. ఆమె తలెత్తి చూసింది. ఎందుకు అలా చూస్తున్నాడు తనవైపు రంగారావు? రంగారావు! దగ్గరగా వొచ్చింది. రంగారావు పరధ్యానంగా ఆమెవైపు అలా చూస్తూనే ఉన్నాడు.

ఆమె ముందు కొచ్చింది. రంగారావుకి దగ్గరగా నిలబడ్డది.

"ఏమిటలా చూస్తున్నారు? మర్చిపోయారా?"

రంగారావు బిత్తరగా చూసి, పరధ్యానంవించి మేల్కొని తొట్రుపాటు పడసాగాడు.

"నేనండీ, మనోరమని. మర్చిపోయారల్లేవుంది. మాలాంటివాళ్లు మీకు జ్ఞాపకం ఉంటారా ఏమిటి గాని—"

"ఎబ్బెబ్బె...జ్ఞాపకమే." ఇప్పుడు తెలిసింది రంగా రావుకి. ఆమె నర్తకి మనోరమ. తన జ్ఞాపకశక్తి హీనతకి కొంచెం చింతించాడు.

మనోరమ మాటలు కలిపింది.

"ఇలా నిలబడ్డారేం. మీ వాళ్లకోసమా?"

"అవునండీ."

ఎలక్ట్రిక్ లైటు వెలుతురులో క్రేప్‌సిల్కుచీర మెరుస్తోంది. అలాంటి చీర తన భార్యకి కూడా కొనాలని పించింది రంగారావుకి. తన కిలాంటి విషయాలు పట్టవు. కాని ఆ సమయంలో అది చాలా బావుందనిపించి కొనాలని పిస్తోంది. ఆ మాటకొస్తే ఆ వల్వెట్ చోళీ మాత్రం! నిగనిగలాడుతూ — ఎర్రగా — కళ్లు జిగేల్ మన్నాయి రంగారావుకి.

మనోరమకి ఆ సంగతి తెలుసు. వయ్యారాలు వొలకబోస్తూ అందాలు విరజిమ్ముతోంది.

ఇదేమి టివాళ అనుకోకుండా రంగారావు తనవైపు అలా చూస్తున్నాడేం? అతన్ని ఆకర్షించటానికి తను ఎన్ని ప్రయత్నాలు చేసింది! అప్పుడేమీ తొణకని మనిషి—!

మనోరమ నిజంగా అందంగల మనిషే ననిపించింది రంగారావుకి. నిజానికి తన భార్యకంటే కూడా. నర్తనలో కృషిచేసినమనిషి కాబట్టి శరీరం తీగలా ఉంది—నాజూకుగా. ముఖంలో మంచి కళ కనిపిస్తోంది. లావణ్యవతి.

మనోరమ చేతిగడియారం చూసుకుంది. అది గమ నించాడు రంగారావు. అప్రయత్నంగా గేటువైపు చూశాడు—తన భార్య వొస్తోందేమోనని. ఇంకా రావటం లేదు. 'పోనీలే నెమ్మదిగా వస్తుంది.' అనుకున్నా డతడు.

"ఎక్కడా ప్రదర్శన లివ్వటంలేదా?" అడిగాడు, ఏదో అడగాలి కనుకా.

"ఏదీ, మీలాంటి గొప్పవాళ్లు ఏర్పాటు చేయిస్తేగా." నవ్వాడు రంగారావు.

"అయినా, మాలాంటి చిన్నచిన్నవాళ్లమీద ఉంటుందా ఏమిటిలెండి మీ చూపు."

కొంచెం చివుక్కుమంది మనస్సు రంగారావుకి. "పాపం," అనుకున్నాడు. బయటికి "అదేంమాట," అన్నాడు. మనోరమ ప్రత్యుత్తరంగా నవ్వింది, కావాలని కొంచెం కులుకుతూ. క్రేప్ సిల్కు బుజంమీద సరిగా ఆనటంలేదు. ఆమె సరిచేసుకుంది. అంటే బుజంపైకి లాక్కొని రెండో కొన చుట్టూ తిప్పి చేతో పట్టుకుంది. కాని...విద్యుద్దీపకాంతిలో వల్వెట్ చోళీ మెరుస్తోంది. వల్వెట్ చోళీమీదికి మనసుపోయిన రంగారావుకి అది ఆహ్లాదకరంగా ఉంది...

మనోరమ సవరించుకుంది—సరిగా.

సిగ్గుపడ్డాడు రంగారావు.

గేటువైపు చూశాడు, కొంచెం భయంగా—అయిష్టంగా.

"కారు తెమ్మన్నారా, సార్."

డ్రైవర్ అడుగుతున్నాడు. అటుచూశాడు.

"అమ్మగారు కొంచెంసేపటికిందే వెళ్ళిపోయారు. తల నొప్పిగా ఉందని."

"ఓ", రంగారావుకి ఎందుకో కొంచెం తేలికగా ఉంది.

"రండి. లిఫ్ట్ ఇస్తాను."

"థాంక్స్."

చీకట్లో దూసుకుంటూ పోతోంది కారు...

జనం కిటకిటలాడిపోతున్నారు, హాలుముందు.

రిక్షాలు, బళ్ళు, జనం...

జేలగా చూస్తోంది ఒక అమ్మాయి, పల్లెటూరి మనిషిలా కనిపిస్తోంది, చిన్నవయస్సు. ఏదో పోగొట్టుకున్నట్టుగా చూస్తోంది.

"రిక్షా అమ్మగారూ." "రిక్షా" "రిక్షా".

కేకలు.

"స్టేషన్‌కి వొస్తావా ?"

ఒంటరిగా స్టేషన్‌కి—ఆ అమావాస్యరాత్రి. ఏవూరినించి, ఎక్కడికి...

రిక్షావాలాకి సందేహం కలిగింది.

"ఎక్కండి", అన్నాడు.

"ఎంత...?"

మాటవరసకి అడిగినట్టుగా అడిగింది. ఆ అమ్మాయి ఎక్కడో, ఏదో ఆలోచిస్తోంది.

"విూ చిత్తం", బేరంలో అతని కిష్టంలేదు. పోటీ. పైగా సినిమాకెళ్ళి మూడున్నరగంటలబేరం పోగొట్టుకున్నాడు. ఏదోవిధంగా కూడదియ్యాలి...

ఆ అమ్మాయి రిక్షా ఎక్కింది.

రిక్షావాలా హుషారుగా ఉన్నాడు. సినిమా మాంచి హుషారిచ్చింది. బాగా తీశారనుకుంటూ, సినిమాలో ఘట్టాలు జ్ఞాపకం చేసుకుంటున్నాడు.

"ఇటేనా స్టేషన్?"

అకస్మాత్ గా వినిపించింది అతనికి. ఊహాలోకంనించి తిరిగి "ఇదేనండి", అన్నాడు. ఆ అమ్మాయిని గురించి ఆలోచిస్తున్నాడు. చెప్పకుండా ఇంటినించి వొచ్చిన రకం అని తెలుస్తూనే ఉంది. ఏ రెండో పెళ్ళి సంబంధం వొద్దనో— లేక ఏ పోట్లాటవల్లో, నగలతో ఒంటరిగా—

"ఇటేనా స్టేషన్ ?"

మళ్లీ అడిగింది. రిక్షావాలా 'అవు' నన్నాడు. వెంటనే అతనికో కొత్త ఆలోచన కలిగింది. అటు వెడితే స్టేషన్ వొస్తూంది—మరోపక్కకి వెడతే—నిర్జనం. నగలు ! ఒక్క నగచాలు—జీవితం హాయిగా కొన్నాళ్లు...ఒక్కటిచాలు... అవన్నీ ఎంత ఖరీదు చేస్తాయో !

రిక్షా పోతోంది.

ఆ అమ్మాయికి అనుమానం వేస్తోంది.

జనం కనిపించరేం ? ఎవరైనా జనం తిరుగుతూ ఉంటే బావుండును. ఎదురుగా ఎవరన్నా వొస్తే ఆపి, 'స్టేషన్ ఇటేనా ?' అని అడిగితే—

"నేను వొచ్చిన దోవ ఇదికాదే", అనుమానంగా అంది.

"అది వొచ్చేదారి, ఇది వెళ్లేదారి."

కొంత తృప్తిపడ్డది...కాని...

రిక్షా పోతూనే ఉంది.

ఎవరూ జనంగాని — బండీగాని ... టాక్సీగాని, టాక్సీ!—

ఏమీ ఎదురురాకుండా ఉంటే...

రిక్షావాలా ఆలోచిస్తున్నాడు ...

రంగారావుగారి కారు పరుగెత్తుతోంది.

చీకటి. రంయిమని చలిగాలి కొడుతోంది కారు కిటికీల్లోంచి. గతుకుల రోడ్డు.

బ్యాక్ సీటులో కూర్చున్నారు రంగారావూ, మనోరమా.

మనోరమ అలా నిర్లక్ష్యంగా సీటుకి జేరగిలబడి కూచుంటుందేం ?

రంగారావుకి ఏమిటోగా ఉంది.

మల్లెపూల వాసన.

మనోరమ మాట్లాడుతుంటే రంగారావు వింటున్నాడు—అర్థంగురించి అంతగా అతడు పట్టించుకోటంలేదు. ఆమె ఏదో చెబుతోంది. అతడు వింటున్నాడు. ఆమె గొంతు సన్నగా బావుంది. వినా లనిపిస్తోంది.

గాలికి చీరచెంగు రప్పమని రంగారావు ముఖానికి కొట్టుకొంది.

"సారీ", అంది.

"పరవాలేదు," అన్నాడు.

కారు కేదో అడ్డొచ్చింది. సడెన్ బ్రేక్.

రంగారావు తూలాడు. మెత్తగా......భయపడ్డాడు రంగారావు.

"సారీ",

"పరవాలేదు", మనోరమ నవ్వింది.

పరవాలేదు ! దూరంగా జరగదేం ?

దొంగతనంగా మనోరమవైపు చూడాలనిపించింది. చూశాడు. ఆమెకూడా చూసింది.

చిన్న చిన్న కుదుపులకే రంగారావు చెయ్యి తన చేతికి తగుల్తోంది. మనోరమ చిరునవ్వు నవ్వుతుంది. ఈ రంగారావేనా......తనవైపు సరిగా చూడనుకూడా చూడ లేదు ఆరోజు ! తన తళుకుబెళుకులకి చలించలేదు !

రంగారావుకి మనసులో ఏదో మెదుల్తోంది.

మనోరమ దగ్గరికి జరగాలనిపిస్తోంది.

ఆమె కలలు కంటోంది—సొంత ట్రూపుతో జేగీయ మానంగా—రంగారావు డబ్బుతో...

రంగారావు, పాపం.

కాని పెట్టుబడికావాలి తనకి.

మనోరమ వేశ్య—ఆ విషయం తెలుసు రంగారావుకి. కాని అతడు ఆలోచించటం మానేశాడు. పరిస్థితుల్ని అతడు అతిక్రమించదలచుకోలేదు. విసుగ్గా ఉన్నాడు. సినిమా చూసి అలిసిపోయాడు. మత్తు మత్తుగా...చీకటీ, గాలీ...మనోరమ ఊపిరి వెచ్చగా తగుల్తోంది...

రంయిమని కోశాడు డ్రైవర్, సందు తిరగటానికి.

ఆ వాలుకి తూలింది మనోరమ !

రంగారావు ఆపాడు—ఆమె జబ్బలు పట్టుకుని.

మనోరమ వెంటనే సర్దుకోలేదు.

"సారీ", అనలేదు.

"పరవాలేదు", అనే అవకాశమే లేదు.

మనోరమ నవ్వింది. రంగారావు నవ్వాడు. ఆమె లేవలేదు. రంగారావు ఆమెచేతులు వదల్లేదు.

కారు దూసుకుపోతోంది—నడిచేవాళ్ళని కవ్విస్తూ...

నడుస్తున్నాడు రామ్మూర్తి.

ఎవరో జనం ఎదురుగా వొస్తున్నారు.

పరకాయించిచూశాడు—ఎలిక్ట్రిక్ లైట్ వెలుగులో.

ఎదురింటివాళ్ళు—వాళ్ళలో ఆ అమ్మాయిలేదే!

ఎందుకో! వాళ్ళఅమ్మా, తమ్ముడూ, ఇంకా ఎవరో — చుట్టుపక్కలవాళ్ళూ... ఆ అమ్మాయి ఎందుకు రాలేదు! అసలే సినిమాపిచ్చి. మరి...ఆలోచిస్తున్నాడు రామ్మూర్తి.

ఆ పిల్ల ఉత్త వెర్రిబాగులదల్లే ఉంది. ఎప్పుడూ అలా ఆ మేడగది కిటికీదగ్గర నిలబడి పాడుతూ ఉంటుంది—సినిమా పాటలూ, ప్రేమగీతాలు. ఈ ఊరు వొచ్చినప్పటినించీ చూస్తున్నాడు. కథల పత్రికలు చదువుతూ, డాబామీద తిరుగుతూ, కూనిరాగాలు తీస్తూ, రోడ్డుమీద వొచ్చేపోయే జనం చూస్తూ—అప్పుడప్పుడు తనవైపు అలా చూస్తుందేం? తనూ పాడతాడు. తను పాడుతుంటే అలా నిలబడి చూస్తూ...

రామ్మూర్తికి ఏవేవో ఆలోచనలు సాగుతున్నాయి.

ఫూలిష్ గరల్.

చెప్పేవాళ్ళెవరూ లేనట్టున్నారు.

ఎప్పుడో సినిమాఫీల్డులోకి ఉరుకుతుంది. చూడటానికి బాగానే ఉంటుంది. ఏ చిత్రంలోనో బుక్ అయితే...

అతనికి నవ్వొచ్చింది. చిత్రంలో బుక్ కావటం మాటలా ?

రామ్మూర్తి ఆలోచిస్తూ, గది చేరుకుని లైటు వెలిగించాడు. బ్రహ్మచారి కొంప. అంటే రామ్మూర్తికి పెళ్ళి కాలేదనికాదు. రెండు సంవత్సరాల కిందటే ఐంది. భార్య ప్రస్తుతం పుట్టింట్లో ఉంది—కాన్పుకి. ఇప్పట్లో వొచ్చే అవకాశంలేదు. అందువల్ల ఓ గది అద్దెకి తీసుకుని ఉంటున్నాడు—ఆ కొత్త ఊరికి వొచ్చినప్పటినించీ. గది చిందరవందరగా ఉంది. విసుగ్గా కుర్చీలో కూలబడి మేడవైపు యథాలాపంగా చూశాడు.

ఆ గదిలో లైటు వెలిగింది.

కిటికీలోంచి...

ఫూలిష్ గరల్. తనవైపు చూస్తున్నట్టుగా ఉంది. బహుశా, ప్రేమపిచ్చి ! రామ్మూర్తి నవ్వుకున్నాడు.

రామ్మూర్తి బావుంటాడు. ఆ విషయం అతనికి తెలుసు. ఏదో పాట అందుకున్నాడు. జంట పాట. విరహ గీతం, అందుకొంటూ, రామ్మూర్తి మనసులోకి దొంగతనంగా తొంగిచూశాడు.

తనా పాట ఎందు కందుకున్నాడు !

ఆమె నిలబడి వింటున్నది.

వింటుందని తనకి తెలుసు. పిచ్చిపిల్ల!

ఆమె ఒక్క-క్షణం అదృశ్యమైంది. తరవాత మళ్ళీ ప్రత్యక్షమైంది.

ఆమె ఏదో సంజ్ఞ చేస్తున్నట్టుంది...తనకే!

రామ్మూర్తి కొంచెం చలించాడు. అందుకనేనా ఆమె సినిమాకి వెళ్ళలేదు!

కిటికీలోంచి ఏదో కాగితం ఉండచుట్టి గది ముందు పడేలా విసిరింది.

సాహసం! కాసేపు అలాగే కూచుని తరవాత తెలివి తెచ్చుకుని రామ్మూర్తి అప్రయత్నంగా గదితలుపుదగ్గరికి వెళ్ళాడు, కాగితం తీసుకోవాలని.

ఎవరో కాలేజీ కుర్రాళ్ళల్లే ఉన్నారు...ఇద్దరు అప్పుడే గది దాటి పోతున్నారు—మాట్లాడుకుంటూ.

రామ్మూర్తి ఆగాడు వాళ్లు వెళ్ళేదాకా.

వాళ్లు సినిమాగురించే మాట్లాడుకుంటున్నారు.

రామ్మూర్తి గుండె కుదుటబడ్డది. వాళ్లు చూళ్ళేదన్న మాట. వాళ్లు గది దాటగానే కాగితం విప్పిచూశాడు. రెండే ముక్కలు. తనని ప్రేమిస్తోందిట!

ఫూలిష్ గరల్. ప్రేమపిచ్చి. తను ఒంటరిగాడు కాడని తెలియదు.

ఆ అమ్మాయి అక్కడే నిలబడి ఉంది.

రామ్మూర్తికూడా అక్కడే నిలబడ్డాడు.

అతడు సంకోచిస్తున్నాడు—లాంఛనప్రాయంగా.

తను పాట ఎందుకు పాడాడు! ఎందుకో రామ్మూర్తికి మనసు జ్ఞాపకం చెయ్యబోగా అతడు విననట్టు నటించాడు. ఆమెకి పాట ఇష్టం......ఆ దౌర్బల్యం ... రామ్మూర్తి విసుక్కున్నాడు తన మీద. ఎలాగైనా ఆమె సినిమాలో తప్పక చేరుతుంది. ఆమె తత్వం అటువంటిది.

"ఆధారా లేమి", టని నిలదీసి అడిగితే రామ్మూర్తికి కోపం వొస్తుందని అతనికీ తెలుసు. అందుకే అడగలేదు.

ఆమె సినిమాల్లో చేరిపోతుంది.

చేరింతరవాత ఎలాగో...ఎలాగో...తప్పదు.

అప్పుడామెకి మంచి భవిష్యత్తే ఉంటుంది.

ఏమేమిటో ఆలోచించాడు రామ్మూర్తి. అతనికి విసుగుపుడుతోంది.

ఎదురెదురుగా—

రామ్మూర్తి మేడవైపు నడిచాడు...

ఇంకా సినిమాగురించే మాట్లాడుకుంటున్నారు ఆ కాలేజీ కుర్రాళ్ళిద్దరూ—

"అందరూ ఆమోదించేదీ, ఇంచుమించు ఎవ్వరూ ఆచరించనిదీ ఏమిటో చెప్పగలవా ?" స్నేహితుణ్ణి అడిగాడు కాలేజీ కుర్రాడు.

"ఏమిటి ?"

"పోనీ, ఇంచుమించు ఎవ్వరూ ఆమోదించనిదీ, అందరూ ఆచరించేదీ ఏమిటో చెప్పు."

"నువ్వే చెప్పెసెయ్యి."

"మొదటిది ధర్మం, రెండోది అధర్మం."

రెండో కుర్రాడు నవ్వాడు.

"నువ్వు కొంచెం తమాషాగా అన్నా అది నిజమే. వేశ్యకూడా వేశ్యని అసహ్యించుకొంటుంది. కాని..."

"ఏంలాభం?" మొదటి కుర్రాడు పెదవి విరిచాడు.

"అందుకే మానవుడి భవిష్యత్తుమీద ఇంకా నాకు నమ్మకముంది," అన్నాడు రెండో కుర్రాడు. మొదటివాడు మౌనంగా ఆలోచిస్తున్నాడు...

మనోరమ నడుంచుట్టు చెయ్యి వేశాడు రంగారావు.

నిర్జన ప్రదేశంలో రిక్షా ఆగింది.

మేడగది సమీపించాడు రామ్మూర్తి.

—అది వర్తమానం.

# స్త్రీ

రాత్రి ఏడుగంటల పదినిమిషా లయింది. శేషాద్రి "హోటల్ విలాస్", లో మూడో అంతస్తుమీదికి చేరుకున్నాడు. ఆ అంతస్తులో రెండే గదులున్నాయి. ఓ తలుపు గడియ వేసుంది. రెండో గదిలో ఎవరో స్త్రీ టైపు చేసుకుంటోంది. ఆమెని పలకరించటానికి సాహసంలేక అతడు ఆ గది ముందుగా రెండు మూడుసార్లు పచార్లు చేశాడు. టైప్ రైటర్ లోంచి కాగితాలు తీసేసి, సర్దుతూ ఆమె యథాలాపంగా తలుపువైపు చూసింది.

"ఎవరు ?"

శేషాద్రి ఆమెవైపు చూడటానికి బిడియపడి నేలమీద చూస్తూ అన్నాడు.

"నేను టాక్సీ డ్రైవర్ నండి. చంద్రా రెడ్డిగా రిక్కడేనా ఉండేది ?"

అతని ఆకృతివైపు వింతగా చూస్తూ ఆమె తల నిలువుగా ఆడించింది.

"టాక్సీ తెచ్చానండి."

"ఇప్పుడు టైమెంతయింది ?" ఆమె మాటల్లో విసుగుదల స్పష్టంగా కనిపిస్తోంది.

"ఏడూ పది"

"ఎన్నింటికి రమ్మన్నారు ?"

"ఏడున్నరకి"

"మరి అప్పుడే ఎందుకొచ్చావు ?" అతడు కొంచెం తడుముకుని.

"ఈ రోడ్డు జనసమ్మర్దంగా ఉంటుందని టాక్సీ పక్క వీధిలో ఆపి, ఆ సంగతి చెబుదామని వొచ్చాను... బాబుగారు లేరా ?" అన్నాడు.

"కనిపించటం లేదా ?"

శేషాద్రి చిన్నబుచ్చుకున్నాడు. అతనలా తలదించుకోటంచూసి ఆమెకి జాలి వేసి అంది.

"ఎవరో పిలిస్తే వెళ్ళారు. టైంకే వొస్తార్లే."

"సరేనండి," అనేసి అతను వెనక్కి తిరిగాడు.

ఆమె టైప్‌రైటర్ మూతవేసి, ఓసారి ఆవులించి, టైం చూసుకుని, చెయ్యాలిసిన పనేమీ లేకపోవటంవల్ల,

కాలక్షేపం ఎలా చెయ్యటమా అని ఆలోచించి, వెడుతున్న శేషాద్రిని కేకేసింది.

"చూడు. నీ పేరేమిటి ?"

"శేషాద్రండి."

ఆమెకి నవ్వొచ్చింది. ఇరవైఏళ్లు నిండినా బాల్య చాపల్యం వొదలక పైకి నవ్వేసింది.

"అదేదో కొండపేరు కదూ ?"

"ఊం".

"చూస్తే, నువ్వు కొండలతో పోటీ చేసేట్టున్నావే!"

శేషాద్రికి వొళ్లు మండింది. తనని చూస్తే ప్రతివాళ్ళకీ ఇలా ఏడిపించాలనే బుద్ధి ఏందుకు పుడుతుంది? తన రూపానికి తను కర్తా? కొంచెం లావుగా, అసహ్యంగా ఉంటే ఉండవచ్చు. కాని తనేం చేస్తాడు ? ఆమాత్రం ఎదుటివాళ్లు గ్రహించరేం ? తను ఎంత బాధపడేదీ వాళ్ళకి తెలియదా ? కాని...కాని...తను తొందరపడకూడదు.

మాట మారుస్తూ అన్నాడతను. "బాబుగారు మీ కేమవుతారు ?"

ఆమె ఏ కళనుందో గాని వెంటనే సూటిగా జవాబిచ్చింది.

"యజమాని. నేనాయన ఆంతరంగిక కార్యదర్శినిని."

"అలాగా ! తమరి పేరు ?..."

"విశాల."

"చాలా బావుంది."

"థాంక్స్. నీక్కూడా బావుందన్న మాట."

"నాకుమటుకు ఎందుకు బావుండదు ?"

"నీకు కొండల పేర్లు తప్ప ఇంకేవీ ఇష్టం ఉండదేమో ననుకున్నాన్లే."

అతనికి కొంచెం రోషం వొచ్చింది.

"ఇది కొండలపట్టణ మేనండి."

"అందుకే ఇక్కడినించి వెళ్ళిపోతున్నాంగా"

"మీకు తెలియదేమో గాని, మాది చాలా అంద మైన పట్నంగా పేరు మోగింది."

"అవునవును. పాపం, రెడ్డిగారుకూడా తెగమెచ్చుకు నేవారులే."

"ఆయన కీ ఊరు తెలుసా ?" కొంచెం కౌతుకంతో అడిగాడు, శేషాద్రి.

"ఆయనకి తెలీకపోవట మేమిటి ? ఇక్కడ మూడేళ్ళుద్యోగం చేశారుగా."

"ఏం ఉద్యోగం ?"

"ఏదో పోలీస్ ఆఫీసర్. పాపం, సాయంత్రం పాత బంగళా మీదికి మనసుమళ్ళి చూసివొస్తానని వెళ్ళారు. వెనకటి జీవితంఅంతా జ్ఞాపకం వొచ్చింది గావును అక్కడికి వెళ్ళేసరికి; తిరిగొచ్చినప్పటినించీ అదోరకంగా ఉన్నారు."

శేషాద్రి ముఖకవళికలు మారాయి.

"అవును. నాకు తెలుసు", అన్నా డతను.

"ఎలా తెలుసు ?" ఆమె ఆశ్చర్యంగా అడిగింది.

"బంగళానించి నా టాక్సీలోనే ఆయన ఇక్కడికి వొచ్చారు. ఆ బంగళాపక్కన ఉన్న పెంకుటిల్లేలెండి, మాది."

"ఓహో" అందామె.

"వారు ఇప్పుడు ద్యోగంలో లేరా ?"

"రిటైరయారుగా. అందుకే ఈ మిలిటరీ కంట్రాక్టుల వ్యవహారాలు."

"ఓహో" అన్నాడు శేషాద్రి, ముభావంగా. కాసేపాగి చేతిగడియారం చూసుకొని "పదిహేను నిమిషాలు" అనుకుంది బయటికి, విశాల.

"పదిహేను నిమిషాలు!" గొణుక్కున్నాడు, శేషాద్రి.

"నీకు విసుగు పుడుతున్నట్టుంది."

"లేదండి."

ఆమెకో చిలిపి ఊహ తట్టింది.

"ఊరికే ఎంతసేపు కూచుంటావు ? కాసేపు ఈ పత్రిక చదువుకుంటూ, కూర్చో," అని ఓ ఇంగ్లీషు పత్రిక అతని మీదికి గిరవాటేసింది. అతడు అది అందుకొని పేజీలు తిప్ప సాగాడు. ఆమె ఓనవ్వు నవ్వి అంది.

"బొమ్మలు చూస్తున్నావా ?"

"చదువుతున్నాను," నిర్లక్ష్యంగా అన్నాడతను.

"చూస్తే, నువ్వు బాగా చదువుకున్నట్టున్నావే !"

ఆ అనటంలోని ఎత్తిపొడుపుని గ్రహించాడతను. అతనికి వెనకటి స్కూలుజీవితం జ్ఞప్తికొచ్చింది. అందరూ

తనని చీడపురుగునిగా చూసేవాళ్ళు. తనకి దగ్గరగా ఎవరూ కూర్చునేవాళ్లు కాదు. వ్యంగ్యంగా ఆ మాటా ఈమాటా అని ఏడిపించేవాళ్లు. పోనీ, కుర్రాళ్లు ఎలా ప్రవర్తించినా, ఆడ పిల్లలు తనని చూసి అపహాస్యంగా నవ్వకపోతే తనంతగా బాధపడేవాడు కాదు. తను చేసిన నేరమేమిటి? ఎందుకు తన కా శిక్ష? వాళ్ళంతా చేరి బలవంతంగా తనని స్కూల్ మాని పించారు. స్కూల్‌కి వెళ్ళటమంటేనే తనకి భయంగా ఉండేది. ఎలాగో ఇంట్లోనే చదివి మెట్రిక్యులేషన్‌కి కూర్చు న్నాడు. కాని మొదటినించీ సొంత చదువే ఐతే ఏం ప్యాసవు తాడు.?

"ఏం?" ఆమె మళ్ళీ అడిగింది, జవాబు లేకపోవటం వల్ల.

"లేదండి," అతను తేరుకుని అన్నాడు.

"ఏం, పాపం!"

అతనికి వొళ్లు మండింది. ఆమె కా ఎత్తిపొడు పెందుకు?

"ఎంతవరకు చదివా వేమిటి ?"

"మెట్రిక్యులేషన్."

"ప్యాసయ్యావా?" ఆమె విస్మయ పూర్వకంగా అడిగింది.

"లేదు."

ఇంటి పైకప్పు లేచేట్లు నవ్విందామె. తన తప్పు అతని కర్థమైంది. మెట్రిక్యులేషన్ పరీక్ష కెవరైనా వెళ్ళొచ్చు.

డబ్బుకడితే సరి. ప్యాసవకుండా ఆ మాటన్నందుకు అతడు కొంచెం చింతించాడు.

"ఎందుకు ప్యాసవలేదు?" అర్థంలేని ప్రశ్న అడిగింది.

"మార్కులు రాలేదు," అన్నాడు కసిగా.

"ఎందుకు రాలేదు. పెళ్ళిగాని చేసుకోలేదు గదా!" పకపక నవ్వుతూ అంది.

మళ్ళీ ఎత్తిపొడుస్తోంది!

"నన్నెవరూ చేసుకోరని నాకు తెలుసు," అన్నాడు కటువుగా.

"అదేమిటి? నీకేం తక్కువ? నిక్షేపంగా సంపాదిస్తున్నావుగా", ఆమె నవ్వుతూ అంది.

"నా సంగతి నాకు తెలుసు."

"నిన్నెవరూ ప్రేమించలేదా?"

ఈసారి అతడు జవాబు చెప్పలేదు. అతని సహనం చచ్చిపోతోంది. ఆమెకి ఆటగానే ఉంది, కాని తనకి...

"పోనీ, నువ్వెవరినైనా ప్రేమించావా?"

అతనామెవైపు చూశాడు. ఆమె అందంగా, సుకుమారంగా ఉంది. తను...! దేవుడిలాంటి తేడాలతో మనుష్యుల్ని ఎందుకు సృష్టిస్తాడు? అందంగా ఉన్నవాళ్ళ నందరూ ప్రేమిస్తారు. అసహ్యంగా ఉంటే అందరూ అసహ్యించుకుంటారు. మనుష్యుల మనసుల పరిధు లింతేనా?

అతను ఆలోచుస్తూ పత్రిక పేజీలు తిప్పుతున్నాడు. ఏదో బొమ్మ కనిపించింది. అలాగే చూస్తూ ఉండిపోయాడు. అతడు జపాబివ్వకపోటం చూసి అందామె:

"తీక్షణంగా చదువుతున్నట్టున్నావు!"

"లేదు. బొమ్మ చూస్తున్నాను," ఉద్రేకంగా అన్నాడు.

"ఏమిటా బొమ్మ ?"

అతను పత్రిక ఆమెవైపు తిప్పి చూపటానికి సాహసించ గలిగాడు. స్త్రీ పురుషులు ముద్దు పెట్టుకుంటున్న వర్ణ చిత్రం అది. ఆమె తారాపథానికి లేచింది.

"బుద్ధిలేదూ ? మర్యాదగా మసలుకో. స్కాండ్రల్."

మొట్టమొదటిసారిగా అత నామె కళ్ళలోకి తీక్షణంగా చూశాడు. ఆ కళ్ళు... ! ఆమె చలించింది. క్రౌర్యం తాండవించే ఆ కళ్లు !

అతడు వికటంగా నవ్వి, పత్రిక నేలకేసి విసరికొట్టాడు. ఆమె లోలోపల బెదరిపోయినా, ధైర్యం నటిస్తూ అరిచింది.

"గెటౌట్."

"నువ్వు అందగా ఉన్నావని అహంకారంకదూ? హుః అందం. అంత అందంగా ఉన్నందుకు ఇదే శిక్ష...."

తటాలున శేషాద్రి ఆమెమీదికి ఉరికి గట్టిగా కౌగిలించుకుని ఆమె పెదవుల్ని చుంబించాడు. ఆమె అనుకోని ఈ సంఘటనకి బిత్తరపోయింది. నోట మాట రాలేదు. ఏం జరిగేదీ ఆమె గ్రహించేలోపుగానే అత నామెని వశపర్చుకున్నాడు. అసహాయంగా హీనస్వరంతో కేకేసింది.

కాని, కింద హోటల్ ప్లేట్ల చప్పుడులో, బయట బజారు రొదలో ఆ కేక గదిగోడలు దాటలేదు. అతడు మరోసారి ఆమె పెదవుల్ని చుంబించి వొదిలేశాడు. ఆమె ఉక్రోషంతో, అవమానంతో, దుఃఖంతో రొప్పుతూ అతనివైపు నిప్పులు కక్కే కళ్ళతో చూస్తూ "దుర్మార్గుడా!" అంది.

ఆమెవైపు నఖశిఖపర్యంతం చూశాడు శేషాద్రి.

"ఈ శిక్ష చాలు," అనుకుని వొదిలాడు. కాని...కాని అతనిలోని పురుషత్వం తిరగబడ్డది. తలుపు మూసేశాడు. ఆమె భీతహరిణంలా చూసింది. జాలిగా ముఖం పెట్టింది. వేడుకుంది. క్షమించమంది, చేతులు జోడించింది. కాని అతడు లక్ష్యపెట్టలేదు. ఆమె నిస్సహాయంగా కన్నీరు కార్చింది. అతడు లెక్క చెయ్యలేదు. అందమైన వాళ్ళందరి మీదా కసితీర్చుకుంటున్నట్టుగా అతడు అనుభూతి పొందాడు. ఆమెని బలవంతంగా ఆక్రమించుకుంటున్నకొద్దీ, ఇన్నాళ్ళూ బలవంతాన మనసులోనే అణిచిపెట్టుకుంటున్న పరాభవాగ్ని చల్లారుతున్నట్టుగా అనుభూతి పొందాడు...

ఆ ఆవేశం, ఆ ఉద్రేకం, ఆ కోపం అన్నీ చల్లారాయి. శేషాద్రి గదిమధ్యన చేష్టారహితంగా నుంచుని తన అన్యాయానికి గురైన విశాలవైపు చూస్తున్నాడు. ఆమె ఏడుస్తోంది. ఆమె పూర్వపురూపం స్ఫురణకు వచ్చిందతనికి. ఆకాంతెతనం, ఆ చిలిపినవ్వు, ఆ వయ్యారపు ఆంగికవిన్యాసం, తళుకు బెళుకు లొలికే ఆ అమాయకపు కులుకుచూపులు, ఆ తియ్యని కంఠం, ఆ యవ్వన గర్వం, పడుచుదనపు బింకం, పలికించే

ఆ అహంభావోక్తులు, ఆ బిరుసు మాటలు, ఆ తారుణ్యపు లావణ్యం—అవన్నీ ఏమయాయి? సర్వస్వం కోల్పోయి మూర్తీభవించిన శోకదేవతలా ఆమె పడిఉంది. కన్నీటి కెరటాలు ఆమె చెంపలమీదనించి జారుతున్నాయి. శేషాద్రి హృదయం ద్రవించింది. అతని మనసు చలించింది. కేవలం కొన్ని నిమిషాల వ్యవధిలోనే ఆమె ఏ స్థితినించి ఏ స్థితికి మారిపోయింది! కొన్ని నిమిషాలు, అంతే! శేషాద్రికి కన్నీళ్లు తిరిగాయి. ఎంత ఘోరకృత్యం చేశాడు! అంత ఘాతుకం ఎలా చెయ్యగలిగాడు? తను మనిషేనా? అయితే, అంత త్వరలో జ్ఞానం ఎలా పోగొట్టుకోగలిగాడు?

ఏం లాభం? ఇప్పుడు తనెంత విచారిస్తే ఏం ప్రయోజనం? ఏవిధంగా ప్రవర్తిస్తే తన తప్పుని సరిదిద్దగలడు? తనేమీ చెయ్యలేడు. జరిగిన క్షణాలు తిరిగిరావు. తిరిగిరావు! శేషాద్రి తల పట్టుకున్నాడు. అదేస్థితిలో కొంచెం సేపుండి గద్గదస్వరంతో అన్నాడు:

"మిమ్మల్ని క్షమించమని కోరలేను. నా నేరం—కాదు—ఘోరం అటువంటిది. నరకం అనేది ఉంటే నేనక్కడికి పోతాను. పోయేముందు ఒక్క కోరిక. శేషాద్రి అనే ఈ మూర్ఖుణ్ణి జీవితంలో ఎప్పుడూ ఒక్కసారికూడా జ్ఞాపకం చేసుకోకండి."

ఆ కంఠంలోని ఆవేదన విశాల గమనించకపోలేదు. కాని ఆమె ఏమీ ఆలోచించేస్థితిలో లేదు. ముఖం చేతుల్లో కప్పుకుని ఏడుస్తూనేఉంది.

శేషాద్రి తలుపువైపు రెండడుగులు వేశాడు. బయట నించి ఎవరో తలుపుతట్టటం వినిపించింది.

"ట్రెయిన్ అరగంట లేటుట. ఫోన్‌చేసి కనుక్కున్నాను. అందువల్లే ఆలస్యంగా వొచ్చాను. రెడీగా ఉండండి, పోదాం. అన్నట్లు టాక్సీడ్రైవర్ ఇంకా రాలేదా?"

ఆ కంఠం గుర్తుపట్టాడు శేషాద్రి. చంద్రారెడ్డి! అతని గుండె అతివేగంగా కొట్టుకుంది. తలుపు తీశాడు. లోపలికి ప్రవేశించీ ప్రవేశించగానే కంటబడిన ఆ దృశ్యం చంద్రారెడ్డిని సంభ్రభూతుడిని చేసింది. గది బీభత్సంగా ఉంది. ఆ స్థితిలో ఉన్న విశాలనీ శేషాద్రినీ చూడగానే అతనికి పరిస్థితి అర్థమైంది.

"ఏం చేశావు?" భీకరంగా శేషాద్రివైపు చూసి దబాయించాడు రెడ్డి.

శేషాద్రి ముఖం జేవురించింది. అతడు తటాలున కత్తితీశాడు.

అకస్మాత్తుగా అతడు కత్తితియ్యటంచూసి, నిరాయుధుడైన రెడ్డి కొంచెం వెనక్కితగ్గాడు. కాని మరుక్షణంలోనే శేషాద్రిముఖం నల్లబడ్డది. రెడ్డి అడిగిన ప్రశ్న అతని మనసులో బాణంలా గుచ్చుకుంది. ఏంచేశాడు? తను ఏం చెయ్యదలచుకుని అక్కడికి వొచ్చాడు? ఏంచేశాడు? అయ్యో...అయ్యో...ఇహ తను ఏమీ చెయ్యలేడు... ఏమీ చెయ్యలేడు. అతని చేతిలోంచి కత్తి జారిపడ్డది.

రెడ్డి ధైర్యం తెచ్చుకొని "ఏమిటిదంతా?" అని రెట్టించి అడిగాడు. అతని కళ్ళలోకి కొన్నిక్షణాలు స్థిరంగా

చూశాడు, శేషాద్రి. అతని మనసులో ఏవేవో భావాలు ముప్పిరిగొన్నాయి. దీర్ఘంగా నిట్టూర్చాడు. రెడ్డి ముఖం చిట్లించి శేషాద్రివైపు అర్థంకాని చూపులు చూశాడు. అదే పరిస్థితిలో కొంతసేపు గడిచాక అకస్మాత్తుగా శేషాద్రి జేబులోంచి ఓ ఫోటోతీసి రెడ్డి ముఖానికి ఎదురుగుండా, దగ్గరగా పెట్టి కర్కశంగా అడిగాడు.

"ఈ ఫోటో ఎవరిది ?"

రెడ్డి ముఖం తెల్లబోయింది.

"ఇది నీ కెక్కడిది?" నెమ్మదిగా అడిగాడు.

"ఫోటోలో ఉన్న దెవరు? మీరేనా ?" మళ్లీ అడిగాడు శేషాద్రి. రెడ్డి నిరుత్తరుడయాడు.

"పాతికేళ్లకిందటి ఫోటో గుర్తుపట్టగలిగినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను. ఈ అక్షరాలు కూడా గుర్తుపట్టగలరేమో, చూడండి." ఫోటో అడుగున ఉన్న అక్షరాలమీదనుంచి అతడు చెయ్యి తీశాడు. రెడ్డి వాటివైపు క్షణమాత్రం చూసి తల దించుకున్నాడు.

"సరిగా కనపడటంలేదా? పోనీ నేను చదువుతాను. వినండి. 'శ్రీమతి రాజమ్మకి, ప్రేమపురస్సరంగా, చంద్రారెడ్డి.'" చివరి అక్షరాలు గట్టిగా నొక్కి పలికాడు, శేషాద్రి.

విశాల కిదంతా అగమ్యగోచరంగా ఉంది. ఆమె చంద్రారెడ్డివైపు ఆశ్చర్యంగా చూడసాగింది.

రెడ్డి తల దించుకున్నాడు.

"ఆమె ఎవరో జ్ఞాపకం రావటంలేదు కాబోలు. ఈ ఊళ్లో మీ పాతబంగళాపక్కన ఉన్న పెంకుటింటిని జ్ఞాపకం తెచ్చుకోండి. అందులో ఏకాకిగా నివసించే వితంతువుని, నిస్సహాయురాలిని, చతుర్విధోపాయాలలో, మొదటిది సామం ఉపయోగించి, వశపరచుకోవాలని మీరు చేసిన ప్రయత్నానికి నిదర్శనమే ఈ చిహ్నం. మిమ్మల్ని గుర్తు పట్టటానికే ఆధారంతో ఎంతో గాలించాను. రిటైరై ఎక్కడో ఉంటున్నారన్నారు. చివరికి ఈ ఊళ్లోనే, ఈ ఫొటో సహాయం లేకుండానే, మిమ్మల్ని చూశాను, లేదు. ఆమే మిమ్మల్ని అల్లంతదూరంలోచూసి గుర్తు పట్టింది. 'ఆయనే, ఆయనే', అని నన్ను పిల్చి చూపించింది. ఆమె ముఖంలో నెత్తురు చిమ్మింది. ఏదో పిచ్చిసంతోషం ఉప్పొంగింది. ఆవేశంతో పెదవులు వొణికాయి. నేను తలుపు తీసుకుని బయటికి వొచ్చేశాను. రోడ్డుమీద నుంచుని, ఆ ఇంటివైపు గతానుభవస్మరణతో చూస్తున్నారని మీ ముఖంలోచూస్తే స్పష్టంగా తెలిసింది. ఎలా పలకరించాలో తెలీక తికమక పడ్డారు. టాక్సీవంక దొరికింది. పాపం ఆమెనిగురించి తెలిసుకోవాలనిపించిందా ? హుఁ..."

రెడ్డిముఖం వివర్ణమైంది.

"మూర్తీభవించిన శోకదేవతలా ఆమె జీవితం గడుపుతోంది. కాని...కాని...నేనేం నేరం చేశాను? నన్ను చూసినప్పుడల్లా మా అమ్మకి కన్నీరు మున్నీరవుతుంది. ఎప్పుడైనా ప్రేమగా ఒక్కమాట అనబోయి మళ్ళీ బాధగా ఆపుకుంటుంది. నన్ను చూడటానికే ఇష్టపడదు.

ఎదురుగా ఉంటే కసురుకుంటుంది. చాటుగాపోతే ఏడుస్తుంది. ఆమె నవ్వగా నేను ఒక్కసారికూడా చూడలేదు. నా జీవితంలో ఒక్క మంచి నిమిషం ఇంతవరకు చూడలేదు. ఒక మంచిమాట వినలేదు. ఒక్క మంచి పని చెయ్యలేదు"

అతనికి కన్నీళ్ళు తిరిగాయి. విశాల కాసేపు తన స్థితిని మర్చిపోయి అతనిమాటలు వింటోంది.

"ఒక్క మంచిపనిచేసి జీవితం ముగించేయా లనుకున్నాను. కాని ఇహ ఆ పని చెయ్యలేను. ఎలా చెయ్యగలను? అయ్యో! ఎంత పొరపాటు జరిగింది! ఎంత అనాలోచితంగా ప్రవర్తించాను. నేనిక్కడికి అంత త్వరగా ఎందుకు రావాలి? ఆమె అంత అందంగా ఎందుకుండాలి? ఉన్నా, అందరిలాగే నన్నలా ఎందుకు బాధించాలి? వొట్టి మూర్ఖుణ్ణి. పాతికేళ్ళనుంచీ దహిస్తున్న పరాభవాగ్ని చల్లార్చేవార్తకోసం మా అమ్మ నిరీక్షిస్తూ ఉంటుంది. అందుకోసమే, ఆ క్షణంకోసమే జీవచ్ఛవంలా బతుకుతోంది. చివరికి...చివరికి ఆక్షణం ఎప్పుడూ రాకుండా చేశాను. ఇన్నేళ్ళ ఆశా నిష్ఫలం. మళ్ళీ ఆమె ముఖం ఎలా చూడగలను? ఇహ ఆమెకి మనశ్శాంతి లభించదు. మనోవేదనతోనే ఆమె చచ్చిపోవాలి. తీరని అవమానంతో ప్రతీకారం లేకుండా, నిస్సహాయంగా, అలాగే చచ్చిపోవాలి. నేనూ అంతే. బతికినంతకాలం మనశ్శాంతి లేకపోయినా, చచ్చిపోయేముందయినా, హాయిగా పోవాలనుకున్నాను! ఇహ అది గగనకుసుమం. కేవలం గగనకుసుమం. దేవుడా!"

శేషాద్రి తల పట్టుకుని విచారంగా గది గుమ్మందాటి వెళ్ళిపోతూ, ఓసారి ఆగి, వెనక్కి తిరిగి విశాలవైపు వేదనతో, జాలిగా చూస్తూ, "ఒక్క మంచిపని చెయ్యగలనని ఇప్పుడు తడుతోంది", అనేసి చరచర వెళ్ళిపోయాడు.

ఆ తరవాత రెడ్డి బరువుగా ఓ నిట్టూర్పు విడిచాడు. చాలా క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి. ఆ నిశ్శబ్దం భరించలేకపోయాడు రెడ్డి. విశాలవైపు చూడటానికి అతనికి ధైర్యం చాలలేదు.

ఇంతలో బజారుల్లో ఏదో కలకలం వినిపించింది. ఏదో హడావిడి జరుగుతోంది. రెడ్డి కిటికీదగ్గరికి ఒక్క అడుగులో వెళ్ళి తెర తొలగించి చూశాడు. హోటల్‌కి దగ్గరలో జన సమూహం కనిపించింది.

చంద్రా రెడ్డి హోటల్ కిందికి వెళ్ళి, మ్లానవదనంతో తిరిగొచ్చాడు.

"అతడు కారుకింద పడ్డాడుట. హాస్పిటల్‌కి తీసికెళ్ళారు. చాలా బలంగా గాయాలు తగిలాయట." ఓ చేత్తో నుదురు పట్టుకుని కుర్చీలో కూలబడ్డాడు రెడ్డి.

"అయ్యో, పాపం".

ఆమె కంఠంలోని కంపనం విని అత డాశ్చర్యపోయి ఆమె వైపు చూశాడు.

విశాల గబగబ డ్రెస్ సరిచేసుకుని "పదండి," అంది.

"ఎక్కడికి ?" రెడ్డి విస్మయంతో ప్రశ్నించాడు.

"ఎక్కడికేమిటి ? హాస్పిటల్‌కి."

"ఎందుకు ?"

ఈసారి ఆశ్చర్యపడటం విశాల వొంతయింద.

"ఎందుకేమిటి ?" ఆమె కంతకంటే ఏమనాలో తెలీ లేదు.

"అతడు బతకడు."

ఆమె నిశ్చలంగా అతనిముఖంలోకి చూసింది. ఆ ముఖంలో దుఃఖచ్ఛాయలు లేకపోలేదు. కాని ఆ ఛాయల్లో ఏదో ఉపశమనం—ఏదో విమోచన అణగి ఉన్నట్టు ఆమెకి తోచింది.

"మరి ఇంకా అలా కూర్చుంటారేం ?"

"నేనేం చెయ్యగలను ?"

"అక్కడికి వెళ్ళింతరవాత ఆలోచించుకోవొచ్చు."

రెడ్డి కదలలేదు. అతని మాటలకి ఎదురుచూడకుండానే ఆమె వెళ్ళిపోబోయింది. రెడ్డి పరిస్థితి గ్రహించి తటాలున తలుపుకి అడ్డంగా నిలబడ్డాడు. అతనివైపు ఏహ్యభావంతో, కోపంతో, చూసిం దామె. అతడు బతిమాలుతున్నట్టుగా అన్నాడు :

"విశాలా. మనం వెంటనే ఇక్కడినించి వెళ్ళిపోవటం మంచిది."

అతని తాపత్రయం చూసి ఆమెకి చీదరింపు కలిగింది. శేషాద్రి నిస్సహాయంగా చచ్చిపోతున్న దృశ్యం ఆమెకి కనిపించింది. ఆమె అనుకుంటూనే ఉంది. ఆ ఒక్కపనీ అదే. ఆ "ఒక్కమంచిపనీ", అంతకంటే ఇంకేమిటి ? మంచిపని!

విశాలకి కన్నీళ్లు తిరిగాయి. శేషాద్రి పశ్చాత్తాప పడుతున్న దృశ్యం ఆమెకి కనిపించింది. పాపం, చివరి నిమిషంలో కూడా మనశ్శాంతి లేకుండా చచ్చిపోతున్నాడు. తను అతనితో ఒక్క-మాట చెప్పాలి.

"నేను వెళ్లితీరాలి. వెళ్ళనియ్యండి."

ఆ క్షణంలో రెడ్డికి తటాలున ఓ విషయం జ్ఞాపకం వొచ్చింది. తనఫొటో—తన సంతకంతో ఉన్న తనఫొటో శేషాద్రిదగ్గర ఉంది. అది బయటపడితే!

అతనికి ముచ్చెమటలు పోశాయి.

"నువ్వు వెళ్ళొచ్చు, విశాలా."

"అడ్డు లేవండి."

"కాని ఓ చిన్న ప్రార్థన. అతని జేబులోని ఫొటో ఎలాగైనా సరే సంపాదించి తేవాలి. ఆమాత్రం సహాయం చెయ్యవా?" అతడు జాలిగా, ప్రాధేయపూర్వకంగా అడిగాడు.

ఆమాటలు వినీ వినటంతోనే విశాల కేదో అర్థమై పిచ్చి ఆవేశం కలిగింది. ఏదో భావం ఉత్తేజితమైంది. ఆ క్షణంలో ఆమె తనని తానే మర్చిపోయింది. రెడ్డి, శేషాద్రి ఆమె మనసులో ఒకరి తరవాత ఒకరు మెదిలారు. చివరి నిమిషాల్లో ఉన్న శేషాద్రి దీనంగా చూస్తున్నాడు—తన వైపే!

కన్నుమూసి తెరిచేలోగా ఆమె నేలమీద పడిఉన్న కత్తితీసి రెడ్డిని పొడిచింది. రక్తం చిమ్మింది. కొద్దిగా మీదికి

కూడా చిందింది. ఓక్షణం ఆమెకి మతిపోయింది. కాని, వెంటనే తేరుకుని ఓ దుప్పటి కప్పుకుని బాణంలా బయటికి దూసుకుపోయింది.

శేషాద్రి బతకడని చెప్పేశాడు డాక్టర్, కాని చచ్చిపోయేలోపుగా ఓ అయిదు నిమిషాలు స్పృహలోకి రావటానికి వీలుందన్నాడు. గంటనించీ కనిపెట్టుకుకూచుంది విశాల. అడుగుల చప్పుడు వినిపించినప్పుడల్లా ఆమె భయపడి చూసేది, పోలీసులేమోనని. తను శేషాద్రితో మాట్లాడేదాకా పోలీసులు రాకపోతే...

ఆమె ఎదురుచూసిన నిమిషం వొచ్చింది. శేషాద్రి కళ్లు కొద్దికొద్దిగా తెరిచాడు.

"నేను...నేను...విశాలని", ఆతృతగా అందామె.

అతడు గ్రహించినట్టుగా కళ్లార్పాడు. ఆమె కాలం వృధా పోనీయకుండా, అతని చెవిదగ్గరగా నోరుపెట్టి అంది.

"మీ అమ్మకి జరిగిన పరాభవానికి నేను ప్రతిక్రియ చేశాను," ఆమె ఆదుర్దాగా అతని కళ్ళలోకి చూసింది. అతని పెదవులు వొణకటం మొదలుపెట్టాయి. కళ్ళలోకి ఎర్రజీర వొచ్చింది. అతి కష్టంమీద మాట్లాడటానికి ప్రయత్నించాడు. విశాల అతనివైపు జాలిగా చూస్తోంది. పాపం, కృతజ్ఞత చెప్పాలని ప్రయత్నిస్తున్నట్టున్నాడు. ఆమె అతని నోటిదగ్గర చెవిపెట్టింది.

"హ...త్య..."

విశాల అదిరిపడ్డది. ఎవరో ఫెళ్లున చెంపదెబ్బ కొట్టి నట్టయింది.

శేషాద్రి ఆమెముఖం చూడటాని కిష్టంలేనట్టుగా కళ్ళుమూసుకున్నాడు.

ఇంతేనా శేషాద్రి ఆలోచనాశక్తి! ఇదేనా అతడు గ్రహించింది! ఈ వ్యవహారంలో తనెందుకు అనవసరంగా జోక్యం కలిగించుకుంది? తనకి వాళ్ళతో ఏం సంబంధం? అంత అనాలోచితంగా, మూర్ఖంగా ఎలా ప్రవర్తించింది!

"విశాలగారంటే మీరేనా?"

ఆమె తలెత్తి చూసింది. హాస్పిటల్‌నర్సు. విశాల తలూపింది. తనవెంట రమ్మన్నట్లుగా నర్సు సంజ్ఞచేసింది. విశాల ఆమె ననుసరించి వెడుతూ అడిగింది.

"ఎందుకు? ఏం కావాలి!"

"మిమ్మల్ని పిలుస్తున్నారు."

"ఎవరు?"

నర్సు జ్ఞాపకం చేసుకుంటున్నట్టు ఓక్షణం ఆగి అంది:

"చంద్రారెడ్డిగారు"

"ఇక్కడి కెలా వొచ్చారు?"

"ఆయన్ని ఎవరో కత్తితో పొడిచారు. హాస్పిటల్‌కి తీసుకొచ్చారు. ఆయనకి తెలివిరాగానే తన సెక్రెటరీ విశాల అనే ఆమె ఇక్కడే ఉంటారు – కబురు చెయ్యమన్నారు."

"ఎక్కడున్నాడు?"

"స్పెషల్ రూమ్‌లో...అదిగో, అదే."

రూమ్‌లో రెడ్డి కళ్లుమూసుకుని పడుకుని ఉన్నాడు. పక్కన ఎవరూ లేరు. అలికిడివిని కళ్లుతెరిచాడు. అతనిని ఆ స్థితిలో చూడగానే విశాలకి కొంచెం జాలికలిగింది. దగ్గరగా రమ్మని రెడ్డి సంజ్ఞచేశాడు. వెళ్ళింది.

"నేను బతుకుతానని డాక్టర్ చెప్పాడు, విశాలా." హీనస్వరంతో అన్నాడు రెడ్డి.

"మంచిదే," కొంచెం నిర్లక్ష్యంగానే అందామె.

"కాని నువ్వలా ఎందుకు చేశావో నేనిప్పటికీ అర్థం చేసుకోలేకుండా ఉన్నాను."

విశాల మాటతప్పించి అంది.

"నన్నెందుకు పిలిపించారు?"

"శేషాద్రి కెలా ఉంది?"

"లాభంలేదు," నిర్వికారంగా జవాబిచ్చింది.

రెడ్డి కొన్ని క్షణాలాగి అన్నాడు.

"నన్ను పొడిచింది నువ్వేనని, నే నెవరితో చెప్ప లేదు, విశాలా."

ఆమె తల వొంచుకుంది.

"ఇహాముందు ఎవరితో చెప్పదలచుకోలేదు కూడా."

విశాల అతని కళ్ళలోకి ఓసారి చూసి, పొడిగా నవ్వింది.

"ఆ ఫొటో కావాలి, అంతేనా?"

"అవును, విశాలా, ఈ సహాయం చెయ్యలేవా?"

కొంచెం విసుగ్గా ముఖం చిట్లించి "అలాగే", అంది విశాల.

రెడ్డి లోలోపల ముసిముసిగా నవ్వుకున్నాడు.

"తరవాత, ఈ కథంతా నువ్వు ఎవరితో చెప్పవు కదూ ?"

"సరే."

ఆమె ఒప్పుకుంటుందని తనికి తెలుసు. రెడ్డి మళ్ళీ లోలోపల నవ్వుకున్నాడు.

విశాల లేచిపోబోతూ, అంది:

"రహస్యానికి బదులు రహస్యం అనే దృష్టితో ఈ షరతులకి నేను ఒప్పుకుంటున్నానని మీరనుకుంటున్నారు. నాకు తెలుసు. కాని అటువంటి పొరపాటేమీ పడకండి.

రెడ్డి చకితుడై ఆమె పోయినవైపే అలాగే చూడ సాగాడు. వార్డ్‌బాయివల్ల విశాల నేర్పుగా శేషాద్రి దుస్తులు ఎక్కడ ఉన్నాయో తెలుసుకుని వెతికింది. అతని ట్రౌజర్ జేబులో ఆ ఫొటో ఉంది. తీసి దాచింది. తరవాత అతని దగ్గరికి వెళ్ళి తలదగ్గర నిలబడి, శ్వాస చూసింది. ఇంకా శ్వాస ఆడుతూనే ఉంది. అతని చెవిదగ్గర నోరుపెట్టి నెమ్మదిగా అంది.

"రెడ్డిగారు చచ్చిపోలేదు. బతుకుతారు."

శేషాద్రి నెమ్మదిగా కళ్లు విప్పాడు. విశాలముఖం వికసించింది.

"అవును. రెడ్డిగారు చచ్చిపోలేదు. బతుకుతారు, డాక్టర్ చెప్పాడు."

అతడు మళ్ళీ ఆవేదన పడుతున్నాడు. ఏదో అనాలని నోరు కదుపుతున్నాడు. అతని నోటిదగ్గర చెవి పెట్టింది.

"అ...బ...ద్ధం."

అతడు కష్టంగా అనేసి, బాధగా కళ్లు మూసుకున్నాడు. ఆమె అసహ్యంతో అతని ముఖంవైపు చూసింది. మరే భావమూ ఆమె ముఖంలో ప్రస్ఫుటం కాలేదు. కొంచెం సేపయాక డాక్టర్ వొచ్చి శేషాద్రిని పరీక్షించాడు. విశాల వైపు చూసి, పెదవి విరిచి కొంచెం జాలిగా అన్నాడు:

"ఎక్కువ వ్యవధి లేదమ్మా."

"క్షమించండి, డాక్టర్‌గారూ, నేనిందాకటినించీ పొరబడ్డాను. ఇతను మా సంబంధం కాదు."

అలా అని విశాల వెళ్ళిపోయింది. ఆమెవైపు కొంచెం ఆశ్చర్యంగా చూసి డాక్టర్ అన్నాడు.

"పోనీ, ఇతనివాళ్లెవరైనా మీకు తెలుసా?"

"తెలియదు."

విశాల గబగబా రెడ్డిదగ్గరికెళ్ళి అతని మంచంమీదకి ఫొటో గిరవాటువేసి హాస్పిటల్ బయటికి వొచ్చింది. హాస్పిటల్ ఆవరణ దాటి పోబోతుండగా ఓ నడివయసులో ఉన్న స్త్రీ ఆమెని ఆపింది.

"చూడండి. మీరీ హాస్పిటల్ తాలూకా?"

"కాదు. ఎందుకు ?"

ఆమె ఓ క్షణం తటపటాయించి అంది.

"మీకు తెలుసా ? ఇందాక ఎవరినో కత్తితో పొడిచారుట. హాస్పిటలుకి తీసుకొచ్చారన్నారు."

"చంద్రా రెడ్డిగారి సంగతేనా ?"

"ఆఁ...ఆఁ అవును. ఆయన ఇప్పుడెలా ఉన్నారు?"

ఆమె ఆదుర్దాగా అడిగింది.

విశాల ఆమెని పరకాయించి చూసింది.

"పరవాలేదు. ప్రాణభయం లేదని డాక్టర్ చెప్పాడు."

ఆ స్త్రీ ఏమీ అనలేదు.

"ఆయన మీ బంధువా ?"

ఆమె జవాబివ్వలేదు. మళ్ళీ విశాలే అడిగింది.

"లోపలికి వెళ్లాలా ?"

ఆమె తల అడ్డంగా తిప్పింది.

"మీ పేరు..."

"రాజమ్మ."

విశాల ఆమెవైపు జాలిగా చూసింది.

"ఆయనని పొడిచిన వాళ్ళని పట్టుకున్నారా?"

"లేదు."

"ఎవరో తెలియదా ?"

"రెడ్డిగారికీ, పొడిచినవాళ్ళకీ తప్ప ఇంకెవరికీ తెలియదు."

ఆమె విషాదంగా, ముఖ్భావంగా, పొడిగా నవ్వింది. అది గ్రహించి అంది విశాల:

"నిజంగా తెలియదు."

"అతనెవరో తనకి తెలుసని రెడ్డిగారు చెప్పారా?"

"అతను కాదు—ఆమె."

ఆవిడ ఉలిక్కిపడ్డది.

"ఏమిటి...ఏమిటి?"

"అవును, ఆమె!"

"ఎవరు? ఎవరామె ?

ఆమె కళ్ళలోకి చూసింది విశాల. తరవాత ఉద్రేకాన్ని ఆపుకుంటూ దృఢంగా, నెమ్మదిగా అంది.

"ఎవరో కాదు. నేనే."

"నువ్వా నువ్వా? ఎందుకు?"

ఎందుకు ?

ఎందుకు ?

తుపానులా విశాలమనసులో భావసంచలనం రేగింది. ఎందుకు, ఎలా సాహసించగలిగింది ? తనలో అణగిఉన్న ఏశక్తి, ఎందుకు విజృంభించింది ? తనలోని ఏభావం, ఏ ప్రేరేపణకి ఉద్రిక్తమైంది ?

తనెందుకు లేనిపోనివాటిని గురించి ఆలోచిస్తోంది. సందేహంలేదు. ఆ క్షణాన తనంతగా ఉత్తేజితురాలు కావ

టానికి కారణం—మూర్తీభవించిన నిస్పృహలా అయిపోయిన శేషాద్రి; తను చేయదలుచుకుంది చెయ్యగలిగే, చెయ్య లేని నిస్సహాయ స్థితిలో మానసిక సంక్షోభం పొందుతున్న శేషాద్రి; పశ్చాత్తప్తుడై ప్రాణత్యాగానికి సిద్ధపడ్డ శేషాద్రి; మనోవేదనతో మరణిస్తున్న శేషాద్రి. ఆ సానుభూతితోనే తను...కాని...కాని...

విశాల మనసులో ఏదో వెలితిగానే ఉంది. హఠాత్తుగా ఆమె విద్యుద్ఘాతం తగిలినట్టుగా నిలువునా వొణికింది. కాని మరుక్షణంలో తనని చూసి తనే నవ్వుకుంది. తను అంత మూర్ఖురాలవుతోందేం? ఈ ఆలోచనల వేడికి తన బుర్ర చెడిపోతోంది. ఆమె కళ్ళముందు హేయమైన, దుర్భరమైన క్రూరమైన ఆకృతితో శేషాద్రి తాండవించాడు. ఆమె వొళ్ళు జలదరించింది. ఆక్షణంలో ఆమెకి శేషాద్రిమీద అసహ్యంతోపాటు తీవ్రమైన క్రోధం కలిగింది. జరిగిందంతా మళ్ళీ ఆమె కళ్ళముందు కని పిస్తోంది. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. తానిక అనాఘ్రాత పుష్పం కాదు. యవ్వన మధువు నాస్వాదించిన మొరటు తుమ్మెదలా శేషాద్రి ఆమెముందు తాండవించాడు. తననించి ఏదో వేరయిపోయింది. ఆమె గుండె గతుక్కుమంది. శేషాద్రి తననించి ఏదో...ఏదో దొంగిలించుకు పారిపోతున్నాడు.

శేషాద్రి! ఈ రెండు మూడు గంటల్లో తన జీవితంమీద అత నెంత ప్రభావం చూపించాడు. ఎంతగా తనభావాల్ని కదిపాడు! తృణప్రాయంగా చూసి ఏడిపించింది; నవ్వుకుంది; కసురుకుంది; చీదరించుకుంది; ఏవగించుకుంది; భయపడ్డది; బతిమాలుకుంది; జాలిపడ్డది; నివ్వెరపడ్డది; అసహ్యించుకుంది.

తనలో ఏ దౌర్బల్యంవల్లో ప్రేరేపించబడి ఆ అపాత్రుడి కోసం, ఆ అసహ్యుడికోసం, అనాలోచితంగా, అనవసరంగా తనకి ప్రమాదం తెచ్చిపెట్టుకోటానికి కూడా సాహసించింది. ఇదంతా ఆ స్వార్థపరుడికోసం, తననిగురించి ఆలోచించటానికి కూడా తాహతులేని ఆ కృతఘ్నుడికోసం, అర్థం చేసుకోగల పటిమలేని ఆ సామాన్య మానవుడికోసం, తనపై దౌర్జన్యంచేసిన ఆ దుర్మార్గుడికోసం ... విశాల మనసులో అస్పష్టభావం ఏదో మళ్ళీ మెరుపులా మెరిసి అదృశ్యమైంది.

శేషాద్రి దౌర్జన్యం, కృతఘ్నతా, సంకుచితత్వం విశ్వరూపాలు ధరించి విశాలమనసులో భీకరనృత్యం చేస్తున్నాయి. ఆమె హృదయాన్నీ, అహాన్నీ గాయపరుస్తున్నాయి. హృదయంలో మినుకు మినుకుమనే అస్పష్ట కాంతితో ఏదో గుర్తించటానికి ప్రయత్నిస్తున్న విశాల మనోనేత్రాల్ని ఆ నల్లటి ఆకృతుల నీడలు అడ్డగిస్తున్నాయి.

అలా ఆలోచనల్లో తేలిపోతున్న విశాల మనసుని అకస్మాత్తుగా, భయంకరమైన ఓ కొత్త ఆలోచన బాకుపోటులా పొడిచింది. "తనకి శేషాద్రిలాంటి కొడుకు పుడితే..." ఆమె నిలువునా వొణికింది. ఆమె కళ్ళముందు మనుషుల ప్రపంచం గిరగిర తిరగసాగింది. పడిపోతున్న విశాలని రాజమ్మ గభాలున పట్టుకుని కౌగిలించుకుంది.

గిరగిర తిరిగే ఆ మనుషుల ప్రపంచంలో ఎవరో వ్యక్తి తనవైపు చూస్తున్నాడు. ఎవరు? ఎక్కడ చూసింద తన్ని? ఓ శేషాద్రి! శేషాద్రి! అతనే! అదేమిటి, అలా ఉన్నాడేం? ఆ అసహ్యాకరమైన రూపం ఏదీ? ఆ క్రౌర్యమైన చూపు,

ఆ స్వార్థం, ఆ దుర్మార్గం, అవన్నీ ఏమయాయి ? తన వైపు చూస్తున్నాడు. మందహాసం చేస్తున్నాడు.

ఆ అవ్యక్తావస్థలో విశాల పెదవులు మందమందంగా హసించాయి.

అయ్యో, అదేమిటి ? ఆ నల్లటి ఆకృతులేవో అతన్ని చుట్టుకుంటున్నాయి. అలా అయిపోతున్నాడేం, శేషాద్రి ?

అదే క్షణాన ఆమె కళ్ళముందు గిరగిర తిరిగే ఆ మనుషుల ప్రపంచం అదృశ్యమైంది. విశాల గభాలున కళ్లు తెరిచింది. తను రాజమ్మ కౌగిటిలో ఉంది. తనలా ఎందుకుందో వెంటనే ఆమెకి అర్థం కాలేదు. నెమ్మదిగా విడిపించుకుంది. క్షణం క్రితం తనకి కలిగిన అనుభూతి ఆమెకి అస్పష్టంగా జ్ఞాపకం రాసాగింది. ఆలోచించే కళ్ళతో ఆమె యథాలాపంగా రాజమ్మ వైపు చూసింది. ఏదో జవాబుకోసం నిరీక్షిస్తున్నట్టుగా ఉన్న ఆమెముఖం చూడగానే అకస్మాత్తుగా విశాలకి ఆమె ప్రశ్న జ్ఞాపకం వొచ్చింది.

"ఎందుకు...?"

ఏదో సూచన చటుక్కున మనసుకి తట్టింది. అలా తట్టీ తట్టగానే చప్పున ఆలోచించటం మానేసిందామె. వెర్రి మొర్రి ఆలోచనలు ! ఇలా తన మనసు తన నెందుకు మోసం చేస్తోంది ? ఎవరో పకాలున నవ్వినట్టనిపించింది. దొంగతనంగా రాజమ్మవైపు ఓసారి చూసి, చివాలున అక్కణ్ణించి కదిలి చకచక హాస్పిటల్ బయటికి నడిచిపోయింది, విశాల.

రాజమ్మ నిర్ఘాంతపోయింది.




# నీళ్ల ధార

ఎక్స్‌ప్రెస్ అరగంట లేటు అని తెలుసుకుని, ఏమీ తోచక ప్లాట్‌ఫారం ఆమూలనించి, ఈమూలదాకా రెండు సార్లు తిరిగి, చివరికి హిగిన్‌బాదమ్స్ బుక్‌స్టాల్ దగ్గర నిలబడ్డాడు పున్నారావు. రకరకాల పుస్తకాలు అనేకానేక ఆకర్షణలతో అరల్లోంచి తొంగిచూస్తూ కొనేవాడికోసం కాచుకు కూచున్నట్టుగా ఉన్నాయి. అవన్నీ సింహావలోకనం చేస్తున్న పున్నారావుకి తనకొట్లో అమ్ముడుపోని ఫాన్సీ స్టాకు జ్ఞప్తికొచ్చింది. ఎన్ని పుస్తకాలు! ఇవన్నీ ఎవరు కొంటారో! పున్నారావుకి అమిత ఆశ్చర్యం వేసింది. ఈ పుస్తకాల షాపుల్ని గురించి తనెప్పుడూ అంతగా ఆలోచించలేదు. బహుశా తన కొట్లో ఫాన్సీసామాన్లని చూసికూడా జనం అలాగే ఆశ్చర్యపోతారేమోననే ఊహ వెంటనే

పున్నారావుకి తట్టింది. తనలాంటి వ్యాపారికూడా ఒక్క క్షణం మూఢుడై పోయినందుకు పున్నారావు కాస్త చింతించాడు. అన్నట్టు, తను పుస్తకం - ఏదైనా-కొని ఎన్నాళ్ళయింది! ఈ మధ్యగావును ఒకటో క్లాసు పుస్తకం కొన్నాడు కొడుక్కి. అప్పుడప్పుడు ఏవో పత్రికలు చదవాలని ఉబలాటం కలిగితే ఏ లైబ్రరికో వెళ్ళి చదివేవాడు.

అవును, మరి. పుస్తకం కొనటమంటే మాటలా? అయినా తనకంత అభిరుచి లేదు-ఈ పుస్తకాల్లో రాసే విషయాలమీద. జీవితం అంతా డబ్బుతో కూడుకుని ఉంది. సంపాదించాలి. రెండుచేతులో సంపాదిస్తేగాని వ్యవహారాలు కుదటబడవు. పున్నారావు కొంచెం నవ్వుకున్నాడు. వ్యవహారాలు కుదుటబడాలిసినవి తనకేమున్నాయిగనుక. ఏమీ లేవు. నిజమే.

కాని అన్నప్పుడల్లా వ్యాపారం లాభించదు. జాగ్రత్తగా నిర్వహించుకుంటూ రావాలి. తనకి ఇరవైనాలుగ్గంటలూ ఈ వ్యాపారంతోనే సరిపోతుంది. ఏమిటో, ఇప్పుడు తన ప్రయాణంకూడా వ్యాపార సంబంధమైందే. సరదాగా ప్రాయాణంచేసి ఎన్నాళ్ళయింది! ఎప్పుడూ ధరలూ, వస్తువులూ, మార్కెట్లూ, పున్నారావుకి కొంచెం విసుగు పుట్టింది. పుస్తకాలవైపు చూస్తున్నకొద్దీ అతనికి విసుగు మరింత ఎక్కువ కాసాగింది. ఈ పుస్తకాల్లో ఏమేం విషయాలు రాసుంటారెూ! వీటిల్లో ఎంత విజ్ఞానండుందో! ఒక్క క్షణం పున్నారావు తను కాలేజీచదువు చదవనందుకు

విచారించాడు. తను చదవగలిగితే ఎంత బావుండేది. ఫిఫ్త్ ఫారం మధ్యలోనే మానెయ్యాలనే దుర్బుద్ధి తనకెందుకు కలగాలి! పున్నారావు మనసులో అశాంతి బయలుదేరింది.

విసుగూ, అశాంతితో ఆలోచనలు సాగక ఉబుసుపోకకి పున్నారావు బుక్‌స్టాల్‌లోని ఓ సినిమాపత్రిక తీసుకుని పేజీలు తిప్పసాగాడు. అందులోని అందమైన బొమ్మలూ, కొత్తకొత్త సినిమాలు వివరాలూ, అవీ చూస్తుంటే కోల్పోయిన ఉత్సాహం తిరిగొస్తోంది అతనికి. ఇంతలోనే స్టాల్ యజమాని పున్నారావువైపు చురచుర చూసి "ఏమండీ, అది మీరు కొంటారా?" అని అడిగాడు. పున్నారావు కొంచెం తటపటాయించాడు. వెలచూశాడు. అర్ధరూపాయి. అబ్బో! అర్ధరూపాయ్! వెధవది, చదవటానికి— లేక చూడటానికి— అర్ధగంట కూడా పట్టదు. తరవాత ఎందుకు పనికొస్తుందీ! శుద్ధ దండగ. పొట్లాలు కట్టటానిక్కూడా పనికిరావు ఆ పేజీలు—చిన్నచిన్నవి. పున్నారావుకి కొనటానికి అంత ఇష్టం కలగలేదు. మిగతా పేజీలు గబగబా తిప్పుతూ: "చూస్తున్నానండీ, బావుంటే తీసుకుంటాను", అన్నాడు కొంచెం గొప్పగా. అయితే ఆ షాపుయజమాని పున్నారావు గొప్పతనం ఇత్యాదులు ఏమీ లెక్కచెయ్యకుండా, అతడు ఏమనుకుంటాడోనని ఆలోచించనుకూడా ఆలోచించకుండా కాస్త కటువుగా కూడా అన్నాడు: "అలా చూడడానికి వీల్లేదండీ." పున్నారావుకి అభిమానం ముంచుకొచ్చింది. ఎంతమాటన్నాడు. తన కొట్లో కాతాదార్లతో ఇలాగే ప్రవర్తిస్తున్నాడా? వొచ్చినవాళ్ళందర్నీ మర్యాదగా

పరామర్శించి, ఏంకావాలో కనుక్కొని, వాళ్ళు వొద్దన్న కొద్దీ బలవంతాన వస్తువుల రకాలన్నీ చూపించి ఎంత మర్యాదగా ప్రవర్తిస్తాడు! మీరు కొంటేనే చూడండి, లేక పోతే వస్తువు ముట్టుకోటానికికూడా వీల్లేదని తను ఎప్పుడైనా అన్నాడా? వ్యాపారానికి కావలిసింది ముఖ్యంగా వినయ విధేయతలని ఈ పెద్దమనిషికి తెలియదేం! ఎంతమాట అనే శాడు. తన ముప్పైఏళ్ళ జీవితంలో ఎప్పుడూ, ఎవరిచేతా పడనిమాట! రోషం ముఖంలోకి చిమ్మింది. అర్ధరూపాయి విసిరి అతని ముఖాన కొట్టాలనిపించింది. కాని పున్నారావుకి మొదటినించీ లభించిన తరిఫీదు అందుకు భిన్నప్రకృతి గలది. తమాయించుకున్నాడు. దర్జాగా జేబులోంచి అర్ధరూపాయి తీసి అతనివైపుకూడా చూపకుండా—అన్నట్టు అర్ధరూపాయి తనదగ్గర లేదు. రూపాయినోటు తీసి—అతనివైపుకి నిర్లక్ష్యంగా గిరవాటు వేసి పుస్తకం పేజీలు తిప్పుతుంటే ఆ షాపు యజమానికి తలకొట్టేసినట్టుండదూ? పున్నారావు ఇంచుమించు అలాగే చెయ్యబోయాడు కాని చివరిక్షణంలో అతనిబుద్ధి మళ్ళింది. అర్ధరూపాయి! పుస్తకం చదివేసింతరవాత— అంటే ఓ అరగంట తరవాత—అప్పుడుగాని తనకి తెలియదు, తను చెయ్యబోయే తెలివితక్కువ పనిలోని తొందరపాటు. ఆ అర్ధరూపాయే ఉంటే జట్కాబండి కిరాయికైనా అక్కరకొస్తుంది. పుస్తకం ఏం ఉద్ధరించను!

పున్నారావు ముఖంచిట్లించి—పూర్తిగా ఇష్టంలేక పోయినా, ఆ బొమ్మల్ని ఇంకా చాలాసేపు చూడాలని పిస్తున్నా, ముందు పేజీల్లో ఏలాంటి బొమ్మలూ, విషయాలూ

ఉన్నాయో చూడాలనిపిస్తున్నా—బలవంతంగా, వెధవ పుస్తకం, ఇందులో ఏముంది. అన్నట్టుగా అలా చేతుల్లోంచి వొదిలేశాడు.

అంత అవమానం పొందిన తరవాత, అది దిగమింగుకుని ఇంకా ఆ పుస్తకాల కొట్టుముందు నిలబడటం సబబు కాదు గనుక పున్నారావు వెంటనే అక్కణ్ణించి కదిలి అడుగు వేశాడు. జరిగింది తలుచుకుని దాన్ని గురించి ఆలోచించటం మనసుకి ఆరోగ్యకరం కాదుగనుక పున్నారావు ఆ విషయం వెంటనే మర్చిపోయేందుకు వీలుగా మరోసంగతి మీదికి మనసు తిప్పాడు. ఇందాక జేబులో చెయ్యిపెట్టి చూసుకుంటే చిల్లర తగల్లేదు. లేదన్నమాట. పోర్టర్‌కి డబ్బివ్వాలసి ఉంటుంది తరవాత. అతని దగ్గర ఉంటుందో ఉండదో చిల్లర. లేకపోతే ఇబ్బంది. ఇప్పుడే మార్చుకుని దగ్గరుంచుకోటం ఉత్తమం. టీ షాపులో చిల్లర అడిగాడు. "తక్కువగా ఉందండీ", అని ఆముదం తాగిన ముఖం పెట్టాడతడు. మిఠాయి, పళ్ళు, కిల్లీలు వగైరా సరుకులమ్మే స్టాల్‌లో అడిగాడు. అతడు, పనిపెట్టుకు ఊరికే చిల్లర ఇవ్వటం వ్యాపార లక్షణం కాదన్నట్టుగా "ఏమైనా తీసుకోండి," అన్నాడు నిరుత్సాహమాటంగా. ఓ అణా పెట్టి కిల్లీ వేసుకోవచ్చు ననిపించింది పున్నారావుకి. కాని అదేమంత అవసరం లేదు. రెండు వక్కపొడి పొట్లాలు కొనొచ్చు. కాని ఎందుకీ అక్కర్లేని కొనుగోలు! అణా ఉంటే పేపరు కొనుక్కోవచ్చు, రేపుపొద్దున. లేకపోతే, ఇంకో అణా వేసుకుంటే బెజవాడలో కాఫీ తాగొచ్చు, లేకపోతే పోర్టర్

కివ్వటానికి సరిపోతుంది. ఎలాగో ఆ పోర్టరే సంపాదించు కొస్తాడులే చిల్లర — అనుకుని పున్నారావు "అక్కర్లేదులే" అనేసి ఆ కొట్టు దగ్గర్నించి వొచ్చేశాడు.

ఎక్స్‌ప్రెస్ వాయిదాకైంకి వొచ్చేసింది. పున్నారావుని 'జనతా, ఇంటరా, బాబు?' అని అడిగి మూడో తరగతేనని సమాధానం పొంది పోర్టర్ పున్నారావు తాలూకు బరువు నెత్తిమీద పెట్టుకుని పరుగుతీశాడు. అతని అడుగుజాడల్లో పున్నారావు బయలుదేరి ఎలాగో ఓ కంపార్ట్‌మెంట్‌లో సామాన్లతోసహా తన శరీరాన్ని తోసేసి, ఒక క్షణం గట్టిగా ఊపిరితీసుకుంటున్న సమయంలో "టైమైంది బాబూ, బిగిల్ ఊదారు", అని హెచ్చరించాడు పోర్టర్. పున్నారావు జేబులోంచి రూపాయినోటు తీసి పట్టుకుని, "చిల్లరియ్యి" అన్నాడు. పోర్టర్ కొంచెం గాభరాపడి 'లేదు బాబూ–' అని, ఐనా నమ్మకం కలగటానికి జేబులో చిల్లరతీసి అరచేతిలో పరిచి లెక్కపెట్టి "ఆరణాలే ఉంది బాబూ", అన్నాడు.

పున్నారావు అతని మెత్తదనం చూసి ఇద్దరూ మెత్తగా ఉండటం వ్యవహార పరిష్కార సాధనకి పనికిరాదని "ఎలామరి, ఎలాగోచూడు, త్వరగా", అన్నాడు. పోర్టర్ హడావిడిగా నలుగుర్నైదుగుర్ని అడిగాడు. టైం ఐపోతోంది. చిల్లర దొరకలేదు. అతని ఆదుర్దా చూస్తే పున్నారావుకి జాలేసింది.

కాని ఏంచేయాలి? జండా ఊపాడు గార్డు. ఇంజన్ అరిచింది. ఇప్పుడు పున్నారావుకి గాభరా పుట్టింది. అతనికి

పోర్టర్ కివ్వాలిసిన రెండణాలు ఎగ్గొట్టాలని ఏకోశానా లేదు. అలాంటి అన్యాయాలు తను ఇంతవరకూ ఎరగడు. ఇంతలో పత్రికల కుర్రాడు 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ', సార్ అని కేకేశాడు. పోర్టరు ఆకుర్రాడిని అడిగాడు. అతనిదగ్గర నాలుగణాలు మాత్రం ఉన్నాయి. పున్నారావుకి ఆలోచించటానికి వ్యవధి లేదు. రైలు కదిలింది. వెంటనే అతడు వీక్లీ తీసుకుని, మిగతా చిల్లరలో రెండణాలు పోర్టరు కిచ్చేశాడు. పోర్టర్ కృతజ్ఞతతో ఊరికే ధర్మం తీసుకున్నట్టుగా ఫీలయినట్టు ముఖంపెట్టి వెళ్ళిపోయాడు.

పున్నారావు చేతుల్లో "వీక్లీ" చూసి ఇద్దరు కాలేజీ స్టూడెంట్లు తమదగ్గర అతనికి స్థానం ఇవ్వటానికి అభ్యంతరం పెట్టకపోవటంవల్ల, సులభంగానే కూచోటానికి స్థలం దొరకటంచేత పున్నారావు కుదురుగా కూచుని పత్రిక అట్టమీద తన పేరు ఇంగ్లీషులో దర్జాగా రాసి, పేజీలు తిప్పసాగాడు. బొమ్మలైతే ఏవేవో పెద్దపెద్దవీ, రంగు రంగులవీ ఉన్నాయి గాని వాటికింద రాసిన అక్షరాలు పున్నారావుకి అంతగా కొరుకుడుపడలేదు. తన ఫిఫ్త్‌ఫారం ప్రమాణం చదువు ఈ విషయంలో ఎందుకూ కొరగాదని పున్నారావు తెలుసుకున్నాడు. ముప్పావలా పెట్టి కొన్నాడు. అతని గుండెలు గుభేలుమంది. ఆ పత్రిక పట్టుకున్న చేతులు వొణకసాగాయి. ఏం చేసుకునేట్టు! అందులోని ఒక్క మాటా తనకి అర్థం కాదు. పదిహేనేళ్ళకిందట ఇంగ్లీషుపుస్తకం పట్టుకుంటే మామూలుగా వొచ్చే తలనొప్పి యిప్పుడు తిరగబెడుతోంది. బుద్ధిపూర్వకంగా కొన్నాడు. కొనేప్పుడు తనకి స్పష్టంగా

తెలుసు—అది ఇంగ్లీషు పత్రిక అనీ, అది తనకి పరాయిభాష అనీ. అయినా కొన్నాడు. అవసరం అలాంటిది. సరే. ఇప్పు డేమనుకునీ చేసేదిలేదు. కాని—ఆ సినిమా పత్రికకొన్నా బాగుండిపోయేది. అది ఈ కుర్రాడు ఎందుకు అమ్మకూడదు! ఆ సినిమా పత్రికే కొంటే—అటు ఆ షాపులోని పెద్ద మనిషికి బుద్ధి చెప్పినట్లూ ఉండేది, తన కోరికా తీరేది! పొరపాటయిపోయింది. పోనీ, తను ఒక్క అణాకోసం లోభిం చాడుగానీ, ఓ కిల్లీ కొంటే సరిపోయేది గాదూ? తను ఇంత తెలివితక్కువగా ఎలా ప్రవర్తించాడు?

పున్నారావు గతాన్నిగురించి ఇలా విచారిస్తూండ టంతో ప్రస్తుతం తన చేతిలోని పుస్తకం సంగతి మర్చిపోయి, అప్రయత్నంగా దాన్ని మూసేశాడు. ఆ సమయంకోసమే కనిపెట్టుకు కూచున్న కాలేజీ కుర్రాళ్లు పున్నారావుపట్ల చాలా గౌరవం చూపిస్తూ, ఓసారి ఆ పత్రిక తాము చూడ టానికి వీలవుతుందా అని అడిగారు. పున్నారావు వెంటనే ఇచ్చేశాడు ఉదారంగా_తన కిప్పుడు చదవటానికి ఎలాగూ తీరిక లేదన్నట్టుగా.

పున్నారావుకి ఆ పత్రిక రాను రాను ఓ సమస్య ఐపోయింది. దాన్ని చూస్తుంటే అతనికి భయంకూడా వెయ్య సాగింది. కొంపదీసి, తనని ఎరిగున్నవాళ్లు తన దగ్గర ఆ పత్రిక ఉండటం చూస్తే...

"ఏరోయ్, పున్నారావ్_ఇంగ్లీషుపత్రిక కొన్నావే!" అని ఎవరూ అనలేదుగాని_అన్నట్టే పున్నారావు ఉలిక్కి పడ్డాడు. పెట్టెఅంతా కలయచూశాడు. ఎవరూ తనకి

తెలిసినవాళ్లు లేరు. రక్షించారు. కాని రైలు దిగగానే ఎవరో తారసపడక మానరు. ఈ కాలేజీకుర్రాళ్ళముందే అలా ఎవరైనా తనని ప్రశ్నిస్తే... ఆ క్షణంలో పున్నారావు అనుకున్నాడు—ఈ కుర్రాళ్ళు ఈ పత్రిక కొట్టేస్తే బావుండునని. ఇంతలో నవ్వులు గలగలా వినిపిస్తే తలెత్తిచూశాడు. ఆ కుర్రాళ్ళిద్దరూ నవ్వుతున్నారు. తనని చూసి కాదుగదా అనుకున్నాడు పున్నారావు. కాదు. వాళ్ళు అందులోని హాస్యాన్ని దేన్నిగురించో నవ్వుతున్నారు. వాళ్ళలోవాళ్లు మెచ్చుకుంటున్నారు. తను ఆనందించగల పరిస్థితిలో లేనందుకు విచారించాడు. న్యాయంగా అలా ఆనందించగల హక్కు మొదట తనది. తనకి ఆ భాష వచ్చిఏడవదు. పోనీ, వాళ్ళని కనుక్కుంటే—కొంతైనా తృప్తి. కాని అలా అడగటానికి మనస్కరించలేదు పున్నారావుకి. వాళ్ళ నవ్వులు ఎక్కువ అవుతున్నకొద్దీ పున్నారావుకి వొళ్లు మండిపోయింది. తనకేదో దురన్యాయం జరుగుతూన్నట్టుగా అతడు బాధపడసాగాడు. తన డబ్బుతో వాళ్లు అన్యాయంగా తనకి దక్కనియ్యకుండా తన హక్కుల్ని భంగపరిచి ఆనందిస్తున్నారు. వాళ్ళసౌఖ్యానికి, వాళ్ళ సంతోషానికి తను డబ్బు పెట్టుబడి పెట్టాడు. వాళ్ళకి రైల్లో ఏమీ తోచదని తను వాళ్ళకి పత్రిక కొనిపెట్టినట్టుగా_తను కావలసింది కొనుక్కోకుండా_ ఫీలయాడు. పున్నారావులో ఏవో భావాలు పుట్టిపెరిగాయి. తను ఇక్కడ నానాబాధపడుతూ, వాళ్ళని తన ఖర్చుతో ఎందుకు సంతోషపెట్టాలో అతనికి అర్థంకాలేదు. ఆ కోపతాపావేశాల్లో కొంచెం కటువుగా అడిగాడు: "ఆ పత్రిక

చూడటం అయితే ఇస్తారా ఓసారి?" ఆ కుర్రాళ్ళిద్దరూ కొంచెంసేపు ఆశ్చర్యపోయి, తరవాత కాసేపు పశ్చాత్తాప పడి, తరవాత కాసేపు కోపం తెచ్చుకుని ఇచ్చేశారు పున్నారావుకి పత్రికని. అయితే పున్నారావుకి వెంటనే ఓ సమస్య ఎదురయింది. కొంచెం అనాలోచితంగానే ప్రవర్తించాడని చెప్పాలి. వాళ్ళు చదువుతున్న పత్రికని అలా అర్థంతరంగా అడిగి పుచ్చుకున్నప్పుడు దానిభావం ఆ పత్రిక తను చదవాలిసి ఉంటుందని ఆ పరిస్థితుల్లో అర్థమవు తుంది అందరికీ. అయినప్పుడు తను చదవకపోతే మహా మోటుగా ఉండక తప్పదు. పున్నారావు చచ్చినట్టు పేజీలు తిరగెయ్య సాగాడు. పేజీలు తిరగేస్తుంటే అతనికి కడుపులో దేవినట్టవుతోంది. మువ్వావలా దీనికి తగలేసే బదులు ఆ పోర్టర్‌కి రూపాయిచ్చి ఆరణాలు తీసుకుంటే ఎంత బావుం డేది. ఏదో బీదవాడికి సహాయం చేసినట్టుండేది. పాపం, అత నెంత మంచివాడు, రైలు కదిలిపోతున్నా ఆదుర్దాపడ్డాడే గాని, విదిలించి ఒక్క మాటకూడా అనలేదు. అతన్ని చూస్తే తనకి జాలేసింది. తనకి అప్పుడెందుకు తోచలేదు! తనెందుకు అన్ని పొరపాట్లు చేశాడు. తనకి బుర్ర పనిచెయ్యటంలేదు. తనలో ధార్మికగుణం నశించిందా? లేక అసలే లేదా? ఉంటే పోర్టర్‌కి ఎక్కువ డబ్బివ్వటానికి తనెందుకు సందే హించాలిసిన అవసరం కలుగుతుంది. సందేహమేమిటి? అసలా ఆలోచనే కలగలేదు తనకి. చూస్తూచూస్తూ ఎవరూ ఎవరికి ఊరికే డబ్బివ్వరు. నిజం—కాని ఇంచుమించు ఊరికే పారెయ్యటంకంటె పోర్టర్‌కిస్తే ధర్మంచేసిన తృప్తి తనకీ,

నాలుగు డబ్బులు దక్కిన సంతోషం అతనికీ ఉండేవి. డబ్బు గల ఈ కాలేజీకుర్రాళ్ళ సంతోషానికి పెట్టుబడి పెట్టటంకంటే ఆ బీదవాడికిస్తే తనకి తృప్తిగా ఉండేది.

పున్నారావు ఆలోచనలకి అంతరాయం కలిగింది. ఊరికే పత్రిక పేజీలు తిప్పుతున్న అతన్ని చూసి కుర్రాళ్ళలో ఒకడు అడిగాడు "వీక్లీ ఫీచర్సలో ముందు మీరేం చదువుతారండీ ?"

యథాలాపంగా, ఏదో అభిరుచి కొద్ది ఆ ప్రశ్న వెయ్యబడ్డా, పున్నారావుకి మటుకు గాలంగుచ్చుకున్నట్టయింది. ఆ ప్రశ్నలోని ఇంగ్లీషుమాట—ఫీచర్స—అంటే ఏమిటో పున్నారావుకి తెలియలేదు. ముప్పావలా పోయిందని అసలే తను దిగులుగా ఉంటే ఈ కుర్రాళ్లు తన మనసుని మరింత పాడుచేస్తున్నారు. పున్నారావు కొంచెం విసుగ్గా ఉన్నట్టు తెలియచేస్తూ అన్నాడు. "ఆఁ. ఏదో-అన్నీ ఒకటేలెండి... ఏదో తోచక చదవటమే." తరవాత ఆ కుర్రాళ్లు వాళ్ళలో వాళ్ళే పత్రికలోని 'ఫీచర్స' గురించి మాట్లాడుకోసాగారు.

పున్నారావు పరిస్థితిమాత్రం దుర్భరంగా ఉంది. చేతిలో పత్రిక వైపు చూస్తే అతనికేదో బరువుగా ఉంది. ఎప్పుడూ కానీ దుబారాచేసి ఎరగడు. ఒక్కసారిగా దెబ్బ తిన్నాడు. ముప్పావలా డబ్బులు ఎక్కడోపోతే అతని కంత కష్టం ఉండేది కాదు. ఆమాటకొస్తే తను ఓసారి ఒక రూపాయి—లాగు జేబుకి చిల్లుండటం వల్ల—మరోసారి టోకరాలో అర్ధరూపాయి, రెండు మూడుసార్లు చిల్లర

మార్పిడిలో, కాతాదార్లకి ఎక్కువగా పొరపాటున ఇవ్వటం వల్ల సుమారు రూపాయన్నరా పోగొట్టుకోవటం జరిగింది. అప్పుడు తాత్కాలికంగా విచారించకపోలేదుగాని ఎక్కువ సేపు మథనపడలేదు. మర్చిపోయి ఊరుకున్నాడు. కాని ఈసారి, ఆ పత్రిక అంటగట్టుకున్న బరువులా, తనని చూసి నవ్వుతున్నట్టుగా ఉంది. అది తన కళ్ళఎదుట లేకపోతే బాగుండు ననిపించింది పున్నారావుకి. ఈ ఊహ కలిగేసరికి ఎక్స్‌ప్రెస్ కృష్ణాబ్రిడ్జిమీదికి చేరుకుని హడావిడి చేస్తూ పోతోంది. పున్నారావుకి ఓ దివ్యమైన ఆలోచన కలిగింది. తల కిటికీలోంచి దూర్చి కృష్ణలోకి చూస్తూ ఆ పత్రిక నీళ్ళలోకి సూటిగా, ప్రమాదవశాత్తు జరిగినట్టుగా, వొదిలేశాడు. "కృష్ణార్పణం", అనుకుని మనసులో ఓ దణ్ణంకూడా పెట్టేశాడు. పీడ వొదిలిందని అనుకుంటూ పెట్టెలోవాళ్ళ కోసం అన్నట్టుగా, "అరెరె, పత్రిక కిందపడిపోయిందే!" అని కొద్దిగా, చాలా దూరబంధువు పోయినసంగతి తెలిసికొన్న వాడిలా, విచారించాడు. ఈ విషయం విని కాలేజీ కుర్రాళ్లు మాత్రం "ఎంతపని జరిగింది!" అన్నట్టుగా ముఖం పెట్టారు.

"పోతే పోయిందిలెండి, ఏదో ఉబుసుపోకకి కొన్నాను. అది వారం వారం తెప్పిస్తూనే ఉంటానుగనుక, ఇంటిదగ్గర ఇంకో కాపీ ఎలాగా ఉంటుంది." అనుకోకుండా పున్నారావు అద్భుతంగా కోసేశాడు. ఆ కుర్రవాళ్లు మాత్రం బలే మంచి అవకాశం పోగొట్టుకున్నట్టుగా బాధపడి, "అరె,

అయితే మాకిచ్చేసినా బాగుండి పోయేదికదండీ. మీ పేరు చెప్పుకుని కాసేపు చదువుకునేవాళ్ళం. వా స్తేరుదాకా పోవాలి", అన్నారు.

తనపేరు చెప్పుకోని...ఎంత మంచివాళ్లు! తన కామాటే తోచలేదు. పున్నారావు దిగులుగా నీళ్ళల్లో పల్టీలు కొడుతున్న పత్రికవైపు చూశాడు.

16)




# నిలువుటద్దం

తను వొచ్చి అరగంట కావొస్తోంది.

వసంత ఇంకా రాదేం? చిరాకు పడసాగాడు మూర్తి. నిమిషం గడవటం యుగంగా కనిపిస్తోందతనికి. ఫానుకింద కూర్చున్నా స్వేదబిందువులు అదృశ్యం కావటంలేదు. ముఖం తుడుచుకున్నాడు. అసలే ఎండగా వుంది. దానికితోడు ఊపిరి బిగపట్టుకు కూచున్నాడు. జీవితం అంతకీ సంబంధించిన సమస్య! నిర్ణయం కావాలి. ఏమవుతుందో!

లోపల ఏదో చప్పుడైంది. వసంత వొస్తున్నట్టుంది! మళ్ళీ ఓసారి ముఖం తుడుచుకుని ఎదురుగావున్న నిలువుటద్దంలో చూసుకున్నాడు. క్రాపు సర్దుకున్నాడు. షర్టు కాలరు సరిచేసుకున్నాడు. చిరునవ్వు అభినయించాడు. సోఫాలో చేరగిలబడి కాలుమీదకాలేసుకు కూచుని పోజు

అద్దంలో చూసుకున్నాడు. "బాగానే ఉన్నావులే, ఫరవా లేదు", అని అద్దం అభయహస్తం ఇచ్చింది.

వసంత ఇంకారాలేదు. విసుగుపుట్టింది అతనికి. ఎంత సేపు అలా కూచోటం? లేచాడు. ఏంచేయాలో తోచలేదు. గదినించి బయట మేడమీదకి వచ్చాడు. అంతగా జన సంచారం వుండే వీధి కాదది. ఏమీ తోచలేదు. మళ్ళీ గదిలోకి వొచ్చాడు. పచారుచెయ్యటం ప్రారంభించాడు. కాని చప్పుడుకి వసంత ఏమైనా అనుకుంటుందేమోనని చప్పున ఆగాడు. షెల్ఫులోనించి ఓ పుస్తకం తీసుకుని మళ్ళీ సోఫాలో కూలబడ్డాడు. చదవ బుద్ధిపుట్టలేదు. ఉబుసుపోకకి పేజీలు తిప్పాడు. ఏదో కాగితం కిందపడ్డది, తీశాడు. ఉత్తరంలా వుంది. తనకెందు కనుకుంటూనే అదేమిటో చూశాడు. ముచ్చెమటలు పోశాయి. ప్రేమలేఖ. ఎవరో? ఒకక్షణం అతనికి కళ్ళు తిరిగాయి. భవిష్యత్తు చీకటిగా కనిపించింది. మరికాసేపటికి అతనికి పరిస్థితి కొద్దిగా అవగతమయింది. వసంతని తనుకాక ఇంకెవరో ప్రేమిస్తున్నా రనేది రూఢి. తన కావిషయంగురించి పూర్వంవున్న అను మానం ఇప్పుడు బలపడ్డది. అతని ముఖం ఎర్రబడ్డది. వసంత ఆ ఉత్తరాన్ని చింపి పారేయకుండా అలా పుస్తకంలో దాచి వుంచటం అతనికి గుండెల్లో శైల్యం పరుగెత్తించింది. అంటే ఆమె ఆప్రేమికుడు ఎవరినో నిర్లక్ష్యం చెయ్యటంలేదని స్పష్టం. మూర్తికి ముఖం జేవురించింది. కొంపతీసి వాడే ఆమె ప్రేమకి పాత్రుడు కాడుకదా! అతని ముఖంలో ఈర్ష్య తాండవించింది. దైన్యం మూర్తీభవించింది. నిస్పృహా

ఆవరించింది. సర్వస్వం పోగొట్టుకున్నవాడిలాగా సోఫాకి చేరగిలబడ్డాడు.

ఎదురుగా వున్న నిలువుటద్దంలోకి శూన్యంగా చూశాడు. తటాలున అతడు ముందుకు వంగాడు.

"ఎందుకా వెధవ ఏడుపు?"

ఈ మాటలు ఎవరూ అనలేదు. కాని ఎవరో అన్నట్టుగా అతనికి అనుభూతి కలిగింది. తనమీద తనకే ఏవగింపు కలిగింది. 'ఛీ', అనుకున్నాడు. ఒకక్షణంలో అతనిలో అంతకిపూర్వం కలిగిన భావసంచలనం అదృశ్యమైంది.

ఆ ఉత్తరాన్ని మామూలు తెల్లకాగితంగా చూశాడు. మళ్ళీ దానిని పుస్తకంలో పెట్టేశాడు. ఒకవేళ వసంత ఆ ఉత్తరం రాసిన అతన్నే ప్రేమించేట్టయితే తను చేసేదేమీ లేదు. అదృష్టం అతన్ని వరించిందన్నమాట. ఈర్ష్యపడటం తెలివితక్కువ. కాని అలా జరక్కుండా తనేమైనా చెయ్యగలడా? అంటే అతనికంటే తన ఆధిక్యత రుజువుచేసుకోగలడా? మూర్తి ఆలోచించాడు. వసంతకి చెప్పాలి. ఎంతో నైపుణ్యంతో అనుభూతి అందిస్తున్నట్టుగా చెప్పాలి. నిజాయితీ పుట్టిపడేలా చెప్పాలి. తను ఆమెని హృదయ నైర్మల్యంతో ప్రేమిస్తున్నాడు. హృదయాధిదేవతగా ఆరాధిస్తున్నాడు. "ఇది నిజం", అని ఆమె నమ్మాలి. నమ్మి తీరాలి. అలా తను చెప్పగలగాలి. ఆమె లేకపోతే తన జీవితం అంధకారసదృశం అని ఆమె తెలుసుకోగలగాలి. ఎలా! మాటలతో ఏమీ లాభంలేదు. ముఖంలో ఈ

భావాలు ప్రస్ఫుటంకావాలి. దైన్యం, అసహాయత, ప్రేమ, ఆశ, నిరాశ ఇవన్నీ తాండవించాలి.

మూర్తి ముఖం అద్దంలో చూసుకున్నాడు. మళ్ళీ, మళ్ళీ చూసుకున్నాడు. మూర్తీభవించిన దీనత్వంలా ఉంటే గాని ఆమె కరుణించదు. అలా...మధ్య యుగంలోని ఇంగ్లీషు హీరోలు మోకాళ్ళమీద నుంచుని ప్రాధేయపడటం అతనికి జ్ఞాపకం వొచ్చింది. ఇంచుమించు అలా—అంతే...

"ఏమిటా వెధవ మొహం ?

మూర్తికి వీపుమీద కొరడాతో కొట్టినట్టయింది. తటాలున ముఖభంగిమలు అదృశ్యమయాయి. సోఫాలో మామూలుగా కూర్చున్నాడు.

తలుపు చప్పుడైంది. అతృతగా అటువైపు చూశాడు. కర్టన్ తొలగింది."

"చాలాసేపైనట్టుంది, వచ్చి ?"

అంత ఎక్కువసేపు కాలేదని మాట వరసగా అనాలని అస్పష్టంగా గొణిగాడు మూర్తి. కనీసం ఇప్పటికైనా దర్శనం కలిగింది ! ఒకక్షణం అటూ ఇటూ చూసి ఆమె ముఖంలోకి చూశా డతను. కొంపకూలింది! ఆమె తన చేతిలో పుస్తకంవైపు చూస్తోంది. ఎంత మతిమాలిన పని చేశాడు! అతడు తనవైపు చూడటంతో వసంత దృష్టి మళ్ళించింది. ఆమెకు కోపం తెప్పించానని అతడు మథనపడటం ప్రారంభించాడు. ఇవాళ అన్నీ తెలివితక్కువపనులే చేస్తున్నాడు.

వసంత తాపీగా కుర్చీలో కూర్చుని అంది. "పుస్తకం తిరగేస్తూ కూర్చున్నట్టున్నారు!"

అసలు పుస్తకం పేజీలు తిప్పలేదని అందామను కున్నాడు. కాని అనలేకపోయాడు. అంతేమట్టుకు ఆమె నమ్ముద్దూ? పైగా అబద్ధాలకోరనే వాదు కొనితెచ్చు కోటం అవుతుంది. "ఊ," నసిగాడు.

కొన్నిక్షణాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి. వసంత ఏదో పత్రిక పేజీలు తిప్పుతోంది. ఆమె వైఖరిచూస్తే ఇహ ఆశపెట్టుకోటం అనవసరం అనుకోవొచ్చల్లేనే వుంది! తనంటే ఏమాత్రం లక్ష్యం వున్నట్టు ప్రవర్తించటంలేదు. అయినా చివరిదాకా ప్రయత్నం చెయ్యకతప్పదు.

"నేను వొచ్చినపని మీకు తెలుసనుకుంటాను."

"చెప్పందే ఎలా తెలుస్తుంది ?"

"ఊహించివుంటా రనుకుంటాను."

"ఏదో ముఖ్యవిషయం మాట్లాడా లన్నారు."

మూర్తి ఉపోద్ఘాతం విరమించాడు. సూటిగా చెప్పాడు రెండుముక్కల్లో. తమ పరిచయంవల్ల తనకి ఆమె మీద ప్రేమ కలిగిందనీ, ఆమె ఒప్పుకుంటుందని ఆశిస్తు న్నాననీ.

వసంత ఏమీ మాట్లాడలేదు. ఆమె ముఖంలో మటుకు అతనికి కొంచెం ఆశ్చర్యం కనిపించింది. అదే అతనికి అర్థం కాలేదు. ఈ పరిస్థితి వొస్తుందని ఆమె ఊహించలేదను కోటం కల్ల. అతనామెవైపు ఆదుర్దాగా చూశాడు. వసంత

మూర్తివైపు ఓసారిచూసి తరవాత అతనిచేతిలో పుస్తకం వైపు చూసింది. ఎంతసేపటికీ ఆమె మాట్లాడలేదు. ఆ పుస్తకం అలా చూడటంతో మూర్తికి ఒళ్లుమండింది. అతన్ని అపహాస్యం చేస్తూన్నట్టుగా ఫీలయాడు. ఏమిటి ఆమె అభిప్రాయం?

"మీ అభిప్రాయం నిర్మొహమాటంగా చెప్పొచ్చు."

అయినా ఆమె మాట్లాడలేదు. దిక్కులు చూడటం మళ్ళీ ఆ పుస్తకంవైపు చూడటం—మూర్తి ఉండబట్టలేక పోయాడు. కసిగా అన్నాడు:

"ఈ పుస్తకంలో ఉత్తరం నేను చూశాను. క్షమించాలి, యథాలాపంగా చూశాను. రహస్యం అనుకోలేదు."

వసంత ఒక్కక్షణం ఆగి అంది.

"అయితే, సరే."

ఏమిటామె వుద్దేశం? మూర్తి యిహ ప్రశ్నలేమీ అడగదలుచుకోలేదు. అతనిలో సహనం చచ్చిపోయింది. ఆమె ప్రవర్తన నిర్లక్ష్యభావం చూసి అతనికి అరికాలిమంట నెత్తికెక్కింది. పుస్తకం ఆమె ముఖంమీద విసిరికొట్టాలని బలీయంగా అనిపించింది. కాని తమాయించుకున్నాడు. వెంటనే అక్కడినించి వెళ్ళిపోటం శ్రేయస్కరం అనుకుని లేచాడు.

"వెడుతున్నారా?"

"ఊఁ"

"ఉండండి. కొంచెం షర్బత్ తీసుకుని వెడుదురుగాని."

ఆమె ఆమాటలు మామూలుగానే అంది. కాని మూర్తికి వెటకారంగా వినిపించాయి. వసంతలో యింత నైచ్యం, ఇంత దురహంకారం ఉన్నాయని తనెప్పుడూ అనుకోలేదు. తనని కీలుబొమ్మని ఆడించినట్టు ఆడిస్తోంది. మోసపోయాడు. అహంభావంతో యిన్నాళ్ళూ తనచుట్టూ తిప్పించుకుంది. తను మహా అందగత్తె అని గర్వం. అందం వుంటే వుండొచ్చు. కాని అంత మిడిసిపాటు దేనికి ? అందంతో తనలాంటివాళ్ళని ఉసిగొలిపి చివరికి ఎందుకూ పనికిరాని వాళ్ళనిగా, భగ్నహృదయులుగా చేస్తే ఆమెకి ఒరిగేదేమిటి ? తనలాంటివాళ్లు తలుచుకుంటే... మూర్తి తనని తను మర్చిపోయాడు. ఉక్రోషంతో సర్వం మర్చిపోయాడు. వసంత పర్బత్తు కలపటంలో నిమగ్నురాలయింది. ఆమెవైపు మత్తెక్కిన కళ్ళతో చూశాడు. నఖశిఖపర్యంతం చూశాడు. ఒక అడుగు ముందుకు వేశాడు...సమీపిస్తున్నాడు...ఒక్కసారి చుట్టూ చూశాడు. అరె! ఎవరిదా ముఖం? భీకరంగా, పైశాచికంగా, నెత్తురులా ఎర్రగా... మూర్తి అదిరి పడ్డాడు. ఆ ముఖం. ఒకక్షణం గుండె ఆగిపోయినట్టనిపించిం దతనికి. ఆ పైశాచిక వదనం! ...కాదు, కాదు... మనిషే! అమ్మయ్య. మూర్తికి మనసు మనసులో లేదు. తటాలున అతనికి పరిస్థితి అర్థమైంది. గిరుక్కున వెనక్కి తిరిగాడు.

వసంత పర్బత్ కలిపి వెనక్కి తిరిగి చూసింది. మూర్తిలేడు. ఎదురుగా నిలువుటద్దంలో కనిపించింది— మూర్తి గబగబా వెళ్ళిపోతున్నాడు.

"మూర్తిగారూ",

అతడు వినివించుకునే స్థితిలోలేడు. బుజంమీద చెయ్యి పడ్డది. వసంత! అతని ముఖం వివర్ణమౌతోంది.

"అంతకోపమైతే ఎలా?

అతడు సమాధానం చెప్పే స్థితిలోలేడు.

"రండి",

వెనక్కి తిరిగితే—!

రుమాలు అడ్డం పెట్టుకుని అప్రయత్నంగా నడిచాడు మళ్ళీ గదిలోకి. ఎదురుగా నిలువుటద్దంలో—పాలిపోయిన ముఖం. పక్కన సహజసుందర వదనారవిందం.

"లైఫ్‌సైజ్ ఫొటోలా వుందికదూ !"

ఒకక్షణం అతనికి వసంతమాటలు అర్థంకాలేదు. తరవాత ఆమెవైపు అనుమానంగా చూశాడు. ఆమె చిరునవ్వు నవ్వింది.

"ఆ వుత్తరం శుద్ధకల్పితం. మిమ్మల్ని పరీక్షించటానికి నేనేరాశాను. నేనురావటం ఆలస్యంచేస్తే మీ రా పుస్తకం తీస్తారని నాకు తెలుసు. ఎంత నిబ్బరమండీ మీకు! పల్లెత్తుమాట అనలేదు. ఈర్ష్యపడలేదు. నిందమోపలేదు. ప్రాధేయపడలేదు. కాని ఎంత నిరాశపడ్డారో మీ ముఖం చూస్తేనే తెలుస్తోంది. మీ వ్యక్తిత్వాన్నిలా పరీక్షించినందుకు క్షమించరూ ?

ఏమిటేమిటో అంటోంది, వసంత. అద్దంలో ఇద్దరిని చూసి మందంగా నవ్వాడు మూర్తి. కాని అతనికా అద్దమే ముసిముసిగా నవ్వినట్టనిపించింది.




# "జంగమా హేమవల్లీ"

బొటానిస్టు ఆర్. ఆర్. మర్లా ఉన్నట్టుండి ఒక్కసారి గట్టిగా నవ్వేశాడు, విజయసూచకంగా.

"ప్రకృతిమీద మొదటి విజయం సాధించాను, లతా." నవ్వుకు కారణం తెలుసుకోటానికి తలెత్తిచూసిన లత కారణం తెలుసుకునికూడా, ఏమీ అర్థం కానట్టుగానో, అర్థమైనాకూడా తెలుసుకున్న విషయంలో అభిరుచి లేనట్టుగానో చూస్తూనేఉంది అతనివైపు.

"పట్టుదల ఉండాలేగాని ప్రకృతి రహస్యాలు మనుషులకి పట్టుబడకపోవు. ఏమంటావు, లతా?" తల నిలువుగా ఆడించింది లత కళ్ళప్పగించి చూస్తూనే.

"రెండు సంవత్సరాలనించీ చేస్తున్న పరిశోధన ఇవాళ ఫలించింది."

ఆర్. ఆర్. మర్లా ఉత్సాహంతో చేతుల్లోని నెగటివ్ రీలువైపు తృప్తిగా చూస్తూ అన్నాడు.

ఈ విషయంలో లత ఏమీ ఉత్సాహం చూపించ లేదు. ఆ విషయం బొటానిస్టు గమనించే పరిస్థితిలో లేడు.

"ఈ పరిశోధనల గొడవ అయినట్టేనా ఇవాళ్టితో?"

"మొక్కల పెరుగుదలని గురించి అమూల్యమైన విష యాలు కనిపెట్టబోతున్నాను. ఇంకా కొన్ని ఫొటోలు తీస్తే ఒక అధ్యాయం ముగిసినట్టే."

సరిగా ఊహించినట్టే వొచ్చింది జవాబు. ఒక అధ్యాయమట !

"సాయంత్రంలోపల ఇంకా కొన్ని ఫొటోలు తయారు కావాలి. అవి ఐతే కాని నా పరిశోధనలో మొదటిభాగం పూర్తికాదు. ఇంతవరకు ఫలితాలు నాకు అనుగుణంగానే ఉన్నాయి. పరిశోధన తప్పక అనుకూలంగానే పరిణమిస్తుం దని నాకు గట్టి నమ్మకం ఉంది."

కేమెరా సర్దుతూ తన ధోరణిలో చెప్పుకుపోతున్నాడు బొటానిస్టు. ఆ మాటలు ఎవరూ వినటంలేదని అతనికేం తెలుసు !

"జీవితమంతా ఈ లేబరేటరీలోనేనా గడపటం?" చిరాకు, కోపం, అసహనం, నిస్పృహ అన్నీ ప్రతిబింబించేలా అంది లత.

సమాధానం చెప్పటం అనవసరం అనుకొని బొటానిస్టు చిన్నగా నవ్వాడు.

"పెళ్ళి కాగానే ఇంగ్లండు ప్రయాణం, ఇంగ్లండు నించి రాగానే ఈ లేబరేటరీ—బాగానే ఉంది. తిండీ, ఉద్యోగం, పడకా అన్నీ ఇక్కడే. ఇంట్లో మనుషులున్నారనిగాని, కాస్త మాటామంచీ అడగాలనిగానీ ఏమైనా ఉంటేనా? ఈ మొక్కల్లో ఒక మొక్కల్లే బతకటం నాచేత కాదు", తీక్షణంగా అంది లత.

"లతా, నీపేరులో మొదటి రెండు అక్షరాలు ఎందుకు కొట్టేశానని నీ అభిప్రాయం?"

ఆమె చిరాగ్గా చూసిం దతనివైపు.

"భూమినించి పైకి వొచ్చింది మొదలు సుకుమారమైన లత చిన్నచిన్న ఆకులు తొడుగుతూ అందంగా మనోహరంగా ప్రతినిత్యమూ పెరుగుతూ చక్కని పూలు పూస్తుంది. ఈ క్రమవికాసం లత కెలా వొస్తుందో అలా నా 'స్వర్ణలత'కీ రావాలి. స్వర్ణలత పెరగదు. అందుకనే మొదటి రెండక్షరాలూ తీసేశాను."

ఆర్. ఆర్. మళ్లా ప్రతిభావంతమైన తన ఉపన్యాసానికి తనలోనే గర్వపడి మళ్ళీ కొనసాగించాడు.

"అసలు విజ్ఞానం అంటే ఏమిటి? ప్రకృతి రహస్యాలు తెలుసుకోటం. అలా తెలుసుకునేలా చేయగలిగిందే విద్య. ప్రకృతి రహస్యాలు తెలుసుకోటానికి నేను ప్రకృతిలో లీనమైపోతున్నాను. ప్రకృతిలో సంపూర్ణంగా లీనం కాగలిగిననాడే ప్రకృతిని నేను అర్థం చేసుకోగలను. ఉన్న ఆస్తంతా అమ్మి ఈ బొటానికల్ గార్డెన్సు వేసిందీ, ఈ లేబరేటరీ

కట్టింది పిచ్చిపట్టే అనుకున్నావా ? లతా, నీ చుట్టూవున్న ప్రకృతిలో నువ్వుకూడా ఐక్యమై ప్రకృతిని ఆరాధించకలిగితే నువ్వు నన్ను అర్థంచేసుకోగలవు. నిన్ను నువ్వు అర్థంచేసుకోగలవు. నాకు సహాయం చెయ్యగలవు. విలువైనకాలాన్ని సరిగా వినియోగించుకోగలవు. నీకు లభ్యం కావలసిన మానసిక క్రమవికాసం ఇదే. నువ్వు చదువుకున్నదానివే. ఇంతగా నీకు విప్పి చెప్పాలిసిన అవసరంలేదు. నువ్వు దారిలోనే ఉన్నావని నే నిన్నాళ్ళూ అనుకుంటున్నాను. మొక్కలలో మొక్కల్లే బతకటం నీ కిష్టం లేదన్నావు. ఈ ఒక్కొక్క మొక్క నాకెంత ప్రియతమో నువ్వు అంతే. నీతో సరిగా మాట్లాడటంలేదని కదూ నువ్వనటం? ఈ మొక్కలతో నే నెప్పుడూ మాట్లాడలేకపోయినా, ప్రతిక్షణం మాట్లాడుతూనే ఉంటాను. ఈ వాక్యం బాగా అర్థంచేసుకో. నామీద నీకున్న కోపం అంతా ఎగిరిపోతుంది."

ఆమె కోపమంతా ఎగిరిపోక తప్పదనే దృఢవిశ్వాసం వల్ల, తన ఉపన్యాసం ఆమెలో కలిగించిన మార్పు తెలుసుకోటంకోసం ఆమె ముఖభంగిమలు కనిపెట్టటం అనవసరమనుకుని బొటానిస్టు మైక్రోస్కోపుమీదికి వంగి దృష్టిసారించాడు. ఉపన్యాసం కలిగించిన నిస్పృహకి అతని నిర్లక్ష్యం తోడైనందువల్ల లత ముఖం కోపంతో మరింత ఎర్రబడ్డది.

మరికాసేపటకి పని ముగించుకుని చేతులు కడుక్కుంటూ అన్నాడు బొటానిస్టు.

"అలా బొటానికల్ జర్నల్ ఎడిటర్ దగ్గరి కెళ్తొస్తాను. ఈ పరిశోధన పూర్తికాగానే వ్యాసం రాసి ప్రకటించాలి.

అంతర్జాతీయకీర్తికి ఇదే మొదటి మెట్టు. బహుశా సాయంత్రం ఆలస్యంగా వస్తానేమో. ఈ విషయం ఎడిటర్‌తో బాగా చర్చించాలి."

మాట్లాడటం సరిగా పూర్తి కాకుండానే గుమ్మందాటి వెళ్లాడు, ఆర్. ఆర్. మల్లా. అతడు వెళ్ళినవైపే అలానే కాసేపు చూసింది లత, అంతర్జాతీయ కీర్తి! మొక్కలూ, వ్యాసాలూ, కీర్తి! ఇంతకంటె ఈయనకేం అక్కర్లేదల్లే ఉంది. రాత్రింబగళ్ళూ ఇదే ధ్యాస. మనిషిలో ఇంత స్వార్థం ఎలా కరుడు గట్టుకు పోతూంది! విసుగ్గా చుట్టూ చూసింది లత ఎమీతో చక. చుట్టూరకరకాల చిన్నచిన్న మొక్కలు. వాటి పెరుగుదల గురించి పరిశోధనలు! అవి ఎలా పెరిగితే ఎవడికొక్కావాలి ? పైగా పెద్ద పెద్ద మాటలు. ప్రకృతీ, ఐక్యం! ఆ మొక్కల్ని చూస్తే ఎక్కడలేని అసహ్యం వేసిందామెకి. తల తిప్పింది. కేమెరా, మైక్రోస్కోపూ, ట్యూబులూ, మట్టి, మశానం. వొళ్ళు మండింది లతకి. వాటిల్లో ఏ ఒక్క వస్తువూ ఉపయోగించటం తనకి చేతకాదు. అవన్నీ తనని వెక్కిరిస్తున్నాయి. వాటిమీద తన భర్తకి ఎంత అధికారముందో తనకీ అంత ఉంది. అవి ఆయనకి లోకువ. తనకికాదు.

లతకి తటాలున ఓ వింత తలపు కలిగింది. తన భర్తకి తనకంటె అవే ఎక్కువ ప్రియమైనవి. ఆ కెమెరా, ఆ మైక్రోస్కోపు, ప్రాణంలేని ఆ పదార్థాలు తనవైపు చూసి హేళనగా, ఈసడింపుగా నవ్వుతున్నాయి. దుర్భరం. సహించలేని ఆ మానసిక వేదనతో లత తటాలున శోషానించి లేచి

కోపావేశంతో స్టాండుతోసహా ఆ కేమెరాని ఎత్తి కిందపడ వేయబోయింది. కాని ఆ చర్యలోని బుద్ధిమాంద్యం వెంటనే గ్రహింపుకి రావటంవల్ల తన ప్రవర్తనకి సిగ్గుపడి కేమెరా దించేసింది. ఏదో నిస్సహాయత, ఏదో అశాంతి, అర్థంకాని అలజడితో మళ్ళీ సోఫాలో చతికిలబడి కళ్ళుమూసుకుందామె.

తల ఎవరో నిమిరారు.

కళ్ళు తెరిచి చూసింది లత. అప్రతిభురాలైంది. ఎదురుగా రంగారావు చిరునవ్వు నవ్వుతూ నుంచున్నాడు. తన భర్త ప్రియస్నేహితుడు. ఎంత ధైర్యం చేశాడు! ఏమనాలో, ఏం చెయ్యాలో ఆమెకి చప్పున తోచలేదు.

"నాకు తెలుసు స్వర్ణలతాదేవీ, మీ మానసిక బాధ నా కర్థమవుతుంది. నేను సైకో ఎనలిస్టుని. సైంటిస్ట్ మర్లాకి సున్నితమైన మానవహృదయమేం కోరుతుందో తెలీదు... ఏమిటో అంటున్నాడు రంగారావు.

పరాయి వ్యక్తి అనుకోకుండా తన తల నిమరటం, తన ప్రవర్తన చూడటం— ఈరెండు సంఘటనలూ ఒక్కమ్మడిగా లత మానసికశక్తులపై విజృంభించి ఆమెని మాట్లాడకుండా చేశాయి, కొద్దిసేపటివరకూ.

రంగారావు ఆమెవైపు పరకాయించి చూసి తటాలున ఆమెని కౌగలించుకున్నాడు. పోయిన మానసిక శక్తులన్నీ వెంటనే తిరిగి రాగా లత రంగారావుని శక్తి కొద్దీ వెనక్కి తోసేసి, లేచి నుంచుంది. ఆమె నిలువెల్లా కంపింపసాగింది.

కాని ఒక్కమాటకూడా ఆమె పెదవులుదాటి బయటికి రాలేదు.

తన సైకో ఎనాలిసిస్ ఎక్కడ దెబ్బతిందో రంగా రావుకి సరిగా బోధపడలేదు.

"క్షమించండి", గొణిగాడు.

లత తెలివితేటలన్నీ ఏమయిపోయాయోగాని, అతనివైపు చురచుర చూడటం తప్ప ఆమె ఏమీ అనలేదు. అంచేత ఆమె ప్రవర్తన బెట్టుగా భావించి రంగారావు ఆమెని మళ్లీ చేరబోటం, అతని చెంప చెళ్లుమనటం ఒకేసారి జరిగాయి.

మన సత్వశాస్త్రంమీద మరో కొత్త పుస్తకం తాజాగా వెలువడిందేమో ననిపించింది రంగారావుకి.

"పొరపాటు...నాఉద్దేశం...క్షమించండి,అదికాదు", నత్తిగా ఏదో గొణిగి వెనక్కిపోయాడు అతడు.

జరిగిన పరాభవం తలుచుకున్న లతకి కళ్ళవెంబడి నీళ్లు తిరిగాయి. అలా ఎంతసేపు కూచుందో ఆమెకి తెలియలేదు.

"ఎడిటర్ అదిరిపోయాడంటే నమ్మి, లతా!" అకస్మాత్తుగా వినవచ్చిన ఈ మాటలకు లత తలెత్తి చూసింది. బొటానిస్టు, ఆర్. ఆర్. మళ్లా అత్యుత్సాహంగా ఉన్నాడు.

"'బొటానికల్ వరల్డులో మీపేరు చిరస్థాయిగా ఉంటుందండీ', అన్నాడు ఎడిటర్. చిత్తయిపోయినాడుపాపం." లత అతని మాటలు విన్నది. కాని ఆమె ఏమీ ఉత్సాహం చూపించలేదు. మాటలు చెప్పుకుపోవటమే అతని వంతు

గాని అవి ఎవరైనా వింటున్నారో లేదో, ఆ బొటానిస్టు కనవసరం.

"ఈ ఫొటోగ్రాఫుల గొడవ అయిపోయిందంటే ఒక అధ్యాయం అయిపోయినట్లే. కాస్త ఊపిరి పీల్చుకోటానికి వ్యవధానం దొరుకుతూంది."

లత అతనివైపు ఏమీ మాట్లాడకుండా చూస్తూ కూర్చుంది. మళ్ళీ మొదలు...అదుగో ఆ కెమేరా ముందు. అంత సంతోషంలో ఉండికూడా కులాసాగా తనతో నాలుగు మాటలు మాట్లాడటానికి విశ్రాంతి లేదు! ఏమిటో ఈయన స్టడీ! మొక్కలూ, పాడూ, అంతకంటె ప్రపంచంలో ఇంకేంలేనట్లు.

డార్కురూమ్‌లోనించి బయటికొచ్చాడు బొటానిస్టు చేతిలో నెగటివ్ ఫిల్ముతో.

"ఇవన్నీ పరిశోధన ఆఖరి దశలో తీసిన ఫొటోలు. పరిశోధన మొత్తం ఫలితం దీనిమీద ఆధారపడి ఉంది. ఫలితం నాకు ముందే తెలుసనుకో. లతా, ఒకసారి ఇలా చూడు. రెండేళ్ళ తపస్సూ ఫలించినపుడు సైంటిస్టు ముఖ భంగిమ ఎలా ఉంటుందో గమనించు. ఇదిగో నెగటివ్ ఫిల్ము చూస్తున్నాను."

లత కేవలం రాతి బొమ్మలా అతనివైపు చూడ సాగింది. అదేమిటి? విజయం సాధించిన సైటింస్టు ముఖం అలాగేనా ఉండేది? ఏమిటది? అలా తన భర్త ముఖం వివర్ణమయిందేం? ఒక్కసారిగా లత హృదయం ముకుళించుకుపోయింది. పరిశోధన ఫలించలేదు కాబోలు, పాపం!

రెండేళ్ళ శ్రమ! అయ్యో! దిగ్భ్రమతో బొటానిస్టు లత ముఖం వైపు చూశాడు. తరవాత త్వరితంగా మళ్ళీ డార్క్ రూంలోకి వెళ్ళిపోయాడు. అతని ముఖం పూర్తిగా వాడిపోయింది.

మరో గంటకి ఆగదినించి బయటికొచ్చాడు అతడు. చేతిలో కొన్ని ఫొటోలున్నాయి.

“సరిగా రాలేదా?” సానుభూతితో అడిగింది లత. అతనేమీ మాట్లాడకుండా ఆమె దగ్గరికి వొచ్చి ఓ ఫొటో అందించాడు.

“బావుంది కదూ?”

ఫొటో చూసి లత స్తంభీభూతురాలైంది. ఆ ఫొటోలో ఉన్నది లత కాదు—స్వర్ణలత!

“ఇదెక్కడిది?”

బొటానిస్టు మాట్లాడకుండా కేమెరావైపు సంజ్ఞ చేశాడు. ఆమెకిదేమీ అర్థంకాలేదు.

“ఎప్పుడు తీశారు?”

“నేను తియ్యలేదు.”

అయోమయంగా చూసిందామె.

“మరి?”

“నువ్వే తీసుకున్నావు.”

“నేనా?”

ఆలోచించటం మానేసింది లత.

"అవును. కేమెరా నీవైపు ఎందుకు తిప్పుతున్నావు?" లత మాట్లాడలేదు. ఏదో నేరం తనమీద రుజువు కాబోతున్నట్టుగా ఫీలయింది.

"దీన్ని గురించేనా నీ ఆలోచన?" బొటానిస్టు ఆమె చేతికో ఫొటో ఇచ్చాడు. అప్రయత్నంగా అందుకుం దామె. ఆ ఫొటోవైపోసారి చూచి చివాలున దానిని నేలమీద పారేసింది. తనతల నిమురుతూ రంగారావు. నీళ్ళతో ఆమె కళ్ళు నిండాయి. అతనివైపు చూడటాని కామె సాహసించ లేదు. ఆమె మనసులో తుపాను చెలరేగింది. ప్రత్యక్షసాక్ష్యం కనపడుతుంటే తను ఏం చెబితే ఏంలాభం? అతనెలా నమ్మగలడు? ఇంతకీ అది ఆటోమాటిక్ కేమెరా అని తనకి ముందే తెలిసి ఉంటే! తనెందుకు కేమెరా పగలకొట్టలేదు? పగలకొట్టే ధైర్యం లేనప్పుడు దాన్ని గురించి తనెందుకు జోక్యం కలిగించుకుంది?

"ఈ ఆటోమాటిక్ కేమెరా ఐదునిమిషాల కోసారి తనంతట తనే ఫొటోలు తీస్తుంది."

తను చేసిన అపరాధం ఏమీలేదని చెప్పాలనుకుంది లత. చెప్పటం చేతకాలేదు.

"ఈ కేమెరా నాకు మహోపకారం చేసింది."

"నేనేమీ తప్పు చెయ్యలేదు," అంది లత, ప్రయత్నపూర్వకంగా ధైర్యంచేసి అతనివైపు చూస్తూ. అతడు ఆమెవైపు తదేక దీక్షతో చూశాడు. ఏమీ అనలేదు. మరో ఫొటో ఆమె చేతికిచ్చాడు. అది గోడమీద ఎత్తుగా తగిలించి

ఉన్న ఒక ఛార్టు ఫొటో. లత కిదేమీ అర్థం కావటంలేదు. అడగటానికి సాహసం చాలటంలేదు.

"కేమెరా పగలకొట్ట దలచుకుని మళ్ళీ ఎందుకు మానేశావు ?"

ఈ మాటలకి పరమాశ్చర్యంతో ఆమె అతని ముఖం వైపు చూసింది. జరిగిందంతా తన భర్త చూశాడా ? అలా అయితే తను బయటపడినట్టే.

"మీకెలా తెలుసు", హీనస్వరంతో అడిగింది.

"ఈ ఫొటోలే సాక్ష్యం."

మళ్ళీ ఆమె ముఖం ముకుళించింది.

"నేనేమీ తప్పు చెయ్యలేదు," మళ్ళీ అందామె.

"ఈ ఫొటోలు చెబుతూనే ఉన్నాయిగా."

ఆమె ముఖం ఎర్రబడ్డది. వ్యంగ్యం ! చెయ్యని తప్పుకు శిక్ష ! ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

మరుక్షణంలో లత ఊహించలేని, ఏ కోశానా ఆశించని సంఘటన జరిగింది. బొటానిస్టు లత చుబుకాన్ని ఎత్తి ఆమె పెదవులని గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు.

"కేమెరాకి నువ్వంటే చాలా ప్రీతి. నీకు ఎన్ని ఫొటోలు తీసిందో చూడు", సోఫామీద చేతిలోని ఫొటోలన్నీ గిరవాటు వేశాడు. ప్రతి ఫొటోలో దీనత్వం మూర్తీభవించిన లతే ఉంది.

తన భర్త తనని అనుమానించకపోవటానికి కారణం ఆమెకి తెలీలేదు. అడిగింది సూచనగా.

"ఈ ఆటోమాటిక్ కేమెరా ప్రతి ఐదు నిమిషాలకీ ఫొటో తీస్తుందనే విషయం జ్ఞాపకంలేదా?" అన్నాడతను. ఒక క్షణం కనుబొమలు చిట్లించిన లత మరు క్షణం దరహాసం చేసింది.

"కేమెరా పగలగొట్ట బోయానని ఎలా తెలిసింది."

"ఫొటోలు చూశావుగా, ఆ ఛార్టుఫొటో—నేను సైంటిస్టుని. ఎనలైజు చెయ్యటం నా కలవాటు. అంతకుముందు నీ ఫిర్యాదుకీ దీనికీ అవినాభావ సంబంధం ఉందని ఏ మూర్ఖుడైనా గ్రహిస్తాడు."

అతని తెలివికి ప్రప్రథమంగా మనసారా సంతోషించింది స్వర్ణలత—ఆ లేబరేటరీలో నడిచే బంగారు తీగ.

"స్టడీ చేయాలిసిందెవరినో నాకంటే నా కేమెరాకే బాగా తెలుసు", అని నిగర్వంగా ఒప్పుకున్నాడు బొటానిస్టు రామచంద్రరావు మర్లా యం. యస్. సి., (లండన్).






# గాలిలో దీపాలు

బారులు తీర్చిన దీపాలు అమావాస్య రాత్రిని చూసి పరిహాసంగా నవ్వుతున్నాయి. చీకటి మూలమూలలకి జారిపోతోంది. ఊరిచివర రాతిగోడల పూరిఇంటిబయట గుమ్మం దగ్గరకూడా నాలుగు ప్రమిదలు వెలుగుతున్నాయి. అరుగుమీద కూర్చుని వసుంధర ఎదుటి మేడలో ధగద్ధగాయమానంగా వెలుగుతున్న విద్యుద్దీపాల వరుసలు తేరిపార చూస్తోంది. పాలరంగులో ఉన్న కిటికీ అద్దాలలోంచి దీప కాంతులు ప్రసరిస్తున్నాయి. గది కిటికీ అద్దంమీద ఒక నీడ—ఎదురుగా మరో నీడ సమీపిస్తోంది...తరవాత ఒకటే నీడ. వసుంధర శరీరం జలదరించింది.

ప్రియంవద ఎంత అదృష్టవంతురాలు! తనతోపాటే స్కూల్ ఫైనల్ చదువుతోంది. తనకంటే అందమైందికాదు.

కాని తనకంటే అదృష్టవంతురాలు, పెట్టిపుట్టింది. అన్ని విధాలా ఆదర్శవంతుడైన భర్తని సంపాదించుకుంది. విద్యాధికుడు, రూపసి, చాలా మంచివాడని కూడా ఆమే చెప్పింది. సుఖమయజీవితానికిహ ఆమెకి లోటేముంది? తనకికూడా...

రయ్‌మని గాలివీచింది. కిటికీ తలుపులు కొట్టుకున్నాయి. చప్పుడువిని వసుంధర ఆలోచనల్ని అరికట్టి, యథాలాపంగా దీపాలవైపు చూసింది. ప్రమిదల్లో జ్యోతులు ఆరిపోయాయి. వసుంధర మళ్లీ దీపాలు వెలిగించి తిరిగి అరుగుమీద కూచుంది. మళ్ళీ ఆలోచనలు...

తనకికూడా ప్రియంవదకి కలిగిన అదృష్టం కలిగితే! వసుంధర నిమీలితనేత్రాలతో ఊహాప్రపంచంలో విహరిస్తోంది.

"వసుంధరా !"

వసుంధర ఆ మృదువైన పిలుపు విన్నది. కాని పలకకూడదు. కొంచెం బెట్టు అవసరం.

"వసుంధరా !"

అప్పుడే వినిపించుకో కూడదు. వెనక్కి చూడకుండా, చూసినట్టు కనపడకుండా క్రీగంట చూస్తే...

"రాణీ"

ముసిముసిగా నవ్వుకుంది.

"వసూ."

చిరునవ్వు వొలకబోస్తూ నాజూకుగా, ప్రబంధ నాయికలా కొద్దిగా పక్కకి తిరగి కళ్ళెత్తి చూసింది. అతడు

సమీపించి చుబుకం స్పృశించాడు. అలా ఎన్ని క్షణాలైతేనేం! మేఘాల్లో పావురంలా—పావురాల జంటలా—తేలిపోతూ సాగిపోతుంటే...

టపటప కిటికీ తలుపులు కొట్టుకున్నాయి. వసుంధర ఉలిక్కిపడి చూసింది. ప్రమిదల్లో దీపాలు ఆరిపోయాయి. మధురభావనలు చెదిరిపోయాయి. ప్రబంధనాయిక వసుంధర తేజోవిహీనంగా దీపాలవంక చూసింది. బద్ధకంగా లేచి వాటిని మళ్లీ వెలిగించే ప్రయత్నంలో నిమగ్న అయింది. సుఖస్వప్నం చెదరి నిజం కఠినంగా, కర్కశంగా సాక్షాత్కరించింది. నిజం కాలేని కలలు! కొద్దిరోజుల క్రితం జరిగిన సంఘటన ఒకటి ఆమెకి జ్ఞాపకం వొచ్చింది. ఎవరో సంబంధం వాళ్ళు వొచ్చారు. అతనికి రెండోపెళ్ళి కావాలిట. మనిషికి నడివయసుకి కొంచెం తక్కువే ఉంటుందేమో. వాళ్లు వెళ్లింతరువాత తండ్రి అడిగాడు, "ఏమమ్మా?" అని, ఆ స్వరం! తను కళ్లెత్తి తండ్రివైపు చూడగానే తల పక్కకి తిప్పుకున్నాడు. అంతే, ఇహ తను ఏమీ ఆలోచించలేదు. "సరే", అంది. ఆయన మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. ఆయన నుంచున్న స్థానంలోని కన్నీటి బిందువులు తన మనోఫలకం మీద ఎప్పుడూ ఆరిపోవు. దేవుడు తనపక్షం ఉన్నాడు, తన పురాకృత పుణ్యంవల్ల ఆ సంబంధం తప్పిపోయింది. "మరీ కూటికిలేనివాళ్ళపిల్లని చూస్తూచూస్తూ ఎలా చేసుకోను?" అన్నాట్ట వరుడు. శతసహస్ర వందనాలు!

దీపాలు వెలిగాయి. వసుంధర మళ్ళీ అరుగుమీద కూచుంది. ఆలోచనాప్రవాహం పల్లమెరిగి ప్రవహిస్తోంది.

తను గొప్ప అందకత్తె కాకపోయినా అందగత్తే అని నలుగురూ పొగడటం తనకి తెలియకపోలేదు. దానికితోడు సరైన విద్య ఉంటే...ధనంలేని లోపం తీరుతుంది. విద్యావతికి డబ్బు లేకపోయినా ఆదరం ఉంటుంది. తను ఎలాగో కష్టపడి బి. ఏ., చదివితే...బి. ఏ., చదువుతూంటే...

"మిస్ వసుంధరా."

పిలిచిందెవరో తనకి తెలుసు. తనంత అమాయకురాలు కాదు. ఆమె ఆగింది.

"ఏంకావాలి ?"

అతడు తొట్రుపడుతున్నాడు. వసుంధర నవ్వింది. ఎందుకంత గాభరా ?

"నేను మన డ్రమెటిక్ అసోసియేషన్ సెక్రెటరీని", తన కామాత్రం తెలుసు.

"మీరు నాటకంలో వేషం వెయ్యటానికి వొప్పుకుంటారని ఆశిస్తున్నాను."

కొంచెం తటపటాయించాలి.

అతడు బతిమాలుతున్నాడు. ఇష్టం లేనట్టుగా "సరే", అంది...నాటకంలో వేసింది.

"గొప్పగా వేశారు."

అంతా అలాగే అంటున్నారని తనకి తెలియకపోలేదు.

"మిస్ వసుంధరా."

చిన్నగా నవ్వుకుందామె.

"ఒక విషయం చెప్పనా ?"

అదేమిటో తనకి తెలుసు. కిన్నెర స్వరంతో, వీణ మీటినట్టుగా అంది. "ఊఁ"...

"నేను... నేను...ప్రేమిస్తున్నాను."

"ఎవర్ని ? తమాషాగా, ఏమీ తెలియనట్టుగా అంది.

"మిస్ వసుంధరా..."

బాధపడుతున్నాడు. భయపడుతున్నాడు.

"తెలీదా ?" ఏడిపిస్తోంది కావాలని.

అతను చిరునవ్వుతో తన కళ్ళలోకి చూశాడు.

"నాకు డబ్బులేదు."

"అక్కర్లేదు", భర్తృహరి పద్యం చదివాడు, విద్యను గురించి.

ఆమె అరమోడ్పు కన్నులతో ఆలకిస్తోంది.

దభాలున కిటికీ తలుపులు కొట్టుకున్నాయి. దీపాలు ఆరిపోయాయి. చెదిరిన మనసుతో వసుంధర లేచి దీపాల దగ్గరికి వెళ్ళింది. కల నెమరువేసుకుంటోంది. ఎందుకీ అసంభవమైన ఆశలు! బి. ఏ, ఎలా చదువుతుంది తను ? ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్ష ఫీజు ఇంతవరకు కట్టలేదు. కట్టే ఆశ కూడా అంతగా లేదనే అనాలి. ముకుళించిన ముఖంతో వసుంధర దీపాలు వెలిగించి మళ్ళీ అరుగుమీద కూచుంది.

గాలికి తేలిపోయే మేఘాల్లా ఆలోచనలు మళ్లీ మానసాకాశంలో తేలిపోతున్నాయి.

వనంలో పువ్వులు కోసుకుంటూ, చెట్టు చెట్టు దగ్గరికి వయ్యారంగా హంసనడకలతో పరిగెత్తుతూ ప్రేమగీతం – వసంతకాలంలోని కోయిలలా వసంతాగమనాన్ని సూచించే ప్రేమగీతం పాడుకుంటోంది. గభాలున ఆగిపోయింది. ఎవరతడు? ఎంత ధైర్యం? చరణం అందుకున్నాడు...కాని బాగానే పాడుతున్నాడు. చేతులో పిట్టల్ని కొట్టే తుపాకీ ఉంది. విద్యాధికుడులా ఉన్నాడు.

"ఎవరు మీరు?" కోపం నటిస్తూ అంది.

"నువ్వెవరు?"

అతనివైపు చురచుర చూసింది. అతడు నవ్వుతున్నాడు. కోపంతో గిరుక్కున తిరిగింది.

"ఆగు".

వెనక్కి తిరిగింది అప్రయత్నంగా. తుపాకి బారు చేశాడు. ముచ్చెమటలు పోశాయి. తటాలున తుపాకి కింద పారేసి అతడు ఏమాత్రం సంకోచం లేకుండా దగ్గరగా వొచ్చి అన్నాడు.

"ఎందుకంత భయం?"

మాటి తమాషాగా తిప్పింది. ఏదో పాడాడతను. తన కోపం తమాషాగా పోయింది. కోపం నటిస్తూనే ఉంది.

"కోపమా?" అతడు చుబుకాన్ని పట్టుకొని తనవైపు ముఖం తిప్పుకున్నాడు...

హృదయం అనురాగంతో నిండింది.

"నా జీవనరాణీ!"

తను అనర్థాలనీ, దరిద్రులకీ, ధనవంతులకీ చుట్టరికం కూడదనీ ఏవేవో అంది.

"నీముందు ధనం నాకు గడ్డితో సమానం", అతడు మోకరిస్తున్నాడు-పవిత్ర ప్రేమికుడు.

రంయి మని గాలి వీచింది. జోరుగా తలుపులు తటతట కొట్టుకున్నాయి. ప్రమిదల్లో దీపాలు ఆరిపోయాయి. వసుంధర శూన్యంగా చూసింది. మళ్ళీ మామూలు ప్రపంచంలోకి తప్పనిసరిగా వొచ్చింది. అవన్నీ సినిమాల్లో జరిగే కథలూ, పుస్తకాల్లో రాసేవీ, పనిలేని రసికులు ఉబుసుపోకకి రాసుకునేవీ. ఆ ఆదర్శవంతు డెవరో మారుమూల ఉన్న తనని వెదుక్కుంటూ వొస్తాడా! నిస్పృహగా, యాంత్రికంగా వసుంధర దీపాలు వెలిగించింది.

పగలెక్కడెక్కడ తిరిగినా రాత్రికి గూటికి చేరుకునే విహంగాల్లా, ఆమె మనసు ఏవే విషయాలమీదికి తిరిగినా అసలు విషయానికే మళ్ళీ త్వరలో మరలింది.

ఎక్కడ చూసినా వీరేశలింగాలూ, అప్పారావులూ. భువనం కోలాహలంతో మారుమోగింది. "చిరకాలం జరిగిన", అన్యాయాలు ఇహ జరగవు. యువకులు నడుం కట్టారు. ముందుకు ఉరుకుతున్నారు. జనం సౌఖ్యం ఇహ మీదట ధనంమీద ఆధారపడదు. తను కోరిన కోరికలు, కలలు నిజంకాగల తరుణం...

టపటపమని తలుపులు కొట్టుకున్నాయి. గాలి హోరున వీస్తోంది. దీపాలు ఆరిపోయాయి. వసుంధర మరో

ప్రపంచంనుంచి మనుషుల ప్రస్తుత ప్రపంచంలోకి బలవంతాన విసరివేయబడ్డది. అరుగుమీాదినుంచి లేచి దీపాల దగ్గరికి నడిచింది బరువుగా.

"ఎందుకు తల్లీ వృథా శ్రమ? గాలిలో దీపాలు వెలుగుతాయా ?"

కూతురి వ్యర్థప్రయత్నాల్ని గుమ్మం దగ్గర కూచుని చూస్తున్న తండ్రి లాలనగా అన్నాడు. వసుంధర శూన్యంగా తండ్రి ముఖంలోకి చూసింది విషణ్ణవదనంతో.

అవును. గాలిలో దీపాలు వెలుగుతాయా? తను వొట్టి పిచ్చిది. దారిద్ర్యపు పెనుతుపానులో ఆశాజ్యోతులు అస్తిత్వానికి ఎంతకాలం గిజగిజ కొట్టుకోగలవు!

పదహారేళ్ళ ముగ్ధ, సుకుమారి, అమాయిక వసుంధర చెంపలమీాద కన్నీటి బిందువులు జారాయి. కాటుక కన్నీళ్లు విషాదగీతం ఆలపిస్తూ హూనసందేశం ఏదో అందిస్తూ బరువుగా వసుంధరలో అదృశ్యమయాయి. ఆ ఇంటి వాకిట ప్రమిదల్లో దీపాలు ఆరాత్రి ఇహ మళ్ళీ వెలగలేదు.



# డవాలు

కుడిచేత్తో ఆఫీసు ఫైల్ను భద్రంగా పట్టుకుని, ఎడం చేత్తో ముఖంమీంచి కారే చెమట తుడుచుకుంటూ పరిగెత్తుతున్నాడు బంట్రోతు కోటయ్య, ముందుపోయే ఆఫీసర్ సైకిల్ వెనకాలే. రోడ్డుమీద ఎదురుగా వొచ్చే జనం, తన ముఖంలోకి ఎగతాళిగా చూసి నవ్వటానికి పరిగెత్తుతూ మీదిమీది కొస్తున్నట్టనిపించిం దతనికి. నవజవాన్ కోటయ్య ఆరోజే కొత్తగా జమానుగిరిలో ప్రవేశించాడు. సైకిల్ వెంట పరిగెత్తటం అతనికి కొత్తగా, వింతగా, అవమానకరంగా ఉంది. 'జట్కాఎంబడి లగెత్తే పిల్లోడిలాగా, ఏంటిది ?' అనుకున్నాడు. ఈ ఆలోచన రాగానే అతనికి తన చిన్నతనపు రోజులు జ్ఞాపకానికొచ్చాయి. ఏదైనా జట్కా తనముందుగా పోతూంటే ఆటకోడితనంగా దాని

వెంట పరిగెత్తేవాడు, అలుపువొచ్చేదాకా. అప్పుడు గనక అలుపురాగానే ఆగేవాడు. కాని ఇప్పుడో! ఆ రోజుల్లో తనని శాసించేవాడెవడూలేడు. కాని ఆ రోజులు గిర్రున తిరిగి పోయాయి. ఇప్పుడు తను పోషించేవాడు. తన రెక్కలమీద తనేకాక ఇంకా ముగ్గురు ఆధారపడి ఉన్నారు—తల్లీ, తమ్ముడూ, భార్యా. కుర్చీలో కూచుని పనిచేసేటంత చదువు లేదు తనకి. అయినప్పుడు అలుపుని గురించి ఆలోచన అనవసరం. అయినా తను ఒళ్లు దాచుకునేరకంకాదు. కష్టపడగలడు. కాని ఈ జమానుపనికాక మరోటయితే బాగుండును. పోనీ ఈ పనే అయినా, ఈ సైకిల్ వెంట పరిగెత్తడం లేకపోతే...

పరాకుగా ఆలోచిస్తూ పరిగెత్తుతున్న కోటయ్యకి ఠపీమని ఎదురుదెబ్బ తగిలింది. వొంగి నెత్తురు కారుతున్న వేలిని పట్టుకుని తలెత్తి ముందుకు చూశాడు. ఆఫీసర్ సైకిల్ క్రమంగా దూరమవుతోంది. అలాగే బాధతో మళ్ళీ పరిగెత్తటం మొదలుపెట్టేడు కోటయ్య. సైకిల్ సమీపిస్తుండగా 'కోటాయ్', అనే కేక రౌద్రంగా వినబడ్డది. కోటయ్య మనస్సు చివుక్కుమంది. తను కోటి, కోటప్ప, కోటయ్య అనే పేర్లకే అలవాటుపడ్డాడు. ఎవరూ కూడా ఇంతకుముందు తనని కోటాయ్ అని పిలవటానికి సాహసించలేదు. హుఁ...కోటాయ్‌ట!

"ఏరా, చెవుడా ఏం?"

కోటయ్య ముఖం జేవురించింది. వొస్తున్న కోపాన్ని అణచుకుని "ఏంటండీ?" అనబోయి, మళ్ళీ ఆగి "అయ్యా", అన్నాడు.

"కలం తీసుకురావటం మర్చిపోయాను. అమ్మగారి నడిగి తీసుకురా. పరిగెత్తు. ఇక్కడున్నట్టు రావాలి."

అసలే ఎదురుదెబ్బ తగిలి బాధపడుతుంటే మళ్లీ నడిచినంత దూరం వెనక్కి వెళ్ళి తిరిగి రావటం— మామూలుగా కాదు— పరిగెత్తుకు రావటం! సైకిల్ ఉన్నాయనకే వెళ్ళటానికి బద్ధకమయితే...పోనీ ఆ సైకిలిచ్చి వెళ్ళిరమ్మన కూడదూ! మనిషి ఉన్నాడు గదా అని...

"మాట్లాడవేం?"

''చిత్తం'', అన్నాడు కోటయ్య. అంతకంటె ఏమన గలడు గనక!

గాయం బాధని అలాగే ఓర్చుకుంటూ ఆఫీసర్ ఇంటికెళ్ళాడు కోటయ్య. తీరా ఇంటికెళ్ళిం తరవాత, ''బజారుకెళ్ళిరావాలిరా కోటాయ్'', అంది అమ్మగారు.

"అయ్యగారు అర్జంటుగా రమ్మన్నారండి," తప్పించు కోటానికి ప్రయత్నించాడు కోటయ్య.

"ఫరవా లేదులే. నేను పంపించానంటే ఏమనరులే." మళ్ళీ బజారుకెళ్ళి రావాలనేసరికి కోటయ్యకి గుండెల్లో రాయిపడ్డది. ఎదురుదెబ్బ తగిలి కాలు నెప్పిపుడుతోందని చెబుదామనుకున్నాడు. "ఎలా అంటావో చూస్తానుగా", అని సవాలుచేసింది డవాలు.

"మధ్యాహ్నం ఉప్మాలోకి నిమ్మకాయలు కావాలి, ఓ అణాకి తీసుకురా", అమ్మగారు ఆర్డరు వేసింది. అయిష్టంగా కాళ్ళీడ్చుకుంటూ బజారు చేరుకున్నాడు కోటయ్య. నిమ్మకాయలుకొని తిరిగి వెడుతూంటే వీరయ్య కనిపించాడు. వీరయ్యకీ, కోటయ్యకీ చిన్నప్పటినించీ స్నేహం. పొలాలకి గొడ్లని తోలుకుంటూ ఇద్దరూ కలిసి వెళ్ళేవాళ్ళు.

"ఈ డవాలేంటిరో?" అన్నాడు ఆశ్చర్యంగా వీరయ్య. కోటయ్యకి చిన్నతనం వేసింది.

"నౌకరీకి కుదిరాలే", అన్నాడు తలదించుకొని.

"మా గొప్పనౌకరీలే. గొడ్డుకి వాతేసినట్టు ఈ డవాలేంటి? ఇంతకంటే మంచి ఉద్యోగమేం దొరకలే ?"

"ఏదో ఓటి", కోటయ్య అవమానంతో, పైకి ఏదో అనేసి చరచర నడిచిపోయాడు. వీరయ్యకేం, కాస్త పొలం పుట్రా ఉన్నవాడు. వాడు ఏపనిచేసినా చెల్లుతుంది. తను వాడితో వంతుపెట్టుకుంటే ఏంలాభం ?

దెబ్బతిన్న అభిమానంతో కోటయ్య ఎలాగో ఆఫీసర్ గారి ఇల్లు చేరుకుని నిమ్మకాయలు ఇంట్లో ఇచ్చి వెళ్ళబోయేసరికి అమ్మగారంది :

"ఒరే కోటాయ్, కాస్త పిల్లాణ్ణి ఎత్తుకుని ఆడించు, ఇంట్లో కాస్త పనుంది."

కోటయ్యకి ఒళ్లు మండింది.

"అయ్యగారు ఆలస్యమైతే కోపం చేస్తారమ్మా", అన్నాడు.

"ఊరికే కూచుంటేగా కోపం, ఇదికూడా పనేలే",
అని అమ్మగారు పిల్లాణ్ణి కోటయ్యదగ్గర వొదిలి లోపలి కెళ్ళింది.

"ఛీ ఈ అబ్బాయి నెట్టనబ్బా ఎత్తుకోటం, ఒళ్ళంతా కురుపులే", చీదరించుకున్నాడు కోటయ్య. అసలే అతనికి చంటి పిల్లలంటే అసహ్యం. అందులో పరాయివాళ్ళ పిల్లలయి-ఆఫీసర్ గారి అబ్బాయిలాంటి వాడయితే ఇహ చెప్పటమెందుకు!

తనని ఎత్తుకోకపోవటం చూసి ఆకుర్రాడు ఒక్క పెట్టున కొట్టినట్టుగా ఏడ్చాడు. లోపలినించి అమ్మగారు పరిగెత్తుకుంటూవొచ్చి కోటయ్యని చీవాట్లు పెట్టింది. కోటయ్య ఆడవాళ్ళచేత (తల్లిని మినహాయించి) ఎప్పుడూ చీవాట్లు తినలేదు. ఇదే ప్రథమం. "ఛీ" అనుకున్నాడతడు.

కుర్రాడిని బుజ్జగించి, కాసేపటిలో అతన్ని వొదిలించుకుని బయట పడ్డాడు కోటయ్య. ఆఫీసులో అడుగు పెట్టగానే ఆఫీసర్ మండిపడ్డాడు.

"ఇంటిదగ్గర పనులు చెప్పారండి" అన్నాడు కోటయ్య.

"చెబితేమాత్రం, నేనంటే అంత నిర్లక్ష్యమా. నేను మాత్రం పనిమీదకాదా నిన్ను పంపింది?" అన్నాడు ఆఫీసర్.

"అమ్మగారు పనిచెబితే మీరేమీ అనరన్నారండి అమ్మగారు" అన్నాడు అమాయకంగా కోటయ్య.

"నోరుముయ్యి" అరిచాడు ఆఫీసర్. "బయటకూచుని గంట కొట్టినప్పుడు వెంటనే రా."

కోటయ్య బయట కూర్చున్నాడు. ప్రతి అయిదు నిమిషాలకీ, పదినిమిషాలకీ గంట కొట్టి ఏవో పనులు పురమాయించాడు ఆఫీసర్. గంట విన్నప్పుడల్లా కోటయ్యకి ఆత్మాభిమానం దెబ్బతినేది. "పేరుపెట్టి పిలవలేడూ, ఈ గంట కొట్టటమేమిటి? ఇంతకంటే కోటాయ్ అన్న పేరే నయం" అనుకున్నాడు కోటయ్య. ఆ గంట కొట్టటంలో ఆఫీసర్ పొందే ఆత్మతృప్తి, ఆనందం, స్వాతిశయం కోటయ్య కేం తెలుసు!

మధ్యాహ్నమయింది. కోటయ్య భోజనానికి ఇంటి కొచ్చాడు. ఇంటికి రాగానే ఏమిటో, అంతా కొత్తగా ఉందతనికి. తను మునుపటి కోటయ్యకాదు. జమాను కోటయ్య! ఇంట్లోని ప్రతివస్తువూ అతన్ని గేలిచేస్తున్నట్టుంది; ప్రతిదీ చులకనగా తనవైపు చూస్తున్నట్టుంది.

"వేణ్ణీళ్ళు ఉన్నయ్యా?" స్నానంచేసి బడలిక తీర్చుకుందామని అడిగాడు కోటయ్య.

లేవని బుర్ర తిప్పింది రత్తమ్మ.

"ఏం?" అన్నాడు కోటయ్య కొంచెం కోపంతో.

"పుల్లల్లేవు" అంది రత్తమ్మ మామూలు ధోరణిలో.

"ఏరుకురాలే?"

"యాడేరుకొచ్చేది?"

"రోజూ యాడేరుకొస్తుండవు?"

రత్తమ్మ మాట్లాడలేదు. కోటయ్యకి కోపంవచ్చింది. రత్తమ్మకి తనంటే బొత్తిగా నిర్లక్ష్యం. గబగబ నోటికి వచ్చినట్లు నాలుగు చీవాట్లు పెడదామనుకున్నాడు గాని, మళ్ళీ తమాయించుకున్నాడు. ఇంతకీ రత్తమ్మ ఏమన్నదని? అమ్మగారు, ఆఫీసరుగారు తనని పెట్టిన చీవాట్లు తలపుకొచ్చాయి అతనికి. వాళ్ళంతంతలేసి మాటలంటూంటే ఏమీ అనలేని తను రత్తమ్మ మీద మాత్రం ఎందుకు కలుగజేసుకోవాలి? అయినా తను ఒక సామాన్య బంట్రోతు. కోపం, గీపం తన దగ్గరికి రావటానికి వీల్లేదు. ఒకళ్లు తనని ఏమైనా అనాలిసిందే గాని, తను ఎవరినీ ఏమీ అనకూడదు. రత్తమ్మ మాత్రం తను చేసే మహాఘనమైన ఉద్యోగానికి ఏమంత గౌరవం చూపిస్తుంది. అయితే, తను ఈ ఉద్యోగం చెయ్యటం వాళ్ళ కోసమేగా. వాళ్ళకోసం తను అవమానం సహిస్తున్నాడు. సహించాలి. కేవలం అందుకోసమైనా తనవాళ్లు తనమీద గౌరవాదరాలు చూపించొద్దూ?

"ఏందా ఆలోశన?" అంది రత్తమ్మ, కోటయ్య వైఖరి చూసి.

"ఏం లేదు."

"నే నెంత చెప్పినా ఇనక ఆ నౌకరిలో చేరితివి. ఆళ్లేమైనా అన్నారేంటి?"

"ఏహె, లేదులే" అన్నాడు కోటయ్య కోపంగా.

"బువ్వ తాగుదుగాని పద, మళ్ళా నౌకరి కెళ్ళాలిగామాల" అంది రత్తమ్మ కొంచెం ఈసడింపుగా.

"నేను జమాను నౌకరి చేస్తే నీకేం కష్టం?" అన్నాడు కోటయ్య చిరాగ్గా.

"కష్టంలేదు. నష్టంలేదులే పా" అంది రత్తమ్మ.

"మరి బుర్రెట్టా వొచ్చుద్ది?" అన్నాడు కోటయ్య, రత్తమ్మ గొంతులోని వ్యంగ్యం పెడుతున్న బాధని అణుచుకుంటూ. రత్తమ్మ మాట్లాడలేదు. తను బంట్రోతుగా పని చెయ్యటం రత్తమ్మకీ, ఇంట్లో అందరికీ కూడా అవమానకరంగా ఉందని కోటయ్య గ్రహించాడు. కాని, తనేం చెయ్యగలడు? పోషించాల్సిన బాధ్యత తనది.

భోంచేసి ఆఫీసరుగారి ఇంటికి వెళ్ళాడు. ఇంటినించి ఆయనకి కాఫీ, టిఫిన్ తీసుకెళ్ళాలి. అక్కడ కాసేపు పిల్లవాణ్ణి ఎత్తుకునే డ్యూటీ తగిలింది. వెళ్ళబోతుండగా అమ్మగారు పిలిచి, "ఈ పూట పనిమనిషి రాలేదు, పైకిపోయి గది చిమ్మిరా" అంది. సొంత ఇల్లు కూడా ఎప్పుడూ చిమ్మలేదు. కోటయ్య "చిమ్మను" అనబోయి డవాలాచూసి "చిత్తం" అని పైకివెళ్ళాడు.

ఆ పని పూర్తిచేసి వొచ్చేసరికి అమ్మగారు మళ్లీ ఇంకో పని పురమాయించింది.

"రాత్రి మొదటి ఆటకి సినిమాకి వెళ్లాలిగాని, పైన పక్క వేసిరా! మళ్లీ సాయంత్రం ఏవేళప్పుడు వొస్తావో, అయ్యగారు ఏం పనులు పురమాయిస్తారో."

కోటయ్యకి అరికాలిమంట నెత్తికెక్కింది. రాత్రల్లా పడుకునేవాళ్లు, పడుకునే పక్క వేసుకోలేరా? దానికి వేరే మనిషి కావాలా? చేసేవాడు తేరగా ఉన్నాడని.

మనసులో కాసేపు బాధపడి, ఎదురు చెప్పటానికి ధైర్యంలేక ఆ పని కూడా పూర్తిచేసుకుని ఆఫీసుకి వెళ్లాడు కోటయ్య.

"ఏరా! నువ్వేం పనిచెయ్య దలుచుకోలేదా? ఇప్పుడా కాఫీ తీసుకురావటం?" గదిమాడు ఆఫీసర్.

"అమ్మగారు..."

"నోరుముయ్యి."

"ఎందుకయ్యా నోరు ముయ్యటం?" అనేమాటలు అతని నోటి చివరిదాకా వొచ్చాయి, కాని డవాలు "తగ్గరా, కోటాయ్" అంటంచేత మాట్లాడకుండా ఊరుకున్నాడు. ఎందుకు మాట మాటకీ అభిమానపడటం, సాగనప్పుడు. ఈ ఉద్యోగంలో ఆత్మాభిమానం ఉంటే కుదరదు. తను ఈ వాతావరణానికి అలవాటుపడక తప్పదు. అయినా ఈ ఆఫీసర్లకి ఇంత అహం ఎందుకో? అసలు ఒక మనిషికి ఇంకో మనిషిమీద ఏం అధికారముంది? కేవలం తను డబ్బు లేకపోవటంవల్ల అన్నిమాటలు పడాలిసొచ్చింది గాని, తనకే తిండి జరిగే సదుపాయం ఉంటే ఆ ఆఫీసర్‌ని గడ్డిపోచగా చూసి ఉండేవాడు. ఏ మనిషిపని ఆ మనిషి చేసుకోలేడూ? తన ప్రతి పనీ మరోమనిషిచేత చేయించుకునే అవసరం ఎందుకు కలగాలి? ప్రతివాడూ, ముఖ్యంగా ప్రతిఆఫీసరూ కొంతకాలం తప్పనిసరిగా బంట్రోతు ఉద్యోగం చెయ్యాలనే రూలు పెడితే! బంట్రోతులమీద అధికారం చెలాయించే ప్రతి ఆఫీసరూ, తనుకూడా ఒక బంట్రోతు మాత్రమే అని గ్రహిస్తే!

గంట గణగణ మోగింది. అదిరిపడి లేచాడు కోటయ్య. భయపడుతూ లోపలికి వెళ్ళాడు. ఆఫీసర్ అతనివైపు రౌద్రంగా చూసి "గాడిదలు కాస్తున్నావా? ఫైల్సు తీసుకు పద." అన్నాడు. కోటయ్య మాట్లాడకుండా ఫైల్సు తీసుకున్నాడు. ఆఫీసర్ సైకిలెక్కి పోతున్నాడు. అప్రయత్నంగా కోటయ్య సైకిల్ వెనకాలే పరిగెత్తాడు. "హుం జట్కా వెంబడి లగెత్తే పిల్లోడిలాగా..." అనుకున్నాడు కోటయ్య. అతని మనసులో ఏవేవో ఆలోచనలు వొస్తున్నాయి. రపీమని ఎదురుదెబ్బ తగిలింది కాలి వేలుకి. కోటయ్య వొంగి వేలు పట్టుకున్నాడు, తగిలిన వేలుకే మళ్ళీ తగిలింది. నెత్తురు కారుతోంది. నరాలు జివ్వున లాగుతున్నాయి.

"కోటాయ్."

తలెత్తి చూశాడు. ఆఫీసర్ సైకిల్ దూరమయింది. ఆఫీసర్ వెనక్కి తిరిగి మండిపడుతు కేకేశాడు. యాంత్రికంగా వేలువిడిచి పరిగెత్తాడు కోటయ్య-కాదు కోటాయ్, డవాలా జవాను.



# దీర్ఘసుమంగళీభవ

వాకిట్లో బండి ఆగిన చప్పుడు విని పద్మ బయటి కొచ్చింది. సత్యనారాయణ అప్పుడే బండి దిగుతున్నాడు.

"పరీక్షలు బాగా రాశావా, బావా ?"

అతను తలెత్తి చూశాడు. మాసిన గడ్డం, లోతుకు పోయిన కళ్ళూ, మ్లానవదనం చూసి పద్మ హృదయం కలుక్కుమంది.

"ఆఁ"

"బాగా చదివినట్టున్నావు."

"బాగానే చదివాను" అతను నిరుత్సాహంగా జవాబిచ్చాడు.

"సరిగ్గా ఈ బండికే వొస్తావనుకున్నాను. అలాగే వొచ్చావు. చూశావా, ఎంత సరిగా ఊహించానో!"

అతను తలెత్తి పద్మవైపు చూశాడు. మిలమిలా మెరిసే ఆమె కళ్ళలోకి ఒక్కసాగి చూసి తటాలున కిందికి చూపుల్ని మరలించాడు. పద్మ ఊహించినట్టుగా అతను చిరునవ్వు నవ్వలేదు.

"ఊఁ" అని మాత్రం అన్నాడు. పద్మ అతనివైపు కాస్త వింతగా చూసింది.

"అత్తయ్య దొడ్లో పూజచేసుకుంటున్నట్టుంది పిలుస్తానుండు."

"ఒద్దులే పద్మా, మా అమ్మకి ఆ పూజలోనే శాంతి దొరుకుతుంది. ఈ దౌర్భాగ్యుడు ఆమెకి అశాంతి తప్ప ఇంకేమీ ఇవ్వలేడు.

పద్మ అతనివైపు విస్మయంగా చూసింది. ఒక క్షణం ఆగి, అతని కళ్ళలోకి చూస్తూ "పరీక్ష ఏమైనా చెడగొట్టావా, బావా ?" అంది నెమ్మదిగా.

సత్యనారాయణ ఆమె మాటలకి సమాధానంగా "ప్చ" అని మాత్రం అని ఇంట్లోకి నడిచాడు. పద్మకి ఆ సమాధానం సరిగా అర్థంకాలేదు. "ప్చ" అనటం ఆమెకి సమాధానంగానో లేక అతని మానసిక వేదనతోనో ఆమెకి సరిగా తెలియలేదు. ఆమెకి తెలిసినంతలో సత్యనారాయణ పరీక్ష బాగా రాయకపోవటానికి కారణం ఏమీలేదు. సత్యనారాయణ తెలివితేటల్ని గురించిగాని, అతనికి చదువు పట్ల గల శ్రద్ధాసక్తుల విషయంలోగాని ఎవరికీ ఏవిధమైన అనుమానాలూలేవు.

పద్మ అతని వెనకనే ఇంట్లోకి వెళ్ళింది. తల్లీ, కొడుకూ మాట్లాడుకుంటూ ఉండటం చూసి మళ్లీ వెనక్కి వెళ్ళిపోబోతుండగా సత్యనారాయణతల్లి చూసి కేకేసింది.

"అదేమిటే పద్మా, కొత్తదానివల్లే అలా వెనక్కి వెళ్ళిపోతా వేమిటి ? వాడు వొచ్చేదాకా బావో, బావో అని కలవరించి తీరా వాడు వొచ్చింతరవాత పారిపోతే ఏం లాభం ?"

పద్మ సిగ్గుపడ్డది. వెనక్కీ ముందుకీ వెళ్ళకుండా అక్కడే నిలబడ్డది.

"పూజ మధ్యలో లేచి వొచ్చాను. అది ముగించుకు వొస్తా, మాట్లాడుకుంటూ ఉండండి సరదాగా. వొచ్చే నెలలో ఆ అడ్డంకికూడా తీరితే..." మాట పూర్తిచేయకుండానే సత్యనారాయణతల్లి లోపలికి వెళ్ళిపోయింది.

సత్యనారాయణ పడకకుర్చీలో పడుకుని అలంకారంగా చేతిలో ఓపుస్తకం పట్టుకున్నాడు.

"ఎంత ఇంజనీరింగు చదువయితేమాత్రం అంతగా ఆరోగ్యం పాడయేట్టు చదువుతారా, ఎవరయినా ?" పద్మ అతనికి దగ్గరగా వొచ్చి అంది.

"చదవకుండా ప్యాసవుతారా, ఎవరయినా ?"

"నిజంగా తగ్గిపోయావు సత్యం బావా."

అతను జవాబివ్వకుండా పుస్తకం పేజీలు తిప్పాడు. పద్మ అతనివైపు రెప్పవాల్చకుండా చూడసాగింది. అలాగే కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"మద్రాసు కబుర్లు చెప్పవేం బావా? చదివి చదివి ఇవ్వాళేగా వొస్తివి, అప్పుడే ఆ పుస్తకమేదో ముందరేసుకు కూచున్నావేం?"

అతను తలెత్తి పద్మవైపు ఓసారి చూసి వెంటనే పక్కకి తిప్పాడు దృష్టుల్ని.

"ఏమున్నాయి, కబుర్లు?"

మళ్లీ నిశ్శబ్దం ఆవరించిందా గదిలో. అతని వైఖరి ఆమెకేమీ అర్థం కాలేదు.

"చూస్తే నువ్వు నాతో మాట్లాడ దలుచుకోలేదల్లే ఉంది", అతను పుస్తకం మూసేశాడు.

"ఏం మాట్లాడను?"

పద్మ అతనివైపు "నీకేం జరిగింది?", అనే భావంతో చూసింది.

"ఏం మాట్లాడను?_" ఇంత చచ్చు ప్రశ్న అతనెప్పుడూ అడగలేదు.

"ఇదివరకల్లా ఏంమాట్లాడావు?..."

ఈ మాటలు విని సత్యనారాయణ ఓసారి గట్టిగా గాలి పీల్చి కిటికీలోంచి ఆకాశంలోకి చూశాడు. అతని నుదురుపైన ముడతలు అతను ఏదో ఆలోచనలో పడ్డాడని చెప్పకనే చెబుతున్నాయి. అతని ముఖంలో కాంతి తగ్గింది. ఉండి ఉండి గట్టిగా నిట్టూర్పు వొదలసాగాడు. పద్మ కిదంతా అయోమయంగా ఉంది.

"ఏమయింది బావా నీకు? ఇలా అయిపోయావు."

అత నీమాటలు వినలేదు. ఆమె మళ్ళీ అడిగింది. కాని ఈసారికూడా అతనికి వినబడలేదు. పద్మకి కాస్త కోపం వొచ్చింది. కొంచెం తీక్ష్ణంగా అంది.

"నేను వెడుతున్నా."

ఈ మాటలు కాస్త గట్టిగా అంటంవల్ల అస్పష్టంగా సత్యనారాయణ వినగలిగాడు. పద్మ లేచి నుంచుని మళ్ళీ అంది కోపంగా.

"నీ కంత ఇష్టంలేకపోతే, నేను వెడతాలే."

సత్యనారాయణ ఊహాప్రపంచంనుంచి తిరిగొచ్చి "ఆఁ?" అన్నాడు.

"నేను వెడుతున్నా."

అతను పద్మ వైపు చూశాడు. "వెళ్ళమన్నావా?" అన్నట్టుగా ఆమె అతనివైపు చూసింది. ఆమె వెళ్ళి పోతుందికాబోలన్నట్టుగా అతనికి తోచింది.

"వెడుతున్నావా?"

"ఊఁ ఎన్నిసార్లు చెప్పాలి?"

"ఊఁ" అతను తల కిందికి దించేశాడు. పద్మ రోషంతో చరచర వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోయింతర్వాత అటు వైపే స్థిరంగా చూశాడు సత్యనారాయణ. అతని మెదడులో ఏవేవో భావాలు కదిలాయి. శూన్యంలోకి చూస్తున్న అతని కళ్ళనుండి అశ్రుబిందువులు నేలమీద రాలాయి. వణకుతున్న అతని పెదవులనుంచి "పద్మ" అనే మాటలు వెలువడ్డాయి.

"ఇప్పుడేగదురా పద్మ వాళ్ళింటి కెళ్ళింది," అంది సత్యనారాయణతల్లి అప్పుడే వొస్తూ. అతడు తటాలున పక్కకి తిరిగి కళ్లు తుడుచుకున్నాడు.

"చదువు అయిపోయింది. ఇహ పెళ్లే ఉంది. అది కూడా అయితే"—

సత్యనారాయణ ఏమీ మాట్లాడలేదు.

"పిచ్చిపిల్ల, నువ్వంటే ప్రాణం ! ఎప్పుడూ నిన్ను గురించే, నీ తెలివితేటల్ని గురించే మాట్లాడుతుంది. నిజంగా పద్మలాంటివాళ్లు అరుదురా, సత్యం."

అతను లేచి నిలబడ్డాడు.

"ఇప్పుడే వొస్తానమ్మా, అలా బయటికెళ్లొస్తా."

"ఎంత సిగ్గురా నాయనా ! ఆడవాళ్ళే నయం" అనుకుంది అతని తల్లి. సత్యనారాయణ దుస్తులు కూడా మార్చుకోకుండా, అలాగే బయలుదేరాడు. అతని ముఖంలో కళలేదు. కిటికీలోంచి పద్మ అతనివైపు అర్థంకాని చూపులు చూసింది. ఏమిటిలా అయిపోయాడు? పరీక్ష దిగులు అయి వుండదు. ఒకవేళ పరీక్ష చెడగొట్టినా అంత బేజారయ్యే తత్వంకాదు అతనిది. ఏదో మానసికబాధ అతన్ని పీడిస్తోంది. ఇరవై రెండేళ్ళ సత్యానికి, ఒక స్త్రీని ప్రేమించి ఆమెని వివాహం చేసుకోబోతున్న సత్యానికి మానసిక బాధలు ఏం ఉంటాయో ఆమె కర్థం కాలేదు. బయటికి వెడుతూ సత్యం అతనికి తెలియకుండానే పద్మవాళ్ల ఇంటి వైపు చూశాడు. కిటికీలోంచి తనవైపే చూస్తున్న పద్మని

గమనించాడు. ఒక్క క్షణం అలాగే ఆమెవైపు చూసి గిరు క్కున చూపు మరలించి చకచక నడిచిపోయాడు. కాంతి హీనమైన ముఖంతో పద్మ అతను వెళ్లిన దారివైపు అతను కనిపించేదాకా చూసి తరవాత ఆకాశంలోకి నీళ్లు నిండిన కళ్లని తిప్పింది.

రోజులిలా గడిచిపోతున్నాయి. సత్యనారాయణ వైఖరిలో మార్పేమీ లేదు. పద్మతో అతను సరిగా మన సిచ్చి మాట్లాడలేదు. ఎప్పుడూ దేనినిగురించో దీర్ఘంగా ఆలోచిస్తుంటాడు. రానురాను పద్మకి ఈ పరిస్థితి దుర్భరం కాసాగింది. అతని బాధేమిటో ఖండితంగా అడిగి తేల్చేసు కుని దానికి తగినమందు వెయ్యకపోతే సత్యం తనకి దూర మయిపోతాడని ఆమెకి అధైర్యం కలిగింది. ఇది ఇలా ఉండగా సత్యం పరీక్షాఫలితాలు వొచ్చాయి. అతను సెకండ్ క్లాసులో అనుకున్నట్టుగానే ప్యాసయాడు. అయినా అతనిలో కలిగిన మార్పేమీ లేదు. దీంతో పద్మకి పూర్తిగా గాభరా పుట్టింది.

ఓరోజు మాటల సందర్భంలో అన్నాడు సత్య నారాయణ—

"నాకు మాచెర్ల దగ్గర ఉద్యోగం అయింది పద్మా. రెండుమూడు రోజుల్లో వెడతాను."

ఈ వార్త పద్మకి అశనిపాతంలా అయింది. అసలే ఇలా ఉన్నాడు. ఇహ పరాయిచోటికి కూడా వెడితే ... అయినా లేని ఉత్సాహం తెచ్చుకుని అంది.

"ఎప్పుడు జాయిన్ కావాలి ఉద్యోగంలో?"

"సాధ్యమయినంత త్వరలో."

"బావా, కొన్నాళ్లు ఉద్యోగం లేకపోతేనేం ? బి. ఇ. ప్యాసైనావు. నువ్వు కావాలన్నపుడు పిలిచి ఉద్యోగం ఇస్తారాయె. ఇప్పుడు వెళ్లకపోతేనేం ?"

"వెళ్లాలి పద్మా" అన్నాడు ముక్తసరిగా అతను.

"మళ్లీ ఎప్పుడు రావటం, అయితే!"

"నీ పెళ్లికే" అతను విషాదంగా చిరునవ్వు నవ్వాడు. అది చిరునవ్వు అని ఎవరూ అనలేరు, దానికి భాషలో నిర్వచనం లేదు.

పద్మ సిగ్గుగా పక్కకి తలతిప్పి చిన్నగా నవ్వింది.

"గొప్పవాడివేలే, పెళ్లికి ఎలాగూ వొస్తావు. ఈమధ్య."

"ఈ మధ్య రానేమో ! నీపెళ్ళి చూసి మళ్ళి ఆ రోజే వెళ్ళిపోతాను. నాకు జీవితంలో మిగిలినకోరిక అది ఒక్కటే." పద్మ అకస్మాత్తుగా అతని కళ్ళలోకి చూసింది.

"ఏమిటి?"

సత్యనారాయణ మాట్లాడలేదు.

"ఏమిటి బావా, అసందర్భంగా మాట్లాడుతున్నావు?"

"అసందర్భం ఏముంది? సరేకాని వివాహప్రయత్నంలో ఉన్నారనుకుంటాను మీవాళ్లు."

"ఏమో" తనలో తానుగా అనుకున్నట్లు అంది పద్మ.

"సంబంధాలు ఆలోచించటం లేదా?"

పద్మ సత్యంవైపు వింతగా, విసుగ్గా చూసింది.

"ఏమిటే పిచ్చిమాటలు?"

"పెళ్ళిమాటలు పిచ్చిమాటలని ఎవరంటారు?"

"ఈసారి ఇటువంటి మాటలు రానీయకు."

"పద్మా, మనం దురదృష్టవశాత్తూ స్నేహితుల మయాం. అలా జరగకుండా ఉండాలిసింది."

పద్మ భీతితో అతనివైపు కళ్లార్పకుండా చూసింది.

"నా మీద నీకు చాలా దయఉంది. నేను నీకు ఏమీకాను, కనీసం మనిద్దరం చుట్టాలంకూడా కాదు. అయినా నువ్వు నన్ను చాలా దయతో చూస్తున్నావు. నేను దానికి తగను. మనిద్దరం చిన్నప్పటినించీ ఒకచోట పెరిగాం, చుట్టుపక్కలవాళ్లు కావటంవల్ల మన స్నేహం ప్రగాఢమయింది. స్నేహాన్ని నేను ఒకప్పుడు ప్రేమగా భావించాను." అతను ఆగాడు. పద్మ అధఃపాతాళం లోకి పోతున్నట్టుగా అనుభూతి పొందింది.

"ఏమిటి బావా, ఇది?"

"పద్మా, నన్ను క్షమించు. నేను భగ్నహృదయుణ్ణి."

"అంటే..."

"వివరా లడగకు, పద్మా!"

"అయితే, నువ్వు నన్ను ప్రేమించలేదా?"

సత్యనారాయణ ఒక్క క్షణం ఆగాడు. తరవాత గట్టిగా గాలిపీల్చి దృఢంగా అన్నాడు.

"లేదు."

"అయితే, నన్ను కావాలని మోసగించావా?"

"నిన్ను ప్రేమించటంలేదనిమాత్రమే నేను చెప్ప దలచుకున్నాను."

పద్మ పెదవులు వొణికాయి.

"నువ్వేనా ఇలా మాట్లాడుతున్నది?"

"నన్ను క్షమించు."

"నువ్వే నా సర్వస్వ మనుకున్నాను."

"ఏం చెయ్యను?"

"నా ప్రాణంకంటె అధికంగా ప్రేమించాను. ఇంత అన్యాయం చేస్తావా?"

"నేను నిన్ను ప్రేమించలేకపోయాను. నన్నేం చెయ్యమంటావు?"

"నువ్వు చెప్పినమాటలన్నీ మర్చిపోయావా?"

"నిన్ను వివాహం చేసుకుంటానని ఎప్పుడూ చెప్ప లేదు నీకు."

పద్మ రోషంగా అతనివైపు చూసింది.

"ఇంత నికృష్టంగా మాట్లాడగలుగుతావని నే నెప్పుడూ అనుకోలేదు."

సత్యనారాయణ నిశ్చలంగా కిటికీలోంచి దూరంలోకి చూడసాగాడు.

కాసేపటి నిశ్శబ్దం తరవాత పద్మ నెమ్మదిగా అంది.

"కాని నిన్ను ప్రేమించటం నేను మానలేను. బావా, నా హృదయంలోని ఆరాటం నీకు తెలిస్తే..."

అతనేమీ మాట్లాడలేదు.

"బావా!"

"నువ్వు ఇహ వెళ్ళు పద్మా. మనసుని కలవర పెట్టుకోకు."

"కాని..."

"నువ్వు ఎంత చెప్పినా నా మనస్సు మార్చుకోలేను. బాగా ఆలోచించే నీతో ఈ విధంగా మాట్లాడాను."

కోపంతో ఆమె అతనివైపు చూసింది. తరవాత వెళ్ళిపోవటానికి లేచింది.

"ఒక్క మాట ఇయ్యి పద్మా, ఆత్మ హత్య చేసుకోనని."

"ఆత్మహత్య! నేనంత మూర్ఖురాలిని కాను. కాని ఇంత నీచంగా ప్రవర్తించిన నువ్వు ఆ మాట అన నవసరం లేదు. ఆత్మహత్య చేసుకుని నీ అహంకారాన్ని ఇంకా వృద్ధి చెయ్యను. సెలవు", తిరస్కార సూచకంగా అతని వైపుచూసి గబగబ నడిచిపోయింది పద్మ.

అకస్మాత్తుగా గుండెలో ఏదో బాధ కలిగింది సత్యనారాయణరావుకి. గట్టిగా గుండెమీద చెయ్యివేసి అదిమి పద్మ పోయినవైపు చూసి, బరువు తీరినట్లు ఒక్క నిట్టూర్పు విడిచాడు. తరవాత ఒక క్షణం ఆగి అశ్రువులు కారుతుండగా చేతుల్లో తల దూర్చి బల్లమీద వాలాడు.

ఇది జరిగిన రెండు రోజులకి సత్యనారాయణరావు సూపర్‌వైజర్ ఉద్యోగంలో జాయిన్‌కావటానికి వెళ్ళి పోయాడు. అక్కడికి వెళ్ళిన తరవాత అతను తల్లికి ఓ

ఉత్తరం రాస్తూ పద్మని పెళ్ళిచేసుకోటం తనకి ఇష్టం లేదని రాసేశాడు. ఆమె కిది ఎంతమాత్రమూ అర్థంకాక పద్మని రహస్యంగా పిలిచి అడిగింది– "ఏమైనా పోట్లాడు కున్నారా?" అని. పద్మ లేదంది. తరవాత ఇహ ఆ విషయం ఆమె మళ్ళీ ఎత్తలేదు. ఇదిలా ఉండగా మాటల సందర్భంలో పద్మకూడా తన తలిదండ్రులతో సత్య నారాయణని వివాహం చేసుకోటం తనకిష్టంలేదని చెప్పేసింది.

పద్మకి పరాయి సంబంధం ఓటి స్థిరపరిచారు. అన్ని విధాలా పద్మకి తగిన సంబంధమే. ఆమె కూడా ఒప్పుకుంది. అందరితోబాటు సత్యనారాయణకి కూడా ఆహ్వానం అందింది.

పద్మ వివాహం జరుగుతోంది. "బావ" కోసం ఆమె చూసింది కాని అతను లగ్నంవేళ కూడా ఎక్కడా కనబడలేదు. అతనిపట్ల ఎంత కోపంఉన్నా పద్మకి సత్యం రానిలోటు చాలా పూర్తిగా కనుపించింది. ఆశీర్వచనాలు మిన్నుముట్టుతున్నాయి. బ్రాహ్మణులు, చుట్టపక్కాలు అక్షింతలు చల్లుతున్నారు. ఇదే సమయంలో అంతా "సత్యనారాయణ వొచ్చా" డన్నారు. పద్మ తలెత్తి చూసింది. మనిషి మునుపటికంటే తగ్గిపోయాడు. కళ్ళలో కాంతి లేదు. పద్మకి అతన్ని చూడగానే ఏడుపొచ్చింది. ఎలాగో తమాయించుకుంది.

సత్యనారాయణ ఒక నిమిషం అనిమేషంగా పద్మ వైపు చూశాడు. అతని గుండెలో ఏదో బాధ అకస్మాత్తుగా

కలిగింది. చెయ్యి హృదయంమీద అదిమాడు. తర్వాత మంటపం దగ్గరికివెళ్ళి అక్షింతలుతీసుకుని పద్మకి దగ్గరగా వొచ్చి ఉచ్చైస్వనంతో "దీర్ఘ సుమంగళీభవ!" అన్నాడు. పద్మ తలెత్తి అతనివైపు చూసింది. చప్పున అతను కళ్ళని పక్కకి తిప్పేశాడు— అశ్రువులు సభాసదులకోసం వేసిన ఈతాకులచాపమీాద "టప్ టప్" మని రాలాయి.

సత్యనారాయణ మళ్లీ వెనక్కి తిరిగి చూడలేదు. పెళ్ళిభోజనం కూడా చెయ్యకుండా వెళ్లిపోయాడు సరాసరి తను ఉద్యోగంచేసే ఊరుకి. ఆ వెళ్ళిన సత్యనారాయణ మళ్ళీ దాదాపు సంవత్సరందాకా ఇంటిముఖం చూడలేదు. ఇంటికి రావటం కూడా పుట్టెడు జ్వరంతో వొచ్చాడు. అది టైఫాయిడ్ అన్నాడు డాక్టరు.

ఇరవైఒకటోరోజు గడవాలి. కావలసిన వాళ్ళంతా వొచ్చారు. ఓసారి కళ్ళువిప్పి అడిగాడు సత్యనారాయణ "పద్మ వొచ్చిందా?"

"టెలిగ్రాం ఇచ్చాం బాబూ, ఈపాటికి వొస్తూ ఉంటుంది." అంది అతని తల్లి చీదుతూ.

కాసేపటి తర్వాత—సత్యనారాయణ తల్లిని ఏకాంతంగా పిలిచి తన డైరీని తెప్పించాడు. తరవాత దాంట్లో ఒక పేజీ గుర్తుగా మడిచి ఆమెతో అన్నాడు:

"అమ్మా" నేను ఒకవేళ బతకకపోతే, ఈ కాగితంలో రాసిఉన్నది చదువు. చదవంగానే ఆ పేజీ చింపి తగులబెట్టి వెయ్యి. దాంట్లోని విషయం మాత్రం ఎవరికీ చెప్పకు.

ఎంతమాత్రం చెప్పకూడదు. ఒక్క నిట్టూర్పు విడిచి సత్యనారాయణ మళ్ళీ అన్నాడు. "మనసులోని రహస్యం ఎవరితోనైనా చెప్పివేస్తేగాని మనసుకి ఉపశాంతి ఉండదు. ఇప్పుడు నా మనసులోని బరువుతీరింది. కాని ఈ విషయం నువ్వు ఎవరికీ చెప్పొద్దమ్మా."

"చెప్పను బాబూ" అందామె జలజలరాలే కన్నీళ్ళను తుడుచుకుంటూ.

సాయంత్రానికి పద్మ వొచ్చింది. సత్యాన్ని చూడగానే ఆమె ఆవురుమంది.

"బావా!"

సత్యనారాయణ కళ్ళు విప్పాడు.

"ఎవరు, పద్మా! నా పద్మా! దీర్ఘ సుమంగళీభవ!" సత్యనారాయణ మాట్లాడిన ఆఖరు మాటలు ఇవే; ప్రశాంతంగా కళ్ళుమూశాడు; మళ్ళీ తెరవలేదు.

"దీర్ఘ సుమంగళీ భవ!"— ఈ ఆశీర్వచనం వెనక దాగిన కథ పద్మకి తెలిస్తే ఆమె ఆ క్షణంలో అక్కడే గుండెపగిలి మరణించి ఉండేది. కాని ఆ విషయం ఆమెకి తెలియదు, తెలియబోదు. తెలియరాదని సత్యనారాయణ అనుశాసనం. కాగా హృదయం పగిలి వొచ్చిన "బావా!" అనే ఒక్కమాట, ప్రేమపూర్వకమైన అశ్రువులు మాత్రం పద్మ సమర్పించగలిగింది సత్యానికి.

తన డైరీలో సత్యం గుర్తుపెట్టిన పేజీలో ఇలా రాసి ఉంది.

"ఇవాళ జ్యోతిష్కుడు నా జాతకం చూడటం సంభవించింది. ఇరవై మూడో ఏటితో నా జీవితం ఆఖరని సూచనగా చెప్పాడాయన. ఇంకో విషయం నాకిప్పుడు స్ఫురణకి వొస్తోంది. మా తండ్రి, తాత, ముత్తాతలు ఎవరూ కూడా 30 ఏళ్ళు దాటి బతకలేదట. మా ముత్తాత, తాత, తండ్రి వరసగా ఇరవై తొమ్మిది, ఇరవైఏడు, ఇరవైఅయిదో ఏట చచ్చిపోయారట.

జ్యోతిషంలో నాకంత నమ్మకం లేకపోయినా ఈ పై విషయాల ప్రకారం నా జీవితం 23వ పడితో ఆఖరనే దృఢవిశ్వాసం నాకు కలిగింది.

"అయితే, నా ప్రాణంలో ప్రాణమైన నా పద్మ సంగతేమిటి?" పద్ధెనిమిదో ఏటే ఆమె వైధవ్యం అనుభవించాలా? దుస్సహం. అసంభవం. ఏమైనాసరే ఇలా జరగటం నేను సహించలేను. కాని నేనామెను ప్రేమించి నంతగా పద్మకూడా నన్ను ప్రేమిస్తోంది. ఆమెకి నచ్చ చెప్పటంలో ఫలితం ఉంటుందా అనేది సందేహాస్పదం. ఏమైనాసరే, నా పద్మకి ఈ ఉపద్రవం రాకూడదు. ఏ విధానంవల్లనైనాసరే ఆమె రక్షించబడాలి. నా ప్రాణాధిక మైన నా పద్మా! దీర్ఘ సుమంగళీభవ !"






# మలిన వజ్రాలు

పొద్దున నిద్రలేచినప్పటినించీ రాసిరాసి ప్రాణం విసిగి కాగితాలన్నీ షెల్ఫ్‌లో తోసేసి ఆఫీసునించి బయటపడి పార్కువైపు నడిచాడు, తాలూకాఆఫీసు యువక గుమాస్తా రామమూర్తి. అప్పుడే మసకచీకటి పడ్డది, చల్లగా వీచే పిల్లగాలులు మొద్దుబారిన అతని మనస్సుని మళ్ళీ యథాస్థితికి తేవటానికి ప్రయత్నిస్తున్నాయి. పార్కులో సిమెంటు బెంచీమీద శరీరాన్ని చేరవేసి తీరికగా, దీర్ఘంగా ఒకసారి గాలిపీల్చి, వొదిలేస్తూ తలెత్తి పక్కనకూచున్న ఒకాయన వైపు పరాకుగాచూసి, మనసుకి ఏదో స్ఫురించగా మళ్లీ అతనివైపు దృష్టి సారించి "ఏరోయ్ సుబ్బారావ్!" అన్నాడు రామమూర్తి, అతని భుజంమీద చెయ్యివేస్తూ. అతను అదిరిపడి రామమూర్తివైపు తిరిగి చూసి, "ఓరి, నువ్వేనా, ఎవరో అనుకున్నాను" అన్నాడు.

"ఏం చేస్తున్నావు?"

"చూస్తూనే ఉంటివిగా, ప్రస్తుతం కూర్చునే ఉన్నాను."

"సంతోషించాలే తెలివికి, చదువుతున్నావా, ఉద్యోగం చేస్తున్నావా?"

"ఇంజనీరింగు చదువుతున్నాను. రెండో సంవత్సరం."

రామమూర్తి ఆశ్చర్యంగా అతనివైపు చూశాడు. సుబ్బారావు ఇంత ప్రయోజకుడవుతాడని తనెన్నడూ అనుకో లేదు. స్కూల్ ఫైనల్ దాకా ప్రతి లెక్కా తన పుస్తకంలో కాపీకొట్టిన సుబ్బారావు ఈరోజు ఇంజనీరింగు కాలేజీలో చదువుతున్నాడు! రామమూర్తి నమ్మలేకపోయాడు.

"ఇంటర్మీడియేట్ లో క్లాసు వొచ్చిందా!"

"ఊఁ హుఁ... పెద్ద రికమెండేషన్ ఉందిలే. అంచేత సులభంగానే సీటు దొరికింది."

"అదృష్టవంతుడివే."

"నువ్వేం చేస్తున్నావు?"

రామమూర్తి మనస్సు చివుక్కుమంది. ఏం చేస్తు న్నాడు తను! ఏమని చెప్పుకుంటాడు! అధోముఖంగా చూస్తూ అన్నాడు.

"తాలూకాఫీసులో..."

"ఏం? చదువు మానివేశావా?"

"ఊఁ" రామమూర్తి గడిచిపోయిన రోజులు జ్ఞాపకం చేసుకుంటూ నెమ్మదిగా అన్నాడు.

"ఎందుకు?"

"ఎందుకేమిటి? డబ్బులేక. లేకపోతే ఎందుకు మానేస్తాను?" కఠినంగా, విచారంగా అన్నాడు రామమూర్తి. స్కూల్ ఫైనల్‌లో హైస్కూల్ అంతటికీ ప్రథముడుగా వొచ్చాడతడు. పైకి చదవాలని ఎంతో ప్రయత్నించాడుగాని అది సాగలేదు. ఆ సంవత్సరమే అతని తండ్రికూడా చనిపోయాడు. అంచేత తప్పనిసరిగా ప్రభుత్వోద్యోగంలో చేరాడు. ఉద్యోగంలో చేరిన రెండో సంవత్సరమే అతనికి పెళ్ళికూడా అయింది. ఆ రోజులన్నీ అతనికి కళ్ళకి కట్టినట్టుగా కన్పిస్తున్నాయి.

"మనతో వాడెందుకు మాట్లాడతాడురా, ఉద్యోగి అయినాడాయెను." అనే మాటలు విని రామమూర్తి తలెత్తి చూశాడు. ఎదురుగా అతని క్లాస్‌మేటు విశ్వనాథం నుంచుని ఉన్నాడు. సుబ్బారావు రామమూర్తి వీపుతట్టి అన్నాడు: "విశ్వనాథం జ్ఞాపకం ఉన్నాడా?" రామమూర్తికి నవ్వొచ్చింది. ఎందుకు జ్ఞాపకం ఉండడు? తనేమైనా ఆఫీసరా ఏమిటి జ్ఞాపకం ఉండకపోవటానికి? చిరునవ్వు ముఖంమీదికి తెచ్చుకుంటూ అన్నాడు.

"ఏరా, విశ్వనాథం, ఏం చేస్తున్నావు!"

"ఎం. బి. బి. యస్. చదువుతున్నాను."

ఎం. బి. బి. యస్! కొన్నాళ్ళకి డాక్టరవుతాడన్న మాట. తన స్నేహితుల్లో పైకి చదవనివా డెవడూ లేడల్లే ఉంది. ఒకడు ఇంజనీరు, ఒకడు డాక్టరూ - మిగతావాళ్లు

ఏమేం చదువుతున్నారో! తనుమాత్రం ఎప్పటి ఎస్. ఎస్. ఎల్. సి. రామమూర్తే.

"తాలూకాఫీసులో గుమాస్తాగా చేరావుటగా?" రామమూర్తితో కలిసి చదువుకునే రోజుల్లో అతనిమీద తనకి ఏర్పడ్డ అసూయ అంతా తీర్చుకుంటూ అన్నాడు విశ్వనాథం.

రామమూర్తి ముఖం ఎర్రబడ్డది. తన పుస్తకంలో లెక్కలన్నీ మక్కీకిమక్కీ కాపీకొట్టిన వీళ్ళు ఈరోజు తన నెంత చులకనగా చూస్తున్నారు! తెలివిలోగాని, పట్టుదలలో గాని గుణంలోగాని తనకంటే వీళ్ళ ఆధిక్యత ఏమిటి? తనతో చదరంగం ఆడి ఒక్క ఆటైనా ఎప్పుడైనా గెలవ గలిగారా వీళ్లు? గంటల తరబడి బెంచీలమీద నుంచున్న వీళ్లు ఇప్పుడు ఇంజనీర్లూ, డాక్టర్లూ. తనుమాత్రం ఓతాలుకాఫీసు గుమాస్తా! తనకంటే వీళ్లు ఒక విషయంలోమాత్రం అధికులు-డబ్బులో, ఆ ఒక్క అధికృతతో తనని నోరెత్తకుండా అణగగొట్టగల అవకాశం వీళ్ళకి లభించడం ఘోరం, దురన్యాయం. తనకి కూడా కాలేజీలో చదువగల అవకాశమే లభిస్తే...! ఎందుకు అనుకోటం? గాలిలోమేడల ఆకారాలు ఊహించుకుని చేసే దేముంది? ఉన్నదాంతో తృప్తిపడకతప్పదు.

"ఏమిటోయ్ మీ మాటలూ, నాకుకూడా చెప్పండి కాస్త" అన్నాడు రామమూర్తి కాసేపైనా స్నేహితులతో కులాసాగా గడుపుదామని తీర్మానించుకుని.

"హి...హి...హి...నీకేం అర్థమవుతాయి కాలేజీ గొడవలు." పళ్ళికిలించాడు విశ్వనాథం.

"హి...హి...హి..." అన్నాడు సుబ్బారావు కూడా.

ఆఫీసులో ఆఫీసర్ మీద వచ్చిన కోపాన్ని ఎలాగో దిగమింగుకుని పార్కుకివచ్చిన రామమూర్తి తనకి తన స్నేహితులవల్ల జరిగిన అవమానాన్ని సహించలేక చివాలున లేచి ఇంటికి బయలు దేరాడు, "వొస్తా" అని మాటమాత్రం అంటూ.

* * *

రామమూర్తి ఇంట్లో అడుగు పెట్టేసరికి ఇల్లంతా చీకటిగా ఉంది.

"లాంతరు వెలిగించలేదేం?" అన్నాడు అతను చిరాకుగా.

"గ్లాసు పగిలిపోయింది."

"ఎందుకు పగిలింది?"

"చేతిలోంచి జారింది."

"ఎందుకు జారింది?." కోపంతో ప్రశ్నించాడు రామమూర్తి.

"పగిలిపోయిన గ్లాసుముక్కల్ని అడగండి." జానకి నిర్లక్ష్యంగా జవాబిచ్చింది.

"చిమ్నీ వెలిగించకపోయావు అయితే?" ముఖం చిట్లించుకుని అన్నాడు రామమూర్తి.

"దాంట్లో కిరసనాయిలు లేదు."

"లేకపోతే పొయ్యక్కర్లే!"

"కిరసనాయిలు అయిపోయిం దింట్లో."

"ఏడ్చినట్టే ఉంది. ఆ బుడ్డీ అయినా వెలిగించు."

"నిప్పుపెట్టె లేదు."

జేబులోంచి నిప్పుపెట్టె తీసి విసురుగా ఆమెవైపు విసిరేశాడు రామమూర్తి.

"ఎవరిమీద ఆ కోపం!"

"నోరు ముయ్యి."

"అదే అనవద్దని లక్షసార్లు చెప్పాను. నే నలా మాటలు పడేదాన్ని కాను"

"ఇహ చాలించు."

"అనవసరంగా అలా కలగ చేసుకుంటారెందుకు? ఆఫీసర్ మీద కోపం అంతా ఇంట్లో చూపిస్తే ఏం లాభం?"

"ఇక్కడినించి కాసేపు అవతలికిపో."

"అవతలికి పోవటానికి ఉన్నది ఒకటే గది."

"నాకు శాంతిలేకుండా చేస్తున్నావు ఛీ" చీదరించుకున్నాడు రామమూర్తి జానకి అతనివైపు కోపంగా, ఏవగింపుగా చూసింది. ఆమెకి అప్రయత్నంగా కళ్ళవెంబడి నీళ్లు కారాయి. ఆమె కలలోకూడా అనుకోలేదు తన జీవితం ఇలా గడుస్తుందని నాలుగేళ్ళకిందట తన ఆశలు, ఆశయాలు కఠినంగా, నిర్దాక్షిణ్యంగా తోసివేయబడ్డాయి. తనేం చదువులేనిది కాదు. పూర్తి చేయలేదు కాని ఎస్. ఎస్. ఎల్. సి దాకా చదివింది. ఆరోజుల్లో తన భావాలు, మధుర భావనలు తలచుకుని ఆమె ఆవేదన పడసాగింది. రూపం,

విద్య చక్కని ఆశయాలుగల తను కేవలం ధనవంతురాలు కానంత మాత్రాన తనతో సమానంగా చదువుకున్న అతనిని—సామాన్య గుమాస్తాని, తన ఇష్టానికి వ్యతిరేకంగా, బలవంతంగా పెళ్లి చేసుకోవాలి సొచ్చింది. ఒక్క క్షణంలో ఆమె కోరికలన్నీ గగనకుసుమా లయాయి. కష్టాలతో. అర్థాకలితో, భర్త చీవాట్లతో రోజులు గడపాలి సొస్తుందని తను కల్లోకూడా అనుకోలేదు. తతిమా సంగతు లేలా ఉన్నా, పోనీ భర్తయినా తనని సరిగా ఆదరిస్తే అంత బాధ ఉండకపోను. కాని ఆయ నెప్పుడూ మనసులో ఏదో పెట్టు కొని బాధ పడుతూ చిర్రు బుస్సులాడుతూ ఉంటాడు. నిజానికి పాపం. పని ఎక్కువే ఐనా అంతా అలాగే ఉంటు న్నారా ఏమిటి ? ఎవరిమీదో కోపం ఇక్కడ ప్రదర్శించు కోటం ఎందుకు ? అయినా మనస్సులో ఉంటుంది కాని—ప్చ ఆ మాత్రం సంస్కారం యెక్కణ్ణుంచొస్తుంది, విద్యలేకపోతే! కనీసం బి. ఏ. ప్యాసయిన వాడిని పెళ్ళి చేసుకోవాలని తను ఉబలాట పడ్డది. కాని—అయినా ఇప్పు డవన్నీ తవ్వుకుని విచారిస్తే ఏం లాభం ? ఐపోయిందేదో ఐపోయింది. అనవస రంగా ఈ వెధన ఆలోచన ఏమిటి తనకి ?

"అన్నం పెట్ట దల్చుకోలేదా ?"

జానకి రామమూర్తి ప్రశ్నవిని ఊహా ప్రపంచం లోంచి తిరిగి వచ్చింది. అదేం అడగటం? రాజీకొచ్చిన ఆమెభావాలు మళ్లీ తిరగబడ్డాయి. యాంత్రికంగాలేచి వడ్డించింది.

"నెయ్యి?"

"లేదు, ఐపోయింది."

రామమూర్తి విసుగ్గా ఆమెవైపు చూసి నెయ్యి లేకుండానే తినటం ప్రారంభించాడు.

"ఇంకేం లేదా ?"

"లేదు."

"సరే, మజ్జిగపొయ్యి."

"లేదు."

"ఏం ?"

"పిల్లి పారబోసింది."

"నువ్వేం చేస్తున్నావు ?"

"ఒక పనైతేగా, పిల్లికి కాపలా కూర్చోటానికి."

"మరయితే ఎలా ఇప్పుడు ?"

"ఏం చేయను ?"

"ఏం చేస్తావు ? నూతిలో దూకు." మండిపడి అన్నాడు రామమూర్తి.

"గుమస్తా అధికారం ఇంట్లోనే అని బాగా రుజువు చేసుకుంటున్నారు."

"ఏమిటే, వాగుతున్నావ్ ?" ఉద్రేకంతో లేచి చేత్తో ఫెడేమని జానకి చెంపమీద బలంకొద్దీ కొట్టాడు రామమూర్తి.

ఇదివరకల్లా అభిమానమూ, హృదయమూ మాత్రమే అయితే ఈసారి శరీరం కూడా దెబ్బతిన్నది జానకికి. ఆమె

కళ్ళవెంబడి అశ్రువులు బొటబొట కారాయి. రుద్ధకంఠంతో అంది:

"తిండి తిన్నా తినకపోయినా, తిట్లూ, దెబ్బలూ మాత్రం దండిగానే తింటున్నాను.

ఆమె నున్నటి చెంపమీద తన ఐదు వేళ్ళూ ఎర్రసిరా ముద్రలాగా పడటం ఆ గుడ్డి వెలుతురులో కూడా స్పష్టంగా చూసి "ఓరి పశువా, ఏంచేశావురా ?" అని తనని తానే స్వగతంలో ప్రశ్నించాడు రామమూర్తి.

"జానకీ." జానకి కన్నీళ్ళను అణచుకుంటూ తల పక్కకి తిప్పుకుంది.

"నిన్నే జానకీ! నెలకి అరవైఏడు రూపాయలకి ప్రభుత్వానికి అమ్ముడుపోయిన ఈ చెయ్యికి నిన్ను కొట్టటానికి అధికారం ఎవరిచ్చారో అడుగు."

జానకి పమిటచెంగుతో కళ్లు తుడుచుకుంది.

"అడగవేం, నిన్నే !" గట్టిగా అరిచాడు రామమూర్తి.

జవాబు రాలేదు.

"అద్దెకి పోయిన ఈ శరీరానికి నిన్ను స్పృశించటానికి కూడా అధికారం లేదు. తిండిపెట్టే శక్తి లేకపోయినప్పుడు నీవైపు చూడటానికి కూడా అధికారం లేదు, ఈ గుమాస్తాకి. అధికారంలేని పని చేసినందుకు దీనికిదే శిక్ష."

స్టేట్‌మెంట్లు గియ్యడానికి తెచ్చుకున్న రూళ్ళ కర్రతో, అరచెయ్యి బల్లమీద పెట్టి ఫెడీమని ఉన్న బలం అంతా ఉపయోగించి చేతివేళ్ళమీద కొట్టాడు. చప్పుడు

విని జానకి తలెత్తి కమిలిపోయిన రామమూర్తి అరచెయ్యి చూసి కెవ్వన కేకేసింది. రామమూర్తి చెయ్యివైపు చూసి పిచ్చివాడిలా నవ్వాడు.

"రెండో చెయ్యి ఇహ బుద్ధిగా ఉంటుందిలే." ఆపుకున్నా ఆగని కన్నీళ్ళతో జానకి అతనివైపు చూసి గబగబ తడిగుడ్డ తెచ్చి అతని చేతికి కడుతూ కంపితస్వరంతో అంది.

"ఏమిటండీ ఇది ? మీ కేమైనా మతిపోయిందా ?"

"జానకీ, పెళ్ళి కాకముందు నన్ను చూసి నేనే జాలి పడేవాణ్ణి. ఇప్పుడు నిన్ను చూసి కూడా నేను జాలిపడాలి పొచ్చింది. ఇద్దరి ప్రాణుల నిరాశ, తీరని కోరికలు పెట్టే బాధా నాకు విశ్రాంతిలేకుండా చేశాయి. కేవలం డబ్బు లేక పోవటంచేత నా తెలివితేటలూ, జీవితం వ్యర్థమైపోతున్నాయి. అలాగే కేవలం ధనాభావంచేతే నీ కోరికలు, అందచందాల వ్యర్థమైపోయాయి. నాకు తెలుసు. నువ్వు కలలో కూడా నాలాంటివాడు నీకు భర్త అవుతాడని ఊహించుకోలేదు. నేను నీకు తగనని నాకు తెలుసు. నాలో ప్రత్యేకత ఏమీలేదు. నేను చదివింది నువ్వూ చదివావు. నాకున్న రూపంకంటే నీకు యెక్కువే ఉంది. అయితే మాత్రం ఏం, నీకు డబ్బులేదు. అంచేత నీకు సౌఖ్యంలేదు. నాకూ అంతే. డబ్బులేదు కనుక చదువులేదు. చదువులేదు కనుక సౌఖ్యం లేదు. ఈ రెండులేవు కనుక మనసుకి విశ్రాంతి లేదు.

"మనసుకి విశ్రాంతి లేకపోబట్టే ప్రపంచంమీద వచ్చిన కోపాన్ని మరోవిధంగా తీర్చుకునే అవకాశం లేక

పోబట్టే నీమీద అలా అప్పుడప్పుడు విరుచుకుపడడం. అంచేతే గుమాస్తా అధికారం ఇంట్లోనే అని రుజువు..."

"ఇంకెప్పుడూ అనను" అని జాలిగ అంది జానకి.

"నువ్వనే దేమిటి? నాకు తెలియదూ! నీకు తిండి పెట్టినా పెట్టకపోయినా, తిట్లు, దెబ్బలూ మాత్రం..."

"ఏమిటీ గొడవమీరింత బాధపడుతున్నారని నే ననుకోలేదు." అంది జానకి సానుభూతిగా.

"నేను పైకి చదవడం అసంభవం. నీకు మళ్లీ పెళ్ళి కావటం అసంభవం, కనుక",

"ఛీ, ఏమిటా మాటలు." జానకి రామమూర్తి నోరు మూసింది తన కరపల్లవంతో. దగ్గరికివచ్చిన జానకి చెంప మీాది ఎర్రని గుర్తుచూసి హృదయంలోని బాధను అణుస్తూ లేని నవ్వు తెచ్చుకుని అన్నాడు అతడు:

"దెబ్బకి దయ్యం పారిపోయిందా?"

"దయ్యం పట్టింది మీాకే" అంది జానకి.



